అర్థము. వికిరంబులన్ = పక్షులను, అక్కజమున్ = ఆశ్చర్యముచే, తరువులన్ = చెట్లను, రేఁగు = విజృంభించు, వాలిమెకము = సింహము, మలన్ = పర్వతమును, పొరలించుచున్ = విఱుగఁ ద్రోయుచు; ఇప్పుడు మనుష్యులవలె రెండుకాళ్ళచే గాక వానరుని వలె నాలుగు పాదముల నడచెనని తోఁచుచున్నది.

తాత్పర్యము

హనుమంతుఁడు పక్షుల బెదరించుచు, మృగసమూహమును నదలించుచు తోఁక పార్శ్వభాగంబులచేఁ జెట్లు విఱిగి నేలఁబడ హుమ్మని తాఁకుచుఁ, గొండను నూఁగులాడించుచు విజృంభించిన సింహమువలెఁ దిరిగెను.

చం. అసితము లోహితంబును సి • తాసితవర్ణము నానుపన్నమై
పొసఁగిన పచ్చరంగులను • బొంపిరిపోవుచు ధాతుకోటిచేఁ
బసగల యక్షకిన్నరసు • పర్వసుపర్వనిభాహినిర్జరీ
విసరపరిష్క్రియాతతి • విస్తృతిచేఁ హృదయంగమంబునై. ౬

అర్థము. అసితము = నలుపు, లోహితము = ఎఱుపు, సితాసిత వర్ణము = తెలుపు నలుపు కలిసిన చిత్రపువన్నె, బొంపిరిపోవుచు = అతిశయించుచు, ధాతుకోటిచేన్ = పర్వత సంబంధ ధాతువులచే (లోహాదులచే) సుపర్వ = దేవతలయు, సుపర్వనిభ = దేవతలతో సమానములగువ, అహి = పాములయు, నిర్జరీ = దేవతా స్త్రీలయు, విసర = సమూహములచేతను, పరిష్క్రియా = వారు ధరించిన యలంకారములయొక్క, వితతి = సమూహముల, విస్తృతిచేన్ = విస్తారముచేతను, హృదయంగమంబునై = మనస్సు నాకర్షించునదియై, (మహేంద్రనగముతో నన్వయము) ఇది మహేంద్రపర్వతవర్ణనము.

తాత్పర్యము.

నలుపు, తెలుపు, నలుపు తెలుపు గలిసిన చిత్రవర్ణము, ఆకుపచ్చగల పచ్చరంగులచే వృద్ధిచెందిన లోహములచేతను, స్ఫటికాదులచేతను, మిసులకాంతిగల యాభరణములచే నలంకరించుకొన్న యక్షులు, కిన్నరులు, దేవతలు, దేవతాసములైన పన్నగులు, దేవతాస్త్రీలు వీరి గుంపులచేతను మనోహరమై.

క. మత్తిలి నాగవరంబులు, నెత్తఱిఁ జరియించు నామ • హేంద్రనగమునన్
జిత్తము లుగురొత్త మనువ్వన, హత్తిన నాగంబువోలె • వరుఁడు వెలింగెన్. ౭

అర్థము. మత్తిలి = మదించి, నాగవరంబులు = శ్రేష్ఠము లయిన యేనుఁగులు, ఎత్తఱిన్ = ఏకాలమందును, ఉగురొత్తన్ = సంతోషముచే నతిశయింపగా, హత్తిన = ఉండిన, నాగంబు = ఏనుఁగు.

తాత్పర్యము.

మదించిన యేనుఁగులు సర్వకాలములందు సంచరించు నా మహేంద్ర పర్వతమునందు సంతోష మతిశయించుచు నుండఁ మనుఁగులోని యేనుఁగువలె విచ్చలవిడి సంచరించుచు హనుమంతుఁడు ప్రకాశించెను.

The Mahendra range, so called from Indra, the tutelary god of the East, is identified with the Eastern Ghats, which run in a succession of ranges from Orissa in a South and Westerly direction almost along the Eastern Coast of the Deccan until they lose themselves in the Malaya range to which it is linked by the Nilagiris and the Palni hills on the South. According to Valmiki both Hanuman and Rama passed on from the Malaya to the Mahendra Range, on the sea coast opposite which, on the other side of the channel, was Lanka. It is thus evident that the Southern extensions of the Mahendra Range, known at present under various names such as Kumbhakamdrug (opposite lake Pulicat), Nagari Nose, Jawadi Hills, Kalrayan, Pachmalais, Kolla-malais and Alagar hills (near Madura) formed the natural Eastern barrier of the Deccan, which kept off the Bay; and that the low irregular tracts which now lie between the hills and the Sea, as the deltas of the Pennar (Pinakini) and the Vellar, the Coleroon, the Kaveri and the Viaga, were, like lower Bengal, subsequent formations due to alluvial deposits of the rivers and recess of the sea. The channel which seperated Lanka from the main land probably extended at that time up to the spurs of the Mahendra range (Alagar hills) near modern Madura, and was 100 Jojans (nearly 150 miles) in extent and was studded with islets and shoals, as described in the Ramayana. The causeway constructed by Rama would thus appear to have been very nearly along the lower course of the Vaiga (not mentioned in the Ramayana) which flows through Ramnad into the sea, opposite Rameswaram The distance between India and Ceylon at present is about 60 miles. [The Ancient Geography of Asia P. P. 43 and 44]

క౦. రవికిని పాకవిరోధికిఁ, బవనునకు స్వయంభువునకుఁ • బలువేల్పులకున్
సవినయముగ నతి సేసి, పవమానసుతుండు చనఁగఁ • బయనము బూనెన్. ౮

అర్థము. రవికిని = సూర్యునకు, పాకవిరోధికిన్ = పాకుఁడను రాక్షసుని జంపిన యింద్రునకు, పవనునకున్ = వాయుదేవునకు, స్వయంభువునకున్ = బ్రహ్మకు, పలువేల్పులకున్ = నానా దేవతలకు, నతి = నమస్కారము, పవమాన సుతుండు = వాయుపుత్రుఁడు, అంజనేయుఁడు పయనము = ప్రయాణ శబ్దభవము, రవి = ఈయన విద్యాగురువు. కావునఁ దొలుత నమస్కరించెను. దీనిచే నేకార్యము నందైనను గురు నమస్కారము గావించియే తరువాత దేవతాది నమస్కారము గావింపవలె నని సూచితము. పాకవిరోధి = తాను రాక్షసులతో విరోధింపఁ బోవు చున్నాఁడు కావున రాక్షసవిరోధి యగు నింద్రుని సాహాయ్యము గోరి నమస్కరించెను.

తండ్రి గావున నాయన బలవేగములు గలుగ వాయుదేవునకు నమస్కరించెను. బ్రహ్మాస్త్రమువలన బాధలేకుండ బ్రహ్మను బ్రార్థించెను. ఇచ్చలనోవనున

గాన వచ్చెడిని. బాల్యమందుఁ దాను సూర్యుని గ్రహింపఁ బోవ నింద్రుండు వజ్రాయుధముతోఁ గొట్టఁగా వాయువు స్తంభించి నపుడు బ్రహ్మాదులు వచ్చి వరములిచ్చిరి. కావున నా బలముగురించి పేర్మి వరుసగాఁ జెప్పఁబడెను. ఆ నాఁడు మీ రిచ్చిన వరము లిప్పుడు ఫలింప ననుగ్రహింపుఁ డని వారిని బ్రార్థించెను. దీనిచేఁ గార్యారంభమందు గురువునకు నిష్ట దేవతలకు నమస్కరించుట విధియని యేర్పడు చున్నది.

తాత్పర్యము.

సూర్యునకు, నింద్రునకు, వాయుదేవునకు, బ్రహ్మకు, నక్కడ దేవతలకు నంజలితో నమస్కరించి యాంజనేయుడు ప్రయాణమై.

కం. తూర్పుముఖుఁడై తండ్రికి, మారుతునకు నంజలిని స•మర్పించి క్రియా
శూరుండు దక్షిణదిశగా, నీరనిధి దాఁటఁ మేను • నిగిడించెన్. ౯

అర్థము. మారుతునకున్ = వాయుదేవునకు, క్రియాశూరుండు = ఇతరు లేమాటలు చెప్పిరో దానిని సాధింపఁ గలవాఁడు, నీరనిధిన్ = సముద్రమును, నిగిడించెన్ = పెంచెన్, మీఁది పద్యమందు వాయుదేవుని దేవభావముతో నమస్కరించెను. ఈ పద్యమం దాయన తండ్రి కావున జనక భావముతో నమస్కరించెను. కావుననే 'తండ్రికి' అను పదము చేర్పఁబడెను.

దీని వలన గురుదేవతలను వలెఁ బ్రత్యక్షదేవత తండ్రికిని నమస్కరింపవలె నని సూచితము. తా నిప్పుడు దక్షిణముఖుఁడై యున్నాఁడు. దక్షిణాభిముఖుఁడై నమస్కరింపరాదు. గావునఁ దూర్పు తిరిగి నమస్కరించి మరల దక్షిణ ముఖముగఁ దిరిగెను. శుభకార్యము లన్నియుఁ దూర్పు ఉత్తరము తిరిగి చేయవలెను. అశుభకార్యము దక్షిణముఖుఁడై చేయవలెను. నిద్రకు నుత్తరము నిషిద్ధము.

తాత్పర్యము.

తూర్పు దిక్కు తిరిగి తండ్రి యగు వాయుదేవుని నంజలి ఘటించి నమస్కరించి కార్యసాధన మందు సమర్థుఁడగు హనుమంతుఁడు మరల దక్షిణ ముఖము తిరిగి సముద్రమును దాఁటుటకు దేహమును పెంచెను.

కం. ప్లవనకృతనిశ్చయుం డై, పవమానసుతుండు రామ•పనికై తన్నుం
బ్లవగతతి గనఁగఁ బర్వపు, దివసంబున జలధి యనఁగ • దేహము పెంచెన్. ౧౦

ప్లవన=దాఁటుటయందు, కృత=చేయఁబడిన, నిశ్చయుండు = నిశ్చయముగలవాఁడు, ప్లవగ తతి = వానర సమూహము, పర్వపు దివసంబునన్ = పున్నమనాఁటియందు.

తాత్పర్యము.

హనుమంతుఁడు రాముని కార్యము సాధింప సముద్రమును దాఁట నిశ్చయించుకొన్నవాఁడై వానరు లందఱుఁ జూచుచుండఁ బున్నమనాఁటి సముద్రమువలె దేహమును పెంచెను.

—• హనుమంతుని విక్రమమునకు మహేంద్రాద్రి చీకాకుపడుట •—

కం. కొలఁదికి మీఱిన శరీరము, పొలుపారఁగ నబ్ధి దాఁటు•పూనికను మహా
బలసుతుఁడు పర్వతముఁ జే, తులతోఁ జరణములతోడఁ • దూఁగాడించెన్. ౧౧

అర్థము. మహాబలసుతుఁడు = వాయుపుత్రుఁడు, హనుమంతుఁడు, తూఁగాడించెన్ = ఊఁగులాడించెను. ఇది శబ్దపల్లవ క్రియ. తూఁగు+ఆడు=తూఁగాడు.

తాత్పర్యము.

మితిమీఱిన శరీరముతో, సముద్రమును దాఁటు పూనికతో హనుమంతుఁడు రెండుచేతులతోను గాళ్ళతోను గొండను నూఁగు లాడించెను.

కం. అచలం బయ్యె ముహూర్తము, ప్రచలిత మయ్యెం గపీంద్ర•పరిపీడిత మై
యచలానుహములు సుమనో, నిచయంబుల నెల్ల రాల్చె • నింపం గొండన్.

అర్థము. అచలము = కదలనిది, పర్వతము. ప్రచలితము = మిగులఁ గదలినది. పరిపీడితము = మిగుల బాధింపఁబడినది. బలవంతముగ నూఁచుటచే నని భావము. అచలానుహములు = వృక్షములు, అచలా = భూమి, సుమనోనిచయంబులన్ = పూలగుంపును.

తాత్పర్యము.

ఆ మహేంద్రపర్వతము కదలని దయ్యె హనుమంతుఁడు బలవంతముగా నూఁచుటచే మిగులఁ గదలిన దయ్యెను. పర్వతము ముందు వెనుకకు నూఁగుటచే దానియందలి చెట్లన్నియుఁ బూలను గొండనిండ జలజల రాల్చెను.

కం. అమ్మహీజమ్ముల రాలిన, ఘుమ్మను క్రొత్తావి బుగులు•కొను కుసుమసమూ
హమ్ముల నెల్లనఁ బుష్పమ, యమ్ముగ శైలమ్ము దనరె • నతిరమ్యంబై. ౧౩

అర్థము. మహీజమ్ములన్ = చెట్లనుండి. క్రొత్తావి=క్రొత్తవాసన, క్రొత్త + తావి = క్రొత్తావి, బుగులుకొను = పరిమళించు, కుసుమ = పూవుల, నెల్లనన్ = అతిశయముచే, పుష్పమయమ్ముగన్ = పూలతో నిండినదిగ.

తాత్పర్యము.

ఘుమ్మని క్రొత్తవాసనలచేఁ బరిమళించు పూలు విస్తారముగఁ జెట్లనుండి రాలుటచే నా పర్వతము పూలపర్వతము వలె మిగుల నందమై యుండెను.

కం. ఉత్తమవీర్యం డగు కపి, సత్త్వముచేఁ బీడ చెంది • శైలంబు జలం
బత్తఱిఁ గార్చెను మదమును, మత్తమతంగజము కార్చు•మాడ్కిం జెలువన్. ౧౪

తాత్పర్యము.

ఉత్తమ పరాక్రమముగల కపి వాయుసునిచేఁ బీడింపఁబడి యా పర్వతము మదించిన యేనుఁగు మదము కార్చునట్లు నీళ్ళవంకలు పాఱునట్లు చేసెను.

కం. వడ వడ వడఁకెడి శైలము, నడుమను మడికాసు పైఁడి • నవ్యాంజన ముం
జెడి ధారలవాళ్ళు కానం,బడియెను దరతరమ ముసుఁగుఁ • బాపిన భంగిన్. ౧౫

అర్థము. మణికాసు = వెండి, నవ్యాంజనము = క్రొత్తకాటుక, ఇది మిగుల నలుపై యుండును.

తాత్పర్యము

గడగడలాడుచున్న కొండవలనను వెండి బంగారు క్రొత్త కాటుకవంటి లోహము లుండెడి పొరల చాళ్ళు ముసుగు తీసి వేసిన కానవచ్చు నట్లొకటి వెంట నొకటి కానవచ్చెను. ఆయారాలు పగులు నప్పటికి వానిలోనుండి యీ విధములైన చాఱలు కనఁబడిన వని భావము.

క. ధగ ధగ మను నడిజ్వాలయు, బొగఁ గ్రక్కెడి వహ్నిభంగిఁ • బొరి మణిశిలలన్
వగు పెనుబండలఁ గ్రోచెను, దిగువబడ మహేంద్రవనగ మా•తిద్రుతరీతిన్. ౧౬

అర్థము. వహ్ని = అగ్ని, అతిద్రుతరీతిన్ = మిగుల వేగముతో, నడిజ్వాల= అగ్నిహోత్రమునకు కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ యని యేడు విధముల జ్వాలలు గలవు. దానిలో నడిమిది ధూమ్రవర్ణయని కొందఱు, అగ్నిహోత్రము మండునప్పుడుండు మంట జ్వాలలు పొగతోఁ గూడి యుండును. నడిమి జ్వాల పొగలేక యుండును. దానివలె నని కొందఱు.

తాత్పర్యము.

మండెడు నగ్నిహోత్రము నడిమిజ్వాలచే ధగధగమని మండు మంట లందు జ్వాలలచేఁ బొగను వెళ్లు గ్రక్కునో యట్టులే పర్వతము నడుమ మణిశిలలను వంచునఁ బెద్ద బండలను గ్రక్కెను.

గ్రక్కుట వాంతి చేసికొనుట యివి ముఖ్యార్థమున జుగుప్సాకరములు కావునఁ బ్రయోగింపరాదు. గౌణార్థమునఁ బ్రయోగింప నగు.

నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.

కం. గడగడ టాడఁగ శైలము, వడఁబడి గుహాలందుఁ బొదలు • వనసత్త్వంబుల్
నొడిఁబడి యడలెడు రవముల, బుడిబుడి నిగిడించె నెసలుఁ • బుడమియు నింగిన్.

అర్థము. వనసత్త్వంబుల్ = అడవిమృగములు, వడఁబడి = బాధపడి, నొడిఁబడి = త్రొక్కుపాటుచెంది, అడలెడు రవములన్ = ఏడ్పుధ్వనులను, బుడిబుడిన్ = తత్తరపాటుతో, నిగిడించెన్ = వ్యాపింపఁజేసెను.

తాత్పర్యము.

ఆ కొండ గడగడ వడఁకఁగా బాధపడి గుహాలందున్న యడవి మృగములు త్రొక్కుపడి యేడ్పు ధ్వనులచే భూమి యాకాశము వ్యాపింపఁజేసెను.

చం. ప్రకటమహేంద్రసానునగ • భాగ చరిష్ణుభుజంగకోటి స్వ
స్తికవరలక్షణోల్లసిత • తీవ్రఫణంబుల విచ్చి యుగ్రవా
వకసిభవహా విషంబు నట • వాడక హోమ్మనఁ గ్రక్కి నుండులన్
వికటరదంబులం గొఱుకఁ • బెళ్లఁ బడీలున నేయుచున్నలై. ౧౮

తాత్పర్యము.

ఆ స్త్రీలాకాశమందు తమ ప్రియులతో నిలిచి వచ్చెను, హనుమంతుని భయంకర కార్యమున కాశ్చర్యపడుచు, దేహములు మఱచినవారై కాంతిపొందిన యగు హనుమంతుని జూచిరి.

కం. విద్యాధరవరముఖ్యులు, విద్యలవిభవంబు నెఱయ • బృందంబులుగా
నై ద్యోవీథిని నిలఁబడి, కోద్యంబుగఁ గనిరి నగము • కో ప్లవనేశున్. ౨౮

అర్థము. బృందంబులుగా = గుంపులుగా, ద్యోవీథిని = ఆకాశమార్గమునందు, 'ద్యోవాహిని' యని ఎలకూచి బాలసరస్వతి దశావతార స్తోత్రములందుఁ బ్రయోగించి యున్నాఁడు. 'కన్యాత్రింశద్దికికల్పితావతరణాద్యోవాహినీసంగమా,' యని కూర్మావతార వర్ణనము. విద్యాధర వరముఖ్యులు = గొప్పముఖ్యుల వలె శ్రేష్ఠులగు విద్యాధరులు. ఇచ్చటఁ బరముఖ్య శబ్దము శ్రేష్ఠార్థకము. ఉపమిత సమాసము. విద్యాధరులు, వరముఖ్యులు, అని ద్వంద్వము చెప్పరాదు. విద్యాధరు లాశ్చర్యించిరని పిమ్మటి పద్యంబునఁ గలదు.

తాత్పర్యము

గొప్పముఖ్యులవలె శ్రేష్ఠులగు విద్యాధరులు తమ తమ యనేకాది విద్యల బలముచే గుంపులు గుంపులుగా నాకాశమున నిలువఁబడి యప్పుడు పర్వతమునందు విధమును జూచిరి.

శా. ఆకర్ణించిరి సిద్ధచారణసమూ•హంబుల్ వచింపంగ శై
లాకారుం డితఁ డంజనాసుతుఁడు రా•మార్థంబుఁ గీశార్థము
న్ప్రాకామ్యోద్ధతి దుష్కరంపుఁగృతికై • దుష్ప్రాప మౌ వార్ధి నా
న్నాకూపారంబును దాఁట నెంచెఁ గడఁగొం•డా యంచు విద్యాధరుల్. ౨౯

అర్థము. ఆకర్ణించిరి = వినిరి, దీనికిఁ గర్తృపదము విద్యాధరులు, శైలాకారుఁడు = పర్వతమంత దేహము గలవాఁడు, కీశార్థంబు = వానరుల కొఱకు, హనుమంతుడు సీతకై సముద్రమును దాఁటి పోవుట కేవల రాముని నిమిత్తమే కాదు. వానరుల ప్రాణరక్షణము చేయవలసి యున్నది. కావున నిద్దఱి కార్యమే యున్నాడు. అప్రాక=గొప్పది యగు, ఆకోద్ధతి = వేగాతిశయముచే, దుష్కరంపుఁ గృతి=చేయ మిగులఁ గష్టమైన కార్యము, దుష్ప్రాపము = సులభముగాఁ బొంద రానిది, నాలుగవ పాదంబునఁ బ్లుతియని. ఇట్లు సిద్ధచారణ సమూహంబులు చెప్పఁగా విద్యాధరు లాకర్ణించిరని యన్వయము.

తాత్పర్యము.

అంజనేయుఁడు పర్వతాకారము గలవాఁడై రాముని కొఱకును, వానరుల కొఱకును గాఢ్యార్థము మిగులఁ గష్టసాధ్యమైన సముద్రమును దాఁటి యావలి కేగుటకై మహావేగముతోఁ బోవుట యను నసాధ్యకార్యము చేయఁబూనెను, చూడుఁడీ యని సిద్ధులు చారణులు చెప్పుచుండ విద్యాధరులు వినిరి.

అర్థము. శ్రీరఘురాము శరంబునట్లు = రామచంద్రమూర్తి బాణమువలె, ఈ దృష్టాంతముచే నతడు వేగాతిశయము గలవాఁడనియుఁ దన ప్రయత్నము వ్యర్థము కాదనియుఁ దన కష్టము లేదనియు నవలీలగా చేయువాఁడని యనుట యిట్టి ననియు సూచితము. ౪౭ వ పద్యమునందు 'ప్రతివ పట్ప్రతిఁ గ్రోధము నిల్వవంచు'నని చెప్పిన వాక్యమున కిదియే ప్రమాణము. ఇది వాల్మీకి శైలి విధానము.

తాత్పర్యము.

మిత్రులారా! వాయువేగము గల రామచంద్రమూర్తి బాణము వలె లంకఁ బ్రవేశించెదను. అచ్చట సీతాదేవి కనఁబడదాయెనా యిదే విధముగా స్వర్గమునకుఁ బోయెదను. అక్కడ సీతాదేవి కానరాకున్న రావణుఁ గట్టి తెచ్చెదను. ఏవిధముగ నైన సీతాదేవిని దీసుకొని వచ్చెదను.

కం. తెచ్చెద లంకను సీతకు, ద్రొచ్చెద రావణు నిఁకట్టి • ద్రూంచెదను నే
వచ్చెద సెల విచ్చెదరే, హెచ్చెదఁ గృతకృత్యతను గ•పీశ్వరులారా! ౩౩

అర్థము. ద్రొచ్చెదను = నేల గుంటఁద్రవ్వి పాతి పెట్టెదను. వచ్చెదను=పోయి వచ్చెదను. ఆంధ్ర లోకోక్తి.

తాత్పర్యము.

వానర శ్రేష్ఠులారా! నే నొకఁడనే సీతాదేవిని లంకయందు వెదకి జాగసు వట్టుంచినఁ లంక నే యిచ్చటికిఁ దెచ్చెదను. రావణుఁ డడ్డము వచ్చినా వానిని పెడ రెక్క గోతిలో వేసి పాతి పెట్టెదను. పోయివచ్చెదను సెలవిచ్చెదరా. ఎట్లైనను గార్యము సాధించెదను.

—• హనుమద్గమన వేగ వర్ణనము •—

చ. అనుచుఁ ద్రివిక్రమున నెగసి • యాత్మను దన్వినతాత్మజాతుఁగా
ననుకొని పోవు వేగమున • శాఖనిశీన ద్రుమంబు లెల్లఁ జ
య్యన సుమపత్త్ర యుక్తముగ • నభ్రపథంబున కుద్గమించి తోఁ
జని దవు పోవుచుట్టమును • సాగనంపు బంధులో యనన్. ౩౪

అర్థము. ఆత్మను=తన మనస్సునందు, వినతాత్మజాతుఁగాన్=గరుత్మంతునిఁగా, ద్రుమంబులు = చెట్లు, సుమ పత్త్ర యుక్తముగన్=పూవులతో, ఆకులతో. అభ్ర పథంబునకున్=ఆకాశ మార్గమునకు. తోఁజనెన్=వెంటఁబోయెను. దవు=దూరము, రూ. దవ్వు.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి దిగ్గున నెగసి తన్ను గరుత్మంతునిఁగా దలఁచుకొని వేగముగఁ బోఁగా నా వేగమునకుఁ గొండమీఁది చెట్లు పూలతోఁ నాకులతో నాకాశమున కెగసి దూరము పోవు చుట్టమును సాగనంపు వెంటఁబోవు బంధువులవలె నతని వెంటఁబోయెను.

క. మారుతసుతువేగంబున, నే గాలెడు వివిధపుష్ప•బృందములతోడన్
నిరధి యుదయత్తారా, వారమనోహరనభంబు•వడువున నొప్పెన్. ౪౨

అర్థము. ఉదయత్ =ఉదయించుచున్న. తారావార = నక్షత్రసమూహముచే, మనోహర = ఇంపైన, నభంబు = ఆకాశము.

తాత్పర్యము.

అంజనేయుని వేగముచే వెంటవెంట రాలుచున్న నానావిధములైన పుష్ప సమూహములతో సముద్ర ముదయించుచున్న నక్షత్రముల గుంపుతోఁ బ్రకాశించు నాకాశమువలె నుండెను.

తే. ఉడుపథంబునఁ బోవు వా•యుజుని చాఁపఁబడిన కేల్దోయిగన్పట్టి•భయదమగుచుఁ
బర్వతమునుండి తల నిక్క•పఱిచి పఱచు,నైదుతలలమహోరగం•బట్టు లగుచు. ౪౩

అర్థము. ఉడుపథము=నక్షత్రమార్గము, ఆకాశము. ఇది హనుమంతుని హస్త వర్ణనము.

తాత్పర్యము.

ఆకాశమునందుఁ బోవుచుండు హనుమంతునిచేఁ జాఁపబడిన రెండు చేతులు పర్వతమునుండి తల నిక్కఁబెట్టి పరువెత్తు నైదుతలల పాములవలె నుండెను. అయిదు వ్రేళ్లు ఐదు తలలవలె నుండె నని పోలిక.

క. జివ్వనఁ దరించి చనుచో, నవ్వనచరుఁ డూర్మిసహిత•మంబునిధిం దా
నవ్వియదధ్వముఁ ద్రావెను, నవ్వనువునఁ దోఁచు చుండె • నద్యోగతులన్. ౪౪

అర్థము. ఊర్మిసహితము=అలలతోఁగూడినది. వియత్+అధ్వము=ఆకాశ మార్గము.

తాత్పర్యము.

అలలతోఁగూడిన సముద్రమును జివ్వనదాఁటి యాకాశమునఁ బోవు హనుమంతుఁడు ఆకాశమును, సముద్రమును త్రావుచుఁ బోవుచున్నాఁడాయేమి యన్నట్లుండెను. ఆయన వేగమునకు నవి రెండును గడచి పోవుచుండెను.

ఉ. మండుచు నుండు కొండపెను•మంటలు నా, యుగపత్సముద్భవో
ద్దండదివానిశాకర వి•ధంబున, మించులఁబోలి గుండ్రనై
వెడఁదియుఁ బింగళంబు లయి • వెల్గెడి నేత్రము లొప్పె వాయుపు
త్రుండు సురాధ్వగామి యయి • తోరపువీఁకను బోవుచుండఁగన్. ౪౫

అర్థము. యుగపత్ =ఏకకాలమున, సముద్భవ=పుట్టిన, ఉద్దండ=(ప్రకాశముచే) అతిశయించిన, దివానిశాకరవిధంబునన్, దివాకర నిశాకరవిధంబున=సూర్యచంద్రుల వలె, మించులన్=మెఱుపులను, పింగళములు = ఎఱుపు పసుపు గలిసినవి, సురాధ్వ గామి=ఆకాశమునఁ బోవువాఁడు. తోరపు వీఁకను=అధికపరాక్రమముచే, పింగళత యందు మాత్రమే పెనుమంటలు, మించులు ఉపమానములు. దివాకర నిశాకరులు

వర్తులత పింగళతలయం దుపమానములు, ఇది యథార్థోపమ. ఉదయించువేళ సూర్య చంద్రులు ఎఱ్ఱగానే యుందురు. ఇది హనుమంతుని నేత్రవర్ణనము.

తాత్పర్యము.

హనుమంతుఁడు మిగుల వేగముగ నాకాశమున బోవునపు డాయన కన్నులు మండుచున్న కొండల యందలి పెద్ద మంటలలో నుదయకాలమం దుదయించిన సూర్య చంద్రులలో యున్నట్లు గుండ్రమై పింగళ వర్ణములై యుండెను.

తే. ఎఱ్ఱనాలుగ మెఱయు క•పీంద్రువదన, బింబ మెఱ్ఱని నాసికఁ • మెఱుపు మీరె
సంజకెంజాయ సోఁకున • సవ్యరు మిగులు, నరుణదీధితిమండల • మనఁగ నపుడు.

అర్థము. అరుణదీధితి=సూర్యుని, ఇది హనుమంతుని నాసిక వర్ణనము.

తాత్పర్యము.

ఎఱ్ఱని కాంతిగల హనుమంతుని ముఖమందు నెఱ్ఱని ముక్కు సంజ కెంజాయలు వ్యాపింపఁగా నందుఁ గానవచ్చు నెఱ్ఱని సూర్యబింబము వలె నుండెను.

క. పవమానతనూభవుఁ డిటు, ప్లవమానుం డగుచు నార్చ • లాంగూలంబున్
దివి నది వెలిఁగె సముచ్ఛ్రిత, దివిజాధిపతిధ్వజంబు•తీరున గురుతన్. ౮౭

అర్థము. ప్లవమానుండు=దాఁటుచున్నవాఁడు, అర్చన్ = ఆడింపఁగా, లాంగూలంబున్=తోఁకను, గురుతన్=గొప్పతనమందు, సముచ్ఛ్రిత=ఎత్తఁబడిన, దివిజాధిపతి=ఇంద్రుని, ధ్వజంబు=జెండా, ఇది హనుమంతుని తోఁక వర్ణనము.

తాత్పర్యము.

ఈ ప్రకార మాంజనేయుఁడు సముద్రము దాఁటిపోవుచుఁ దోఁక నాడింపఁగా గొప్ప తనమునందు నాకాశమందెత్తఁబడిన యింద్రధ్వజమువలెఁ బ్రకాశించెను.

క. వెలిఁగెడి వెలితోఁకతో, వలయాకారంబు గొనిన•వాలముతో ని
స్తులమతియగు హనుమంతుఁడు, జలజాప్తుఁడు పరిధి నున్న•చందమునఁ దాల్చెన్.

అర్థము. వలయాకారంబు = గుండ్రనము, జలజాప్తుఁడు = సూర్యుఁడు, పరిధిన్ = పరివేషమునందు.

తాత్పర్యము

వెలుఁగులఁ బ్రకాశించు తోఁకతోను గుండ్రముగాఁ దిన్నఁ జుట్టుకొన్న తోఁక తోను హనుమంతుఁడు పరివేషము నడుమ నున్న సూర్యునివలె నుండెను.

క. నెఱకెంపులవాలు పిఱుఁదుల, ముఱికెంబున నొప్పెఁ గీశ•ముఖ్యుఁడు దాఁ జే
గుఱుధాతువులను శైలము, తెఱపలు తెఱపలుగ నైన • తెఱఁగులు దోఁపన్.

అర్థము. నెఱ = పూర్ణమైన, వాలు = కాంతి, ముఱికెంబునన్=నిక్కుచేత, జేగుఱు = ఎఱ్ఱని.

తాత్పర్యము.

పూర్ణమైన యెఱ్ఱని కాంతిగల పిఱుఁదుల నిక్కుచే హనుమంతుఁడు ఎఱ్ఱని

ధాతువులచేఁ బర్వతము, తెట్టెలు తెట్టెలుగా నున్న విధమునఁ దోఁచుచుండెను.

క. ఒడిసెలఱాయివలెఁ దివిఁ బడి, కరువలి మ్రోఁగుచు • నిరుమడి సందిన్
వెడలెడిగాడ్పు మేఘము, వెడలిన పుడుకులు మొరఁగ మెరసె • భీషణభంగిన్. ౫౦

అర్థము. ఒడిసెల=ఱాలు విసరివేయుటకై యల్లఁబడిన త్రాడు, రూ. వడిసెల కరువలి=గాలి, ఇరుమడి సందిన్=రెండు చంకల నుండి.

తాత్పర్యము.

ఒడిసెలతో వేసిన తీవ్రవఁబోవు రాయివలె, పోవుచున్న హనుమంతుని రెండు చంకల నుండి వెడలు గాలి మేఘముల యుఱుములవలె భయంకరముగ ధ్వనించెను.

తే. ఉత్తరమునుండి దక్షిణం • బాక్రమించుచు, ప్రసుక్కరిగెడి పెనుఁదోఁక • చుక్కవోలెఁ
దాను పెనుఁదోఁకతోడ నె • మ్మేను వెలుఁగ, లంకవైపుగఁ బఱచె ని • శ్శంకమతిని. ౫౧

అర్థములు. ఒత్తికొనుచున్ = ఆక్రమించుకొనుచు.

తాత్పర్యము.

ఉత్తరము నుండి దక్షిణమునకై పోవు తోఁకచుక్కవలె నాంజనేయుఁడు పెద్దతోఁకతో దేహము ప్రకాశించుచుండ లంకవైపుగ జంకులేక పోవును. తోఁకచుక్క యుపమానము లంక కనిష్టసూచకము.

తే. నింగితెరువునఁ జనెడి ప • తంగునట్లు, పొంగిపఱచుచు నున్న ప్ల • వంగుఁ డొప్పె
నడుమునను త్రాటఁ గట్టంగఁ • బడుట దీర్ఘ, ఘాతమైన మదోత్కట • రీతి దనర.

అర్థము. నింగి=ఆకాశము, పతంగునట్లు=సూర్యునివలె, దీర్ఘఘాతము = నిడివిగా సాఁగినది, మదోత్కటము=ఏనుఁగు.

తాత్పర్యము.

ఆకాశమార్గమునఁ బోవుచున్న సూర్యునివలె వేగమునఁ బరువు పాఱుచున్న వానరుఁడు నడుమునను త్రాడుగట్టఁగా నిడివిగా సాఁగు ఏనుఁగువలె దీర్ఘకాయుఁడై తోఁచెను.

క. అంబువులం బ్రతిబింబం, బంబరమున రూపు వెలయ • హనుమంతుం డ
ర్ధంబు జలంబుల మునిఁగి జ, వంబున గాలికిని బోవు • ప్లవ మనఁ దోఁచెన్. ౫౩

అర్థము. అంబువులన్=నీటియందు, అంబరమునన్=ఆకాశమందు, ప్లవము = పడవ.

తాత్పర్యము.

ఆకాశమున రూపము, దాని నీడ సముద్రము నీళ్ళయందుండుటచే హనుమంతుఁడు సగము నీళ్ళలో మునిఁగి సగము వెలికి గానవచ్చు పడవవలె నుండెను.

తే. గాడ్పుకొనుకఁడు చనినమా • ర్గంబు సర్వ, మతని మహితోరువేగంబు • కతనఁ జేసి
యల్లకల్లోల మగుచు వా • రాకరమునఁ, బొలిచె బోన్మాద భంగిని • గలఁగఁబడుచు.

అర్థము. గాడ్పు కొడుకు = వాయుకుమారుడు, కొడుకు శబ్దము బిడ్డారు లలోఁ జేరినది. బిడ్డాదులకు దుగ్ధను విభాషవగు, సు. వ్యా. ఆచ్ఛిక. ౫ సూ. కతనఁ జేసి=కారణముచేత.

తా త్ప ర్య ము.

వాయుపుత్రుఁడు పోయిన మార్గమంతయును సముద్రమును నాయన తోపుల వేగముచేఁ గ్రిందు మీఁదు మీఁదు క్రిందుగఁ దాఁటుచుండి పిచ్చి పట్టిన వానివలె నుండెను. పిచ్చిపట్టిన వాఁడు తల దిరిగి పడుచు లేచుచు నోట నురుగు గ్రక్కుచుఁ బెద్దగా శబ్దించుచుండునట్లు సముద్రము భ్రమణ ఫేన ఘోషణములఁ గలదై యుండె నని భావము.

క. మి న్నప్పళింప నెగిరెడి, మున్నీటికరళ్ళఁ జ్లవగముఖ్యుఁడు తనమే
వ న్నిగిడెడి కరువలిచేఁ, దన్నుచు నడిఁ బోవుచుండె దానుగాభంగిన్. ౫౫

అర్థములు. అప్పళింపక్=తాఁకుటకు, కరళ్ళన్ = అలలను, కరువలిచే = గాలిచే.

తా త్ప ర్య ము.

ఆకాశ మంట నెగురు సముద్రముయొక్క యలలను హనుమంతుఁడు తన దేహమునుండి కలిగిన గాలిచేఁ దన్నుచుఁ బోవుచుండెను.

ఉ. వానరవర్య వేగభవ వాయువునున్ జలదాశుగంబునుం
దానము నొక్క టై జలధిఁ దద్దయుఁ దాఁ గలగుండు వెట్టఁ బెం
పౌన నభంగభంగనిచయంబుల లాగెడి నాఁగ, నంబరా
నూనుఁడు దింటి మంటిగరుసున్ విభజించెడి నాఁగ దాఁటుచోన్. ౫౬

అర్థము. వేగభవ = వేగముచేఁగలిగిన, జలదాశుగంబు = మేఘములవలనఁ గలిగిన వాయువు, కలగుండు వెట్టన్ = కలవరపఱిచెన్, పెంపౌనన్=పెంపుగలుగు, అభంగ=భంగములేని, భంగ నిచయంబులన్ = అలల సమూహములను, గరుసున్= ఎల్లను. పొలిమేరను.

తా త్ప ర్య ము.

వానర శ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు పోవుటచేఁ గలిగిన వాయువు మేఘములు పోవుటచేఁ గలుగు వాయువు రెండు నేకముగఁ గలిసి సముద్రమును గలవరపఱిచెను. హనుమంతుఁడు సముద్రము దాఁటునప్పుడు గొప్పతనము గలుగునట్లు నిండు తరఁగల గుంపులను లాఁగు చున్నాఁడో, యాకాశమునకు భూమికి నెల్ల యేర్పాటు చేయుచు న్నాఁడో యన్నట్లుండెను.

క. ఉన్నతి మేరువు మందర,ము న్నగు మున్నీటియలల ముసుకొని వడిఁ దా
నెన్నదరఁ బోనొడిచెనో యనఁ, గ్రన్నన తరియించునాఁ గడిమి దలిర్పన్. ౫౭

అర్థము. మున్నీటి = సముద్రముయొక్క, మును+నీరు = మున్నీరు, తొలుత సృజింపఁబడిన నీరు, అప ఏవ ససర్జాదౌ (౨) ఆకాశము నుండి వచ్చు వాననీళ్ళు,

కార్యార్థమై యీయన పోవుచున్నాఁడే. రామకార్యము నేను చేయఁజాల నున్నను జేసిన మహానుభావులకైన సాహాయ్యము చేయవలయును గదా. ఈసమయమున నే నీయన కెంతయుగఁ దాను దోడు పడఁగల నని యాలోచించెను.

ఉ. పోఁడిమిఁ గాంచితిన్ సగర • భూమిధవర్షభుచేత నేను మున్
వీఁడును దత్కులోద్భవుఁడు • విశ్రుతుఁడై రఘురామకార్యుఁడై
వాఁడిచెలంగ నేగెడి న • వారణలీల, శ్రమంబు వాయఁగా
నేఁ డిటు మేలు చేయ నగు • నిర్మలరాగపురస్సరంబుగన్. ౭౭

అర్థము. ఇక్ష్వాకు గౌరవార్థి యగుటకుఁ గారణము చెప్పుచున్నాఁడు.

పోఁడిమిన్=అభివృద్ధిని, భూమిధవ+ఋషభుచే = భూమిధవర్షభుచే = రాజశ్రేష్ఠునిచే, తత్కులోద్భవుఁడు = ఆ వంశమునందుఁ బుట్టిన వాఁడు, విశ్రుతుఁడు= ప్రసిద్ధుఁడు, వాఁడి=పరాక్రమము, అవారణలీలన్ = అడ్డములేని క్రీడగా, రాగపురస్సరంబుగన్=అనురాగపూర్వకముగా.

తాత్పర్యము.

నేను బూర్వ మా సగర చక్రవర్తిచే బాగు పడినవాఁడను. వీఁడా! యా వంశమందే పుట్టి ప్రసిద్ధికెక్కిన రామచంద్రమూర్తి కార్యము చేయ నడ్డము లేక పరాక్రమించి పోవుచున్నాఁడు. కావున వీనికి గష్టము దోఁపకుండునట్లు నాకు వీలునట్లు ప్రేమపూర్వకముగఁ జేయుట మేలు.

క. అక్కమలాక్షుని మాతకుఁ, జక్కనిసాయంబు నేను • సలుపన దేనిన్
జీకొట్టదె జగ మెల్లను, నక్కటికములేని 'జడధి' • యనుచును నన్నున్. ౭౮

అర్థము. కమలాక్షుని మాతకున్ = కమలములవంటి కన్నులుగల శ్రీరామచంద్రమూర్తి మాతకు, ఇది పుండరీకాక్ష శబ్దము స్మరింపఁజేసినది. అనఁగా భగవంతుని మాత యని భావము. సాయంబు = తోడుపాటు, సాహాయ్యశబ్దభవము. సలుపను+అ+ఏనిన్ = చేయకయే పోయినయెడల, చీకొట్టదె = ఛీ ఛీ యని నిందింపదా? కదా, చీకొట్టు, అక్కటికము=దయ, జడధి=మందబుద్ధి, లడల కభేదము గావున జలధి జడధి యయ్యె. "జడనిధి యను పేరుమాయఁ గడు నాదరిన్ బోలినట్టి యాట వెలఁదియ పోలెన్" ప్రభా. ప్ర.

తాత్పర్యము.

ఆ పుండరీకాక్షుని మాతకు నేను సరియైన సాహాయ్యము చేయకయే పోయిన యెడల లోకమంతయు సముద్రుఁడు దయ, బుద్ధి లేనివాఁడని నిందింపదా! భగవత్కార్యమునకుఁ దోడుపడ శక్తి గలిగియుఁ దోడుపడఁడని కృతఘ్నుఁడని దోషము ప్రాప్తించుటయేగాక లోకనిందలకుఁ బాలుపడి యపకీర్తి పాలుగావలసి వచ్చునని భావము.

క. బడలిక విచ్చుటఁ బాసినఁ, గడు సుకరం బితఁడు దాటఁ • గడమ న టంచున్
జడనిధి దలఁచుచుఁ దనలో, నడఁగిన మైనాకుఁ జూచి • యాదటఁ బలికెన్. ౯౪

అర్థము. ఆదటన్ = ప్రీతితో.

తాత్పర్యము.

ఇచ్చట బడలిక పోవుకొనినా శక్తివచంతియు సులభముగా దాటవచ్చును అని తలఁచుచుఁ దనలో దాగియున్న మైనాక పర్వతమును జూచి యిట్లనెను. మైనాకుఁడు మేనకకు కుమారుఁడు. హిమవంతునకు జన్మించినవాఁడు. పార్వతి తోఁడఁ బుట్టువు.

—• సముద్రుఁడు మైనాకునితో సంభాషించుట •—

ఉ. ఓయి హిరణ్యనాభ! విను • మొక్కటి చెప్పెద మర్త్యలోకమున్
డాయక యుండఁగా నసుర•నాథు లధోభువనంబునుండి, ని
ర్న్యాయపుభీకరోరుపరి•ఘాకృతి నిల్పినవాఁడు వేలుపు
ద్రాయఁడు, నీవ నేస్తు నలు•ప్రక్కఁ బతంగ మనంగఁ బోవఁగన్. ౯౫

అర్థము. హిరణ్యనాభ=హిరణ్మయములైన నాభులు గలవాఁడా; అనగా బంగారు శిఖరములు గలవాఁడా, నాభి = ముఖ్యుఁడు, ప్రధానుఁడు, పర్వతమున కధ్యక్షము శిఖరము కావున నిది నాభి శబ్దార్థమయ్యెను. "నాభి రధ్యక్షే కస్తూర్యాం" అని సర్వ నిఘంటువు. "నాభిః ప్రధానే ప్రాణ్యంగే కస్తూర్యాం క్షత్రియే వృషి" నానా. ర. ఒక్కటి=చెప్పఁబోవు వృత్తాంతము, అధోభువనము=పాతాళము, ఆయస=ఉక్కుచేఁ జేయఁబడిన, భీకర=భయంకరమైన, ఉరు = గొప్పదగు, పరిఘ+ఆకృతి = ఇనుపకట్ల గుదియవలె, వేలుపుఁద్రాయఁడు=దేవతల ప్రభువు = దేవేంద్రుఁడు, స్థిరము పరమౌటవపునను సంగాగమును గలదు, గరుడవు వ్నసువువలె, పతంగము=పక్షి.

తాత్పర్యము.

ఓయీ! బంగారు శిఖరములు గల మైనాకా! నీకొక వార్త చెప్పెద వినుము. పాతాళలోకము నుండి రాక్షసులు భూలోకమునకు రాక యుండునట్లు నిన్నింద్రుఁడు ఉక్కుగుదియ వలె నడ్డముగా నుంచెను. పక్షివలె నే ప్రక్కనైనఁ బోవ నీవు సామర్థ్యముగలవు.

సీ. రామకార్యార్థమై • శ్రీమహాప్పుఁడు హనుమా, మారుతుండు చనెడి నం•బరము నెగసి
నాకు సంపూజ్యు లి•క్ష్వాకులోద్భవుల్, వనమపూజ్యులు నీకుఁ • బర్వతేంద్ర!
నియ్యంబుమై నీవు • తీయ్యఁదనంబున, సాచివ్య మొక్కటి • చలుప వలయుఁ
గావింపఁ దగుపనిఁ • గావింప కుండినఁ, గోపింత్రు సజ్జనుల్ • గాన యితఁడు
తే. లెక్కు జలములయందుండి•లీల నీవు, మనకు నతిథియుఁ బూజ్యుండు•మారుతాత్మ
భవుఁడు గావున నెడు లేచి•బడలిక దన•నరివి ధరించువు శిరమున•హర్షమునను.

అర్థము. సాచివ్యము = సాహాయ్యము.

నెమరుగఁ బోయి నీ శిఖరమునందు నిలుపుము. అందు విశ్రమించి నాసి రీతిన మిగుల తక్కినది కష్టములేక దాటుము.

ఉ. అన్నపుఁ బ్రేమ నిట్టు లతిఁ • హాసిన మారుతపుత్ర! నీకుఁగా
వచ్చితి, నింక నిచ్చు ఫల•వర్గముఁ దియ్యని కందమూలముల్
మెచ్చిక నారగింపుము, శ్ర•మం బిట్టు పోయిన విశ్రమింపుమీ
వచ్చుట వెంక నేగ సుక•రం బను శేషము వాన కేశ్వరా! ౭౯

—అర్థము. సుగమము.

తాత్పర్యము.

వాయు నందనా! అయిన యీ ప్రకారము నిర్మలమైన ప్రేమచేఁ జెప్పఁగా నీ నిమిత్తమై నేను వచ్చితిని. ఇచ్చట నిచ్చు ఫల సమూహములను, తియ్యని కంద మూలములను నాయందలి ప్రేమచే నారగింపుము. బడలిక తీరునట్లు విశ్రమింపుము. అవల నీవు తక్కిన మార్గము వేగముగా, సులభముగాఁ బోవ సాధ్యపడును.

ఉ. క్రొత్తల నైన సజ్జనులఁ • గూరిమిఁ బూజ సేయుచున్నటుల్ సత్
పత్తము లెల్ల మెచ్చుదు ప్రశ•స్త మటం చది యిట్టులుండ నే
వోత్తముఁడవున్ మహాత్ముఁడవు బ•లోగ్రుండవు నీ పవమానపుత్ర! నా
కతిథి వింక నైతివి గ్ర•హింపుము యింపుగ నాతిథేయమున్. ౮౦

* అర్థము. క్రొత్తలనైనన్ = క్రొత్తవారినైనను, వింధవు=అతిథివి, అతిథేయ మున్ = అతిథి సత్కారమును.

తాత్పర్యము.

క్రొత్తవారినైనను సత్పురుషులను ప్రేమతోఁ బూజించు కార్యములను బుద్ధిమంతులగు సత్పురుషులు శ్లాఘ్యమైనవని మెచ్చుకొందురు. అతిథి గుణవంతుఁడగునని క్రొత్త ప్రాంత విచారము చేయరాదు. అదట్లుండఁగా, ఆ కారణముగానే నేను బూజించుటకు వేఱొక కారణము గలదు. దేవతలందు శ్రేష్ఠుఁడును (త్వమేవం ప్రత్యక్షం బ్రహ్మాసి) మహాత్ముఁడును బలము భయంకరుఁడు నగు వాయుదేవునకు నీవు పుత్రుఁడవు. నీ సౌభాగ్యత నాకుఁ దెలిసినను దెలియక పోయినను నీ తండ్రి సౌభాగ్యతను బట్టియైన నేను నిన్నుఁ బూజింపవలెను. అట్టి మహానుభావునికొడుకవైన నీవు మాకతిథి వైతివి. కావున నే నిచ్చు నతిథిసత్కారము గ్రహింపుము. ఎట్టివాఁడైనను అతిథిపూజ్యుఁడు. అందు సజ్జనుఁడు విశేషపూజ్యుఁడు. అందు సర్వంతో ప్రసన్నుఁడు పరమపూజ్యుఁడు. ఈ మూఁడును నీయందుఁ గలవు. కావున నీవు నాకుఁ బూజ్యుఁడవు.

తే. ధర్మజిజ్ఞాసువులనఘ•ధర్మవిదులు, నతిథి సామాన్యుఁ డయ్యుఁ బూ•జార్హుఁ డగును
చెప్ప నేటికి నీవంటి•శిష్టుఁ డనఘ, బాంధవం బొప్పు నేఁ గ్రొత్త•వాఁడఁగావు.౮౧

అర్థము. కీర్తనే చెప్పుచున్నాఁడు. ధర్మజిజ్ఞాసువులకున్=ధర్మ మెఱుంగఁ గోరిక గలవారికిని; ధర్మవిదులకు=ధర్మము తెలిసినవారికిని, సామాన్యుఁడయ్యు=గొప్పవాఁడు కాకున్నను.

తాత్పర్యము.

ధర్మ మిట్టిదని తెలియకపోయినను, తెలిసికొనఁ గోరిక గలవారికిని, ధర్మము చక్కఁగా తెలిసినవారికిని సామాన్యుఁడైన యతిథియుఁ బూజ్యుఁడే. అట్లుండ నీవంటి సాధుపురుషుఁడు పూజ్యుఁ డని వేఱుగఁ జెప్పవలెనా? మన యిరువురకు సంబంధ మింతమాత్రమే కాదు. నేను గ్రొత్తవాఁడఁగాను. నీకుఁ గావలసిన వాఁడనే.

క. ఆశుగమనమునఁ బోలెద, వాశుగమనములను నిన్ను • నర్చించినచో
నా శుభచరితుఁ బవనుని, నే శక్త్యనితిని బూజ • నొనరిచిన యట్లు గదా. ౧౩౨

అర్థము. ఆశు+గమనమునన్=శీఘ్రగతిఁ బోవుటయందు. ఆశుగ+మనముల = వాయువును, మనస్సును.

తాత్పర్యము.

నీవు వాయువేగ మనోవేగములఁ బోఁగలవు. నిన్ను నేను బూజించితినా లోకక్షేమకరమైన నడవడిగల వాయుదేవుని బూజించిన వాఁడ నగుదును.

—• మైనాకుఁడు తన పూర్వవృత్తాంతము హనుమకుఁ దెల్పుట •—

సీ. కలదు దీనికి నొండు • కారణం బది వినుము, మహాత్మ! వానరేంద్ర! • యాంజనేయ
పూర్వము కృతయుగం • బున గిరుల్ ఱెక్కలు వెలయఁ దార్క్ష్యానిల • వేగయుక్తి
విచ్చలవిడి దిశా • విధిఁ జరింపఁగఁ, దలలపైఁ బడు నంచుఁ దలఁకి వెఱల
మునులును దేవతల్ • మున్నుగాఁ గల భూత, కోటి యంతట శత • కోటిఁ బూని
తే. వాసవుఁడు క్రుద్ధుఁ డగుచు గ్రా • వముల ఱెక్క
లెల్లఁ దుత్తునియలు చేసి • కొసగి నాదు
వంకఁ గవియుచు వీరాగ్రణి • పరమకరుణఁ
జిమ్మె గొనివచ్చి ననుఁ ద్రోచె • సింధువునను. ౧౩౩

అర్థము. తార్క్ష్యానిల వేగయుక్తిన్=గరుడుని యొక్కయు, వాయువు యొక్కయు వేగము వంటి వేగముతోఁ గూడినవి, తార్క్ష్యుఁడు = తృక్షుఁడను ముని కొడుకు తార్క్ష్యుఁడు. శతకోటి = నూఱంచులు గలది వజ్రాయుధము. గ్రావముల = పర్వతముల యొక్క, తుత్తునియలు = తునియలు+తునియలు తుత్తునియలు = తునుకలు తునుకలు, సింధువునను=సముద్రమునందు.

తాత్పర్యము.

నేను నిన్నుఁ బూజించుటకు మఱియొక కారణముగలదు, వినుము. పూర్వము కృతయుగంబునఁ గొండలకెల్ల ఱెక్కలుండెను. అవిగరుడానిల వేగమున నాకాశమున

గలవాఁడను. సంతోషించితిని. నేను నిలువఁగూడదు. ఏలనఁ గార్యము కాలము నన్నుఁ దొందర పెట్టుచున్నది. చేయవలసిన కార్యము చాల యున్నది. ప్రొద్దు గ్రుంకఁ బోవు చున్నది. ఇక్కడ నాలసించితినేని నేను గార్యము చేయుటకుఁ జాలినంత ప్రొద్దులేదు. అదియును గాక నేను త్రోవలో నిలువ నని వానరులతోఁ బ్రతిజ్ఞ చేసితిని. (మూ. స. ౧౩౫) కావునఁ బోయెదను. నేను నిల్వలే దని మిత్రమా! కోపింపకుము.

వ. అని పవమానసందనుఁడు • సాదర మారఁగ శైలరాజమున్
దనకరపల్లవంబునను • దద్ద స్పృశించి హసన్ముఖాబ్జుఁడై
చనియెను నంతు నీడ్కొని భృ•శత్వర మార్గము దాఁటి పోఁగ నై
వననిధి శైలరాజముల • వాక్కులు గైకొని పూజితుండు నై. ౧౩౪

అర్థము. కరపల్లవంబునను=చిగురువంటిచేతితో. హసన్ముఖాబ్జుఁడై = నవ్వుచున్న ముఖాబ్జముగలవాఁడై, భృశత్వరన్ = అతివేగమున. వననిధి = సముద్రుని యొక్కయు, శైలరాజ=మైనాకుని యొక్కయు.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి హనుమంతుఁడు ప్రీతితో మైనాకునిఁ దనచేతితోఁ దాఁకి నవ్వు మోము గలవాఁడై పోయి వచ్చెద నని సెలవు తీసికొని మిగుల వేగమున నంతకుఁ బైకెగిసి సముద్రమైనాకుల యాశీర్వచనములు పొందినవాఁడై.

క. అంబరమార్గమున నిరా,లంబనముగ వాయుసూతి • లంఘించు నభ
ప్రంబును జనె; రెండవ కా,ర్యంబును దుష్కరముఁ జూచి • యమరులు పొగడన్.

తాత్పర్యము.

ఆకాశమునందు నిరాధారముగ వాయుసుతుఁడు మైనాకుని జూచుచుఁ బోయెను. రెండవ యసాధ్య కార్యమును జూచి దేవతలు పొగడిరి.

మొదటి కష్టకార్యము, సముద్రమును దాఁటుట. రెండవది కొండ యడ్డపడినను ఛేదించుకొని నిలువక పోవుట.

క. మైనాకుఁ డొనర్చిన స్నే,హానూనకృతిం దలంచి • యంబరవీథిన్
గానఁగ నిలిచిన నాకౌ,కోనికరము పొగడె,నద్రి•కుంజరు నంతన్. ౧౩౬

అర్థము స్నేహానూనకృతిన్ = స్నేహముచేతనైన గొప్ప కార్యమును, నాకౌకోనికరము=దేవతా సమూహము, అద్రికుంజరున్=పర్వతశ్రేష్ఠుని, మైనాకుని.

తాత్పర్యము.

మైనాకుఁడు చేసిన స్నేహపూర్వమైన కార్యమును జూచి యాకాశమందు నీ విశేషము చూడ నిలిచిన దేవతాసమూహము మైనాకుని బొగడిరి.

ఉ. నాకవిభుండు దానికి న•నంతముదంబును బొంది వెండి మై
నాకునిఁ జూచి యో కనక•నాథ! నినుం గని సంతసించితిన్

నీ కథయం బాసంగితి వి•నిర్మలనీతి యథాసుఖంబుగా
శోకమునం జెలంగు భయ•లోలత మానుము మానసంబునన్. ౯౧

తా త్ప ర్య ము.

ఆ మాటలు విని యింద్రుఁడు మిగుల సంతోషపడి వచ్చి మైనాకునిఁ జూచి యో సువర్ణనాథ! 'నిన్నుఁ జూచి మిగుల సంతోషించితిని. నావలన నీకిఁక భయము లేకుండ వరమిచ్చితిని. నీవు సంకోచములేక లోకంబున సుఖింపుము. మనస్సునందైన భయపడ వలదు.'

చ. ఎటు లొకొ నూఱుయోజనము • లీతఁడు వార్ధిఁ దరించు నంచు లోఁ
దటతట గల్గె మాకు నెఱ•ధైర్యము మైఁ దలఁ దేసుచుండినన్
దిటముగ రామకార్యమును • దీర్పఁగ నూతగఁ బోవు మారుతిన్
దటుకున నాదరించితివి • తద్దయు మెచ్చితి నిను నచ్చలీ. ౯౨

అర్థములు. తటతట=భయముచే గుండెలు కొట్టుకొనుట యందు ధ్వన్యనుకరణము=భయము, నెఱ=నిండు, నిను మెచ్చితిన్ = నిన్ను మెచ్చితిని, ద్వితీయకు మాఱు షష్ఠి. షష్ఠీ స్థానకం బగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ బత్తు నర్థంబులఁ జూపట్టుచోఁ (ప్రతికా-౧౭సూ)

తా త్ప ర్య ము.

హనుమంతుఁడు నిండుధైర్యముతోఁ బోవుచుండినను నీతఁ డెట్లు నూఱు యోజనముల సముద్రము దాటఁగలఁడని భయముచే మా గుండెలు కొట్టుకొను చుండెను. ఆ విధముగ రాముని కార్యముఁ దీర్ప నూతగఁ బోవుచున్న హనుమంతుని నాలస్యము లేక సమయమున నాదరించితివి. నీ కార్యము స్నేహితుఁడా! మెచ్చితిని.

క. అనుచు శచీవల్లభుఁ డిటు, లనఁ బల్కిన లబ్ధవరుఁడు • ధరవల్లభుఁ డా
త్మను గలఁగి నెలసెఁ బడపడి, హనుమంతుఁడు పోవు చుండె • నంబరవీథిన్. ౯౩

అర్థములు. లబ్ధవరుఁడు=వరము పొందినవాఁడు. ధరవల్లభుఁడు=పర్వతశ్రేష్ఠము.

తా త్ప ర్య ము.

అని యా ప్రకారము దేవేంద్రుఁడు తనతోఁ జెప్పఁగా మైనాకుఁడు వరము పొందినవాఁడై భయము విడిచి సంతోషించెను. హనుమంతుఁ డాకాశమునఁ బోవు చుండెను. దీనిచే భగవత్సేవకులకు దేవతలు సాహాయ్యపడుదురు. 'శ్రేయాంసి బహు విఘ్నాని' శ్రేయస్కర కార్యములకు విఘ్నములు మెండు. సంసారమును తరింప నాత్మానుభోగవశుఁడై యోగ మభ్యసించువానిఁ జూచి నిద్రాహారములు మాని వాఁడు చేయు కృషి చూచి యిట్టియున వీఁడు చెడునేమో యని భయపడి ప్రేమ చేతనే వానికి నిషిద్ధ వస్తువులు తినఁబెట్టి భోగములు మఱచి తమవలె నుండఁ జేయ నేదేవిదో కుచేష్టలు వాని యా పక్షంభువులే తొలుతఁ జేయుదురు. కారణము క్షేమమైనను విఘ్నము విఘ్నమే. కావున వీనిని లక్ష్యము చేయరాదు. మంచిమాటల

అపూర్వ=మును పెన్నఁడును విన్నది కన్నది కానిది. వికారము=మిక్కిలి భయంకరమైనది; విరూప=వంకరటింకరమైనది, రక్కసియు యట్లు = రాక్షసివలెనే, జవోపేతముగాఁగ వేగముతోఁ గూడినట్లుగ.

తాత్పర్యము.

మారుతి మని చెప్పఁగా నా దేవతాస్త్రీ సరియని యంగీకరించి ప్రాణికోటికి భయంకరమై మును పెవ్వరు నెన్నఁడు వినని కనని వికారము విరూపము గల పెద్ద రూపము ధరించి యాకాశమునకు నెగసి వేగముగఁ బోయి యాంజనేయుఁడు పోవు మార్గమున కడ్డముగ నిలిచి,

ఉ. ఇట్లను వానరేంద్ర! యిటు • కేగను నిల్వుము నాకు నిన్ను నీ
వట్లు విధించినారలు సు•పర్వులు భోజ్యము గాఁగ, నన్ను నీ
వెట్లును మీఱ లేవు, కొం•చెము వదనంబును, ద్రింగి వైతు, ము
చ్చట్లిక నాగ నన్ను సుర•సం గని పావని మోముఁ గేలుచన్. ౯౭

తాత్పర్యము.

ఇట్లు చెప్పెను. వానర శ్రేష్ఠా! యెందుఁబోవుచున్నావు. నిలువుము. ఏలం దునా! దేవతలు నిన్ను నా కాహారముగాఁ గల్పించినారు. కావున నన్ను మీఱి నీవు పోలేవు. నా నోరు తెరచెదను. మ్రింగెదను. ఇంక ముచ్చటలతోఁ బనిలేదు. అని సురస చెప్పఁగా నామె వేషము చూచి యిది సహజ రాక్షసి గాదు. కృత్రిమ రాక్షసి. ఎవతెయో నన్నుఁ బరీక్షింప వచ్చినది. నిజముగా నిది నన్నుఁ దినుటకై వచ్చి యుండినఁ దానే నన్నెత్తి నోట వేసికొని యుండును గాని నన్ను నోటిలోఁ జొరఁబడు మని కోరునా! ఈమెతో మనము విరోధింపరాదని తలఁచి యాంజనేయుఁడు రెండు చేతులు జోడించి నమస్కరించి.

శా. దేవీ! శ్రీరఘురామచంద్రుఁడు తల్లి•దేశంబునన్ భార్య సీ
తావామాక్షియుఁ దోడు లక్ష్మణుఁడు రాఁ • దానందుఁ గ్రవ్యాదులై
రావిష్టుంచును నన్యకార్యరతుఁడై •నా రాము నిల్లాలి ద
త్సౌవర్ణంబు హరించె రావణుఁడు; నేఁ • జూడంగ నర్థించుచున్. ౯౮

అర్థములు. క్రవ్యాదులైరావిష్టుంచును = మాంసభక్షకులగు రాక్షసులందు విరోధభావము గలవాఁడు. (దీనిచే ఖరదూషణాది సూచితము) అన్యకార్యరతుండు= మఱియొక పనియందు మనస్సుంచినవాఁడు (ఇది మారీచవధ సూచించును.)

తాత్పర్యము.

దేవీ! శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో వనవాసమును సంచరించు చుండఁగా రాక్షసులందు ద్వేషబుద్ధిగల రామచంద్రమూర్తి కార్యాంతరాసక్తుఁడై యున్న సమయంబున నాయనభార్యను సీతను రావణాసురుఁడు హరించెను. ఆ పతి వ్రతను నేను జూడఁ బోయెదను.

ఉ. రామునియొద్దఁ బోయెదను • రాముని రాజ్యమునందు నుందుటన్
రామ నామ! నీమనం బనిన • రాముని కార్యముఁ జేయ్యఁ గావునన్
క్షేమముగాఁగ నీ జనకజ • క్షేమము, కా దని తేని జానకీ
క్షేమముఁ దెల్పి రామునకుఁ • జెచ్చెర నీ వచనంబుఁ బొచ్చెదన్. ౯౯

తాత్పర్యము.

శ్రీ రామచంద్రమూర్తి యొద్దకు గొప్పన నేను బోవుచున్నాను. నీవును ఆయన దేశమందున్నవాడవు కావున నీవు నాయన కార్యము జక్కఁ జేయఁదగును. ఏమి చేయు మందువా నన్ను క్షేమముగాఁ బోనిమ్ము. ఆ సాహాయ్యము చాలును. అట్లు కాదందువా జానకీదేవిని జూచి యామె కుశలవార్త రామునకుఁ దెలిపి వచ్చి నీ కోర్కెఁ బ్రవేశించెదను.

క. నిక్కము నమ్ముమ టంచన, నక్కడి మాటలు కపీంద్ర • యిప్పుడు నాచేఁ
జిక్కియుఁ బోవం గలవే, గ్రక్కున నీవంబులో వచింప నిది నామన్. ౧౦౦

అర్థములు. నిక్కము=నిజము.

తాత్పర్యము.

నిజము నమ్ముమని చెప్పఁగా నాకు యినేటి మాటలు. ఇప్పుడు నాచేఁ జిక్కియు నీవు తప్పించుకొని ప్రాణముతోఁ బోఁగలవా? ఇది నాదు వచనము.

ఇది మొదలు ౧౦౬ వఱకుఁ బ్రక్షిప్తము. ఏలన యింకు సురసయు, అంజ నేయుఁ డినవ్రును నూఱామడ వెడలుపున నోరు దేహము పెంచినట్లు చెప్పఁబడెను. సముద్రము వెడలుపు నూఱామడ. వీరి నోరు దేహము నూఱామడదైన వీరి దేహము లెంతదై యుండవలెను. ఇట్లైన వీరు సముద్రమధ్యమున నున్నవారు. వీరు నూఱా మడ పెరిఁగియుండిన నా ప్రక్క రాక్షసులను నీ ప్రక్క వానరులను జూడఁ గలిగి యుండవలెను. అట్లైన నవర్థకము తప్పదు. కావున నిది యొకరో తెలిసి మాలిన వాఁడు వ్రాసినదిగా గ్రహింపవలెను.

ఈ ప్రక్షిప్తములకుఁ గారణ మేమని యాలోచింపఁ గొందఱ యభిప్రాయ మేమన:—

ప్రక్షిప్తములకుఁ గారణములు రెండు. స్వమతాభినివేశము, పౌరాణిక వినోదక్రీడ. భారతము "నానాయుగాకథా విచిత్రమ"న్నని వ్యాసులు చెప్పినను దమతమ మత ప్రశస్తికై యితర మతముల వారు తమ తమ యిష్ట దేవతలకుఁ బరత్వము చెప్పుటకుఁ గొన్ని యధ్యాయము లందందు నిక్షేపించిరి. భారత మందలి ప్రక్షిప్తములకిది ముఖ్యకారణము. రామాయణ విషయమున నట్లు చేయ సాధ్య పడక యా యా మతములవారు వారి వారి మతానుసారముగ వాల్మీకి పేరు పెట్టి యితర ఋషుల పేరు పెట్టి వేఱు వేఱు రామాయణముల వ్రాసికొనిరి, కావున నట్టివి రామాయణమునకు లేవు. రామాయణమును వాల్మీకి

తాత్పర్యము.

సురస పోయిన తరువాత నలక్ష్యము చేయరాని సముద్రమును వదలి గరుడ వేగుఁడై యాకాశమును లంఘించి భయంకర విధముగా నాంజనేయుఁడు నడచెను. సముద్రమును వదలి యాకాశమును లంఘించుటచే సురసతోడి వ్యవహారము నీటి మట్టమునకుఁ బైగా జరిగెను గాని మేఘమండలమునఁ గాదని యూహ్యము మున్నది.

సీ. కొంతరగా నున్న • తోరంపుమబ్బులు, పరచులు హాటకే • పక్షికులము
సంగీతసుకళావి • శారదాచార్యులు, రాజ నెఱజాను నై • రావతంబు
బెబ్బులి యేనుంగు • బొబ్బ సింగంబులు, ఎక్కిరింతలు గాఁగ • నెసఁగువారు
మహనీయ మైన వి • మానంబు లశనివ | జ్రోద్భవశిఖిశిఖా • ప్రోచ్చయములు
తే. నాక మరిగెడి కృతపుణ్యు • లా మహాను
భావజనములు సందడి • బాటగములు
హవ్యమును మోసికొని చను • హవ్యవహుఁడు
చంద్రసూర్యగ్రహోడున • క్షత్రములును. ౧౧౪

అర్థములు. కొంతరగాన్ = కొంతలు కొంతలుగా నొక దానిపై నొకటి. తోరంపు = గొప్పవగు, సంగీత సుకళా విశారదాచార్యులు = సంగీత విద్యయందు నేర్పుగల తుంబురుఁడు మొదలుగాఁ గల యాచార్యులు, ఐరావతంబు = ఇంద్ర ధనుస్సు. "ఇంద్రాయుధం శక్రధనుస్తదేవ ఋజు రోహితం ఐరావతం చ విద్యుత్తు చంచలా చపలాపి చ" అని వైజయంతి. ఋజువు, దీర్ఘమైన యింద్రధనుస్సు ఐరావతమనఁబడును. బొబ్బ సింగంబులు=సింహములు, ఎక్కిరింతలు = వాహనములు, అశని వజ్రోద్భవ శిఖిశిఖా ప్రోచ్చయములు=పిడుగు వజ్రాయుధముల కలియుటచేఁ బుట్టిన నిప్పుమంటల సమూహములు, కృతపుణ్యులు = పుణ్యము చేసినవారు, మహానుభావ = గొప్ప మహిమగల, సందడి = క్రిక్కిరిసిన జనుల గుంపుగల, హవ్యవహుఁడు = అగ్నిహోత్రుఁడు, చంద్రసూర్యాదులు గ్రహములు, ఉడు = చుక్కలు సామాన్య నక్షత్రములు, అశ్విన్యాదులు నక్షత్రములు.

తాత్పర్యము.

కొంతలు కొంతలుగా నొకదానిపై నొకటియున్న గొప్ప మబ్బులు, ఎగురుచున్న పక్షులు, సంగీత విద్యానిపుణులైన తుంబురుఁడు లోనగువారు, కాంతిచే వెలుఁగు నింద్ర ధనుస్సు, బెబ్బులి యేనుఁగు సింహము వీనిని వాహనములుగాఁ గలవారు, గొప్ప విమానములు, వజ్రము పిడుగులు వీని రాపిడిచేఁ బుట్టిన మంటలు, స్వర్గమునకుఁ బోవు పుణ్యాత్ములు, వీరిచే నడచు బాటలు, దేవతలకు హవ్యమును మోచికొనిపోవు నగ్నిహోత్రుఁడు, చంద్ర సూర్యాది గ్రహములు, సామాన్యములైన చుక్కలు, అశ్విన్యాది నక్షత్రములు, ఇవియును రాఁబోవు రెండుపద్యంబులు ఆకాశవర్ణనము.

ఉ. దేవముని ప్రకాండములు • దివ్యనభశ్చరనాగయక్షవి
శ్వావసు కిన్నరాదులు ది•శాగజముల్ రవిచంద్రము లేగు మేల్
త్రోవలు మీఱఁగా నఖిల•లోకవితానవితాన మై శివం
బై వనజాసనాకలిత • మై రహి మించు నభఃపథంబునన్. ౧౧౫

అర్థములు. దేవముని ప్రకాండములు = దేవర్షి శ్రేష్ఠులు. నభశ్చర = ఆకాశమందు సంచరించువారు, విశ్వావసువు = గంధర్వరాజు, దిశాగజముల్ = దిక్కులయందుండు నైరావతాదు లేనుఁగులు, అఖిలలోకవితాన వితానమై = సమస్తలోకములకు మేల్కట్టు (చాందినీ) వంటిదై, శివంబై = సుఖకరమై, వనజాసన + ఆకలితము = బ్రహ్మచే సృజింపఁబడినది, నభఃపథంబునన్ = ఆకాశమార్గమున.

తాత్పర్యము.

దేవర్షిశ్రేష్ఠులు, దేవతలు, ఆకాశసంచారులు, నాగులు, యక్షులు, విశ్వావసువు లోనగు దేవగంధర్వులు, కిన్నరులు లోనగువారు దిగ్గజములు, సూర్యచంద్రాదులు పోవుమార్గములు అతిశయింపఁగా నన్నిలోకములకు మేల్కట్టువంటిదై బ్రహ్మ నిర్మితమై ప్రకాశించు నాకాశమార్గమున.

క. గరుత్మంతునిపోలిక, పరగుచు రెక్కలు గలట్టి • శైలం బనఁగా
నరిగె నిరాలంబనగతి, మరుదాత్మజుఁ డూత్క దివిజ•మార్గము వెలుఁగన్. ౧౧౬

అర్థములు. ఊత్క = ఉత్సుకతతో, దివిజమార్గము = ఆకాశము.

తాత్పర్యము.

గరుత్మంతునివలె రెక్కలు గల కొండవలె నిరాధారముగ నత్యంతము శోభ యాకాశమును ప్రకాశింపఁజేయుచు హనుమంతుఁడు పోయెను.

—• ఆంజనేయుఁడు సింహికను వధించుట. •—

క. రంహోజృంభితవానర, సింహునిఁ దనుగంగఁ జూచి • చింతించె మదిన్
సింహిక యను రక్కసి, యంహోభావమున నెంతె • యవఘాత్మకయై. ౧౧౭

అర్థములు. రంహోజృంభిత = రంహస్ = వేగముచే, జృంభిత = అతిశయించిన, అంహోభావమునన్ = పాపిష్ఠమగు మనస్సుచేత, మధ్యమపదలోపి కర్మధారయము.

తాత్పర్యము.

వేగాతిశయము గల వానరశ్రేష్ఠుఁడు పోవుచుండుట చూచి సింహిక యను రాక్షసి పాపబుద్ధిచే నిట్లు లాలోచించెను. ఆహా! నేనెంత పుణ్యాత్మురాలనో.

ఉ. ఎన్నిదినంబులో కడచె • నింతయుఁ గూడు లభింప కయ్యెడ నా
కిన్నిదినాల కేన్ దొరకె • నిట్టిమహోన్నత సత్త్వ మంచు నాఁ
కొన్న తనంబునం జెలఁగి • క్రూరపురక్కసి యాంజనేయుఘా
యన్నతి నిగ్రహింపఁ బవ•నాత్మజుఁ డాత్మ విచార మూరఁగన్. ౧౧౮

సముద్రమున కాపటిగొనునట్టి స్వకీయ గొనునట్టి మరియు పర్వతము లున్నట్లు చెప్పుటచే నా కాలొక కాలమున లంకయు పర్వత హిందూస్థానము చేరియే సమము సముద్రము లేక యుండెనని వాని యభిప్రాయము నాకుననిపించుచున్నది.

"The islands of Rameswaram and Mannar, and the chain of islets and sand banks between them, called Adam's Bridge, appear to be remnants of the natural land connection between the main land of India and Ceylon, which existed in some recent geological epoch. There is no doubt of the fact that Ceylon once formed a part of the Deccan. The existence in Ceylon of Indian elephants (elephas Indicus) and other animals and vegetables, natural to southern India, proves the former connection of Ceylon to India. If that were not the case, elephants and other land animals, could not have crossed the sea to make the island of Ceylon their habitat. The Eastern Archpelago once formed a part and parcel of the Continent of Asia. But by the gradual subsidence of land, from volcanic action, to the bottom of the sea, portion of the south and south Eastern Asia got detached from the mainland and became islands. The separation of Ceylon, and the islands of the Archipelago took place, I think, at the same geological epoch and by the same cause or causes. It will appear from a study of the map of Asia that the subsidence took place in a latitudinal belt almost Parallel to the Equator, on both sides of it, seperating Ceylon, Sumatra, Java, Borneo, Celibes and a host of smaller islands from the manland of Asia. It will also appear that the Malaya Peninsula very narrowly escaped complete detachment from this volcanic disturbance. It will also appear from a study of geographical distribution of animal and vegetable life in the south and south eastern par's of the Asiatic continent, and the islands, that most of them, got detached from the mainland by subsidence and that some of them, on the other hand, have spung up from the bottom of the sea by upheaval (vide Wallace, Malay Archipelago; Island life and Geographical distribution of animals 2 Vols. Hackils, History of Creation. 2 Vols.

౪. అంగదుండు నాకసంబును, ప్రియంగని నవాకంబు తనకీర్తియు మహో-
ఛ్ఛ్రయంబగు నది తనలోఁ, దం గాంచునట్టి యోజనాయామ మమర్చెన్. ౧౭౯

అర్థము. అంగదుండు=దక్షిణగా, నవకంబు=యుక్తంబు, మహోచ్ఛ్రయము=వృద్ధి, యోజనాయామ మమర్చెన్=అలోచించినవాఁ డయ్యెను. 'యోజన' యనుశబ్దము సంస్కృతమున చేదని పంపిన అంకును. యాకారాంతము తెలుఁగునందెప్పు కొన్న యోచన యనునది తెలుఁగు శబ్దమును గాదు.

తాత్పర్యము.

దక్షిణగా నాకాశంబున ప్రియంగనాకీర్తి యుక్తంబగు తన కీర్తిమహోచ్ఛ్రయ యభి వృద్ధి మొదలి హనుమంతుఁడు తనలో నిట్టు లాలోచించెను.

భూజసంతానము=చెట్లసమూహము, భూజ (సీత) యొక్క దుఃఖము బాపుటకై పోవు హనుమంతునిమీఁద. భూజ సంతతి=పుష్పములు, వల్లుల సముచిత మోదా, వలపులు= వాసనలు.

తాత్పర్యము.

అరటియుల( దిరిగిన రాక్షసులు చూచుచుండ తలంపుతో మద్యానవృక్షములు చూచుచు నిలుచున్న యాంజనేయునిపై వృక్షములు జలజల పూవులు రాల్పఁగా వాని సువాసనల వ్యాపింపఁజేయుచుఁ బాలతో నిండినవాఁడై యాయన యొప్పు చుండెను. పుష్పాభిషేకము శుభసూచకమే.

క. ఇట్టులు నూఱామడ యొక, పెట్టు వనిం దాఁటి బాహు•విక్రమపటుఁడై
నిట్టూర్పైనను విడువఁడు, కొట్టుబడఁడు గాసిఁ గొ•మ్మంజనుఁ డంతన్. ౧౩౯

తాత్పర్యము.

ఈ ప్రకారము నూఱుయోజనము లెక్కనాగిన సముద్రము విక్రమించక బాహు బలముచేతనే వేగముగ దాఁటి హనుమంతుఁడు మారుత్సన్యాయని నిట్టూర్పైన విడి చిన వాఁడు కాఁడు. అలసిన వాఁడును గాఁడు. హనుమంతుఁడు నూఱు యోజనముల సముద్రమును దాఁటెనని స్పష్టముగ రామాయణమునఁ గలదు.

ఇప్పుడు సముద్రమంత వెడల్పు లేదు. కావున రావణాసురుని లంక యిది యగునా యని కొందఱి సందేహము.

"There is a place called *Vikumbhila* about 40 miles from Colombo. It is associated with a Jagna or sacrifice performed by *Indrajit*. The Asoka forest of Ravana where Sita is kept is still in existence and I was told by a Brahman of Jaffna that there is an image of Sita, which is still worshipped. There is a rock in the waters at Point-de-Galle which goes by the name of Ravana Kotta-" D. N Gangli's trip to Colombo.

Buddhist Text Society's Journal Vol. III Pt. I Ap. 2.

దీనివలన నింద్రజిత్తు హోమము చేసిన నికుంభిలయు సీతాదేవి యుంచిన యశోక వనము నేఁటికి నున్నట్లును సింహ సీతాదేవి పూజింపఁబడు చున్నదనియు రావణకోట యను స్థలమున్నట్లు స్పష్టమగు చున్నది. దీనివలన నిప్పటి సింహళ ద్వీపమే మునుపటి లంకయని నమ్మఁదగి యున్నది.

ఇప్పుడు సింహళ ద్వీపమునకు మన దేశమునకు నడుమ సముద్రము వెడల్పు అఱువది మైళ్ళు యున్నది. నూఱు యోజనము లెక్కడ? అఱువది మైళ్ళెక్కడ యని సందేహము బాధింపకపోదు. యోజనము కొలఁది యొక్కటేనని నిక్కచ్చి లేక యున్నది. కొన్ని చోటుల నాలుమైళ్లు, కొన్నిచోటుల నెనిమిది మైళ్లు, కొన్ని చోటుల రెండున్నర మైలున్నట్లు కొందఱు వ్రాసి యున్నారు. తెనుఁగున ఆమడయు కొన్ని దేశములఁ బదిమైళ్లు, కొన్ని మండలముల నెనిమిది మైళ్లు కొలఁత గలదై

యున్నది. క్రోశమట్టి దీర్ఘమై యున్నది. ఇప్పటి మైళ్లు (1760 గజములు మైలు అను పరిమాణము) గలది పూర్వమందు లేదు. కావున యోజనమున కిన్ని మైళ్లని నిర్ధారింప సాధ్యము కాకున్నది. ఇప్పుడు సముద్రము అడుగున మైళ్లే యున్నది రామాయణ కాలమున సముద్ర మింత మాత్రమే కాదు. ఇప్పటి మధురకు గొంచెము దూరములోనే దక్షిణమున సముద్ర ముండినది. సముద్రభాగము విశేషముగా బూడి యున్నది నేల యైనదని యని తత్త్వవేత్తలు వ్రాసి యున్నారు.

"It thus appears that rocks and islets and fordable shoals existed in the channel, even at that time The feat of connecting the gaps to construct a cause-way was not impossible with Sugriva, who had almost all the resources of Southern India at his command"

ఇప్పటి రామనాథపురమునకు దక్షిణభాగమంతయు బూర్వము సముద్రము గానే యుండెను. కావున సుగ్రీవుడు వానరులకు చెప్పినప్పుడు "పాండ్యకవాటావని బరికింపుడీ" యని చెప్పి వెంటనే "వననిధి తీరముం గనుడి" యని చెప్పెనుగాని యడవులుగాని కొండలుగాని యూళ్ళుగాని చెప్పినవాడు కాడు. మఱియొక విషయము. మా స్వప్నమందు దీనితో సమానముగ బడినట్లు నుండు నిప్పటి మలయాళదేశము తిరువాంకూరు లోనైనది సముద్రమున మునిగియుండెననియు బరశురాముడు కోరగా సముద్రుడా ప్రదేశమును నాయన కిచ్చెననియు బురాణములు గలవు. కావున నిప్పటి తిరువాంకూరు పూర్వము సముద్రములో మునిగియుండెనేని యిప్పటి తిరునల్వేలి, మధురమండలమున దక్షిణభాగము సముద్రమున మునిగియుండుట యేమిచిత్రము? అదియును గాక రామాయణముచే జెప్పబడిన త్రికూటము, లంబ పర్వతము సువేల యనునవి లంకకు దక్షిణభాగంబున నున్నవి కాని యుత్తర భాగంబున లేవు. కావున నిప్పటి లంకయందలి యుత్తరభాగముకూడ సముద్రమున మునిగియే యుండవలెను. లేదా హనుమంతుడీ ప్రదేశమును విడిచి చక్కగా నిప్పటి కైనను బోయి యుండవలెను. ఈ పర్వతము చుట్టు సముద్రము చెప్పబడెనే కాని నేల గ్రామము లున్నట్టు వాల్మీకి చెప్పలేదు. సువేల యను పదము సముద్రతీర దేశమని తెలుపుచున్నది. లంకయందలి యిప్పటి యుత్తరపు రేవునకు త్రికూటమునకు నూఱుమైళ్ళకు పైగా నున్నది. కావున హనుమంతుడు దాటినది రెండువందల యేబది మైళ్ళని యేర్పడుచున్నది. కావున నూఱు యోజనము లనగా రమారమి రెండువందల యేబది మైళ్ళని గ్రహింపనగు. దీనివలన నిప్పుడు మహేంద్రనగరము రామాయణమునకు సంబంధించిన మఱి కొన్ని ప్రదేశములు శ్రీనివాసులచే జూపఁబడునవి కల్పితములు అని స్పష్టమగుచున్నది. ఇచ్చట నింకొక విషయ మాలోచింపవలసి యున్నది. అరణ్యమందు శూర్పణఖ లోనగు రాక్షసులు లంకకు బోవుచు వచ్చుచు నుండిరి. రావణుడు పంచవటి నుండి లంకకు బోయెను. వీరి కార్యము

ప్రశంసింపఁబడలేదు. హనుమంతుని కార్యము మాత్రము ప్రశంసింపఁబడు చున్నది. ఏల ?

రాక్షసులు స్వభావముచేఁ గామచారులు. వారు విద్యాబలముచే గోప్పదము వచ్చియుండిరి. అది గొప్ప కార్యము కాదు. హనుమంతుఁడు కేవల భుజబలము చేతనే దాఁటినవాఁడు అని రామాయణమునఁ జెప్పఁబడెను. కావున నిది ప్రశస్తము. రావణాసురుఁడు వాలి ముసలి గ్రద్ద యుద్ధము రాఁగానే తికమకలాడెను. హనుమంతుఁడు మూఁడు గండములు తప్పించుకొనెను. హనుమంతుఁడు సంజీవనికై పోయిన మార్గము చూచినప్పు డిది యొక లెక్కగాదు. తనవారికే కేవలది యసాధ్య కార్యము.

ఉ. ఆమడ లెన్నివే లయిన • నశ్రమలీలఁ దరింప నేర్తు నా
కామడ యేమి లెక్క యని • యాత్మఁ దలంచుచు మంజువాసనా
స్తోమము నింపుతోఁటలును • జొక్కపుఁబచ్చిక పట్టు స్వల్పపుం
భూమిధరంబులున్ గనుచుఁ • బోయి నగాగ్రమునుండి కన్గొనెన్. ౧౩౬

అర్థములు. మంజువాసనాస్తోమము = మనోహరమైన పరిమళముల సమూహము.

తాత్పర్యము.

ప్రయాసము లేక యెన్ని వేల యామడ లయిన దాఁటఁగలను. నూరామడ లొక్కలెక్క యనుకొనుచుఁ బరిమళించు తోఁటలును నిర్మలమైన పచ్చిక ప్రదేశములను జిన్న చిన్న గుట్టలను జూచుచుఁబోయి హనుమంతుఁడు కొండశిఖరమునుండి చూచెను.

ఉ. గోఁగులు దేవదారులును • గొండవిసెల్ చిటుసిమ్మ మల్లియల్
లేఁగు లరళ్లు గన్నెరులుఁ • బ్రేంకణములున్ గదంబముల్ మొగళ్లనున్
వీఁగఁగ బాఁచి కాచి యుర • విచ్చిక మొగ్గలఁ బూపసిందెలన్
ప్రేఁగుల నేలఁ బ్రాఁకు వృక్ష • వితానశాఖలు నాలతోఁటలున్. ౧౩౭

అర్థములు. పూపసిందెలు = లేఁతపిందెలు, ప్రేఁగుల = బరువుచే, వృక్షవితానశాఖలు = చెట్లకొమ్మలు, ఆలతోఁటలు = ఉద్యాన వనములు; (తాత్పర్యము స్పష్టము.)

క. కొమ్మలఁ గొనకొమ్మలఁ బవనమ్ములచేఁ జలించు నవియు • నవ్యములు శకుం
తమ్ములు నిండఁగఁ గడుహృద్యమ్ములు నగు పాదపముల • హనుమంతుఁడు గాంచెన్.

అర్థములు. శకుంతమ్ములు = పక్షులు, కడున్ = మిక్కిలి, హృద్యమ్ములు = మనోహరములు, పాదపములన్ = చెట్లను.

తాత్పర్యము.

గాలికిఁ గదలు కొమ్మలు కొనకొమ్మలు క్రొత్తవై చూడ నింపైన పక్షులు గల వృక్షముల హనుమంతుఁడు చూచెను.

హనుమఁడు = హనుమచ్ఛబ్దతద్భవము. హనుమ, హనుమఁడు దేశ్యములు అనుమ, అనుమఁడు.

బాళింపును. వీరి శక్తి శౌర్యము పుష్కలముగా నున్నవి. ఒకరి సాయ్యతో వీరికేమి పని ? ఒకవేళ యుక్తమన్నను సింగికంటె నెక్కువ ధైర్యశాలులు రామచంద్రునకొద్ద నేమి గలరు ? అటుగానున్న భేదోపాయముచే వారిలో వారికే కలహము పెట్టుటయన్న నదియు నసాధ్యమే. ఏలన భేదములు కల్పించుటకు వారి మర్మములు లోపాలోపములు ముందు తెలియవలె. వారిలోఁ గొందఱు పరిచితులు కావలె. వీరి మర్మము తెలియు టెట్లు? అటు తెలిసికొనుటకు వీరిలోఁ గలిసిమెలసి యుండు టెట్లు? అతి దుస్సాధ్య కార్యము! నన్నుఁ జూడఁగానే యందఱు నేకకలహముగను వచ్చెదరు కాని యూరక యుండ నీయరు ! కావున భేదోపాయము వ్యర్థమే. పోనీ యుద్ధములో గెల్చుటనిన నెంత యోచించినను నదియు సాధ్యముకాదు. ౧౦౦౯. పద్యము చూడుడు. క్రమక్రమముగ నభిప్రాయ మెట్లు మారెనో తెలియుడు.

క. నీలుం డంగదుఁడు దేన్ మతి, శాలి ప్రభువు సుగ్రీవుఁడును • జలనిధి దాఁటం
గా లంకాపురిఁ జేరఁగ, జాలెద రూహించ నిది • సాధ్యము సేయన్. ౧౦౬౮

తాత్పర్యము.

ఏ యుపాయము చేయుటకైన నెవరికి సాధ్యమగునో? నీలుఁడు, అంగదుఁడు, నేను, బుద్ధిశాలి ప్రభువు సుగ్రీవుఁడు నను నలుగురము సముద్రము దాఁటగలము. లంకను దాఁగలము ఈ నలుగురితో నే కార్యము కాఁగలదు !

క. ఇంతకు శ్రీరఘురాముని, కాంతామణి జీవయుతయొ • కాదో యూ వ్ప
త్క్రాంత మొదిఁగి సీతను గని, చింతించెదఁ గాక యవలి • చేఁత తెలుఁగుల్. ౧౦౭౦

తాత్పర్యము.

ఇంతకు నీ లంకను సాధించు నుపాయ మిప్పు డాలోచించి నేను చేయునది ఇంకను సీత యున్నదో లేదో, ఉండినఁ బ్రాణములతో నున్నదో లేదో! ఆ విషయము నిశ్చయము చేసికొనిన పిమ్మట సీతాదేవి యుండుండిన లంక సాధించు నుపాయ మాలోచింపవలె. ఇప్పుడు నేను చేయవలసిన యాలోచన యది కాదు. సీతాదేవి నెట్లు చూతునా యాలోచింపవలె. ఆ నిమిత్తమై లంకలో నెట్లు ప్రవేశింపవలె. ఇది నేను చేయవలసిన యాలోచన.

—• హనుమంతుఁడు లంకలోఁ జొచ్చు నుపాయంబు యోజించుట. •—

సీ. ఎటుల ప్రవర్తింప • నెంతయు మేలగు, రాముని కార్య మా•క్రమముగా నొ
క్కంగాగ్రహీము తా•కీఁ యై యొక్క- ముహూర్తంబు చింతించి • యుగ్ర దృష్టి
దూషంబుఁ జాలిచి • క్రూరరాక్షసమహో, త్సాహోగ్రము ప్రైమై • వఱలు లంకఁ
జొఱఁగ నసాధ్యంబు • సురనైరు లుండఁగ, వీర్యవంతులు మహా•భీమబలులు

గీ. జానకిని జోయుచోట నీ•సర్వదైత్య, తతుల వంచించి విధికాని•చితము లైన
దీనములఁ గొని మాపటి•వేళయందుఁ, జొచ్చి కార్యంబుఁ దీర్పఁగ•వచ్చుఁ గాక.

తే. ఎప్పు డెప్పుడు గ్రుంకునో • యాదినేశుఁ
డెప్పుడెప్పుడు వైదేహి • నేను జూతు
ననుచు నెదురు చూచుచు నుండ • నస్తమించెఁ
బద్మినీబాంధవుం డంతఁ • బశ్చిమాద్రి. ౧౫౫

అర్థములు. పద్మినీ బాంధవుఁడు=సూర్యుఁడు, సూర్యుడు పద్మినీ బాంధవుఁ డగుటచేతను సీతాదేవి పద్మిని యగుటచేతను నేనింక యుండిన నాదు కార్యము నెఱవేఱదని తలఁచి సూర్యుఁ డస్తమించెను.

తాత్పర్యము.

ఆలోచన కుదురుటచే నింక నా యాలోచన కార్యరూపముగఁ బరిణమింప జేయఁ గొందర పడుచున్నాఁడు. ఎప్పు డీ సూర్యుఁడు గ్రుంకునా ఎప్పుడు నేను సీతను జూతునా యని ప్రార్థ్యగుంకుఁడు కెదురుచూచుచుండఁగా సూర్యుఁడు పడమటికొండ వైపై నస్తమించెను.

౮వ పద్యమందుఁ దూర్పు తిరిగి సూర్యునకు నమస్కరించి హనుమంతుఁడు లంక దాట యత్నించె ననుటచే నుదయ మే నెనిమిది గంటల ప్రొద్దైన వై యుండవలెను. అభిజిత్తనఁగా బయలుదేఱి నాఁడనినచో మధ్యాహ్నము నీడ ౧౨ వ పద్యమునఁ జెప్పినంత యుండఁజాలదు. పడమటి సూర్యుని జెప్పెదిమా యనిన నంతే నీడ పడమటను నాలుగుగంటల ప్రొద్దైన నై యుండవలయును. తీరమున దిగి వనము లందు సంచరించి కొండ నెక్కి యింత యాలోచన చేసినను ఇంకను ప్రొద్దు గ్రుంక లేదని చెప్పుటచేఁ దీరమున దిగు నప్పటికి నాలుగు గంటల ప్రొద్దై యుండును. కావున నుదయ మెనిమిది గంటలకు బయలుదేఱి నాలుగు గంటలకుఁ దీరమున దిగెనని చెప్పవచ్చును. అటయిన నెనిమిది గంటల కాలము సముద్రము దాటుట యందుఁ బట్టినని యెంచవలెను. ఇందొక గంట కాలమైన విఘ్నములచే వ్యర్థమైయుండు ననుకొన్నను నేడు గంటల కాలములో రెండువందల యోజనదూరము ప్రయాణించె నని యెంచవలెను. అనఁగా సరాసరి గంటకు నఱువదియాఱు మైళ్ళు పోయెనని చెప్పవలెను. ఇది గొప్పగాదు. మరలి వచ్చునప్పు డింతకంటె నెక్కు గంటలో వచ్చెను.

తే. సూర్యుఁ డస్తగతుండైనఁ • జూచి పిదప, హనుమ యున్నత గతిఁ బెట్టి • యంత రూపుఁ
గాచి ప్రదోష కాలంబున • దనుజపురము, జొచ్చె రోకగంబు నెపనై చి • మాచి దాని.

అర్థములు. ప్రదోషకాలంబునన్ = "త్రియామా ప్రదోషస్స్యా ద్ధ్వానా వస్తంగతే రవౌ" సూర్యాస్తమయానంతరము మూఁడు ముహూర్తముల కాలము ప్రదోష మనఁబడును. "ప్రదోషో స్తమయా దూర్ధ్వం ఘటికాద్వయ మిష్యతే" ఇది గౌణమతము. జొచ్చెన్=ప్రవేశింపఁ బ్రయత్నించెను. లంకా ప్రవేశము ౧౫౫ వ

"అనేక రత్నాకృతి శైలరాజితే, పురం పతాకాధ్వజ తోరణాన్వితమ్,
యదా తదా హాస్తి మనుష్యవాజినాం పిబ త్యస్య కుమ్భాత్ రతే వసుంధరా."

యను వాక్యము ప్రమాణము.

అది కనఁబడె నేని భూమి నెత్తుటఁ దడియును. సత్ + స్ఫటికము=మంచిస్ఫటిక ములతో, సుసంకీర్ణ=బాగుగా వ్యాపించిన, కనకవైడూర్య ముక్తాప్రవాళభూషిత = బంగారు, వైడూర్యములు, ముత్యములు, పగడములు వీనిచే నలంకరింపబడిన, అసుర మందిర పుంజంబు=రాక్షసుల యిండ్ల గుంపులను, ఉన్నత=కొనియాడఁదగిన, శౌర్య= పరాక్రమముచే, నిష్ఠుర=కఠినులును, ఉదగ్ర=భయంకరులు నగు, రాక్షస=రాక్షసు లచే, అన్వితము=కూడినది.

## తాత్పర్యము.

మేడలవరుసలచే ప్రకాశించుచు నలుదరంబులైన బాటలును, బంగారు వెండి స్తంభములచే ప్రకాశించుచు బంగారు కిటికీలు గలిగి ఏడెనిమిది యంతస్తులు గలదై గంధర్వ నగరములవలె నుండు మేడలును గలిగి స్ఫటికములు పఱవఁబడినదై బంగారు, వైడూర్యములు, ముత్తెములు, పగడములు వీనిచే నలంకరింపఁబడిన రాక్షసుల యిండ్లవరుస లొప్పుచుండఁగా శ్రేష్ఠములైన తోరణములు గలిగి సర్వదా యలంకరింపఁబడి శ్లాఘింపఁదగి పరాక్రమము గల కఠినులైన రాక్షసులచే గూడినదై.

తే. అద్భుతంబు నచింత్య మై • యసురనాథ
రక్షితం బైన లంకాపు•రంబుఁ జక్కఁ
గాంచి దైన్యంబు నొందియు • తన్మనమునఁ
గనఁగఁ గోరుట సంతోష•కలితుఁ డయ్యె. ౧౬౧

అర్థములు. అద్భుతంబు = ఆశ్చర్యకర మైనది, అచింత్యము = ఇట్టిదని యూహింప రానిది- చక్కఁగాంచి = ఇదివఱకు దూరమునుండి చూచిన వాఁడు ఇప్పుడు సమీపమునకు వచ్చి చూచుచున్నాఁడు కావున బాగుగఁ గనఁబడెను.

## తాత్పర్యము.

ఆశ్చర్యకరమై యిట్టిదని యాలోచింప నలవికాని దానిదై రావణాసురునిచేత రక్షితంబైన లంకాపురమును సమీపమునకు వచ్చిన వాఁ డగుటచేఁ జక్కఁగా జూచి దీని నేమి? సాధింపుట యన నేమి? ఇది సాధ్యముగునదిగాఁ గోఁపలేదే యని వ్యసన పడిన వాఁడయ్యు సీతాదేవి యిందున్నదికదా; ఆమెను నేను దర్శింప వలెనఁగదా యను కోరికతో సంతోషించిన వాఁడయ్యెను.

క. కువలయ బాంధవుఁ డప్పుడు, నవగుణముం దోఁచ నినిభావంబున నా
భువి నివిఁ గాంతులఁ గప్పుచు, నవ్వునఁ దోఁచెను జక్కఁ•బాలుంలనునుమన్.

అర్థములు. కువలయ బాంధవుఁడు = కలువల చుట్టము, చంద్రుఁడు.

మంటపముల చేతను, చిఱుగజ్జెల రవళిచేతను పొగడ్తకెక్కిన యమరావతీ భోగవతీ పురములతో సమానమై యందముచేత నతిశయించు లంకాపట్టణమును బ్రవేశింప నారంభించెను.

క. అలకాపురమును బోలుచు, సలలిత మై హృష్టసైన్య•సంఘుష్టం బై
కలితతటిద్ఘన మై గ, జ్జెలరవళుల విరాజె నౌర • చిత్రం బనుచున్. ౧౬.౫

అర్థములు. సలలితమై = చక్కఁదనముతోఁ గూడినదై. హృష్టసైన్య సంఘుష్టమై = బలసిన సేనలచే ధ్వనింపఁబడినదై, కలితతటిద్ఘనమై = మెఱుపులతోఁ గూడిన మేఘము వంటిదై.

తాత్పర్యము.

అలకాపురముతో సమానమై, యందమై బాగుగఁ బోషింపఁబడుటచే బలిసిన సేనల ధ్వని గలదై, మెఱుపులతోఁ గూడిన మేఘము వంటిదై, గజ్జెల ధ్వనులచే నతిశయించి యున్నది. ఏమీ చిత్రము. ఇది హనుమంతుని స్వగతము. కవి వాక్యము గాదు.

—• హనుమంతుఁడు ప్రాకారంబునఁ జేరి యాలోచించుట •—

సీ. చని యిట్లు ప్రాకార•సన్నివేశముఁ జేరి, కలయుంగఁ గాంచె లం•కాపురంబు
స్వర్ణకవాటముల్ • వైడూర్యవేదికల్, గురువజ్రముక్తాశ్మ•కుట్టిమంబు
లపరంజిమెఱుగుకిం•శ్శమలసోపానముల్, మించి కెంపులమాడ్కి•మెఱయుచున్న
వరచతుశ్శాలలు • వరహంసయూథముల, కలకలార్భటులు నా•కసము నిండఁ

తే. దూర్యఘోషణారవములు • తోరములుగఁ, గలిగి వస్వౌకసార నాఁ•గ్రమ్ముమైన
విబుధశాత్రవనగరంబు•పెంపువొసఁగ, మదిని హర్షించి యా పావ•మాని దలఁచు.

అర్థములు. ప్రాకార సన్నివేశము = ప్రాకార సమీపమున నున్న బయలు, వేదికల్ = అరుఁగులు, గురువజ్ర ముక్తాశ్మ కుట్టిమంబులు = గొప్పవగు వజ్రములు ముత్తెములు వీనిచేతను నితర రత్నముల చేతను గట్టఁబడిన నేలలును, వరచతుశ్శాలలు = శ్రేష్ఠములైన నాలు దిక్కులయందు నభిముఖముగా నడుమ నెడము విడిచి కట్టిన గృహములు. "సంజవనం త్విదమ్ చతుశ్శాలమ్" అని యమరకోశమున చతుశ్శాల శబ్దము నపుంసకముగాఁ జెప్పఁబడినను పా. చతుశ్శాలా యని లింగాభట్టీయము. ఆబంతో వా ఇతి వాక్లీబత్వమ్ అని సుధా. తూర్య=వాద్యముల, 'వస్వౌకసారా = ఇంద్రపురము శక్రస్య పూర్వస్యాం దిశి వైపురీ' తూర్పుదిక్కున నుండు ఇంద్రునిపురము. "వస్వౌకసార" అను పురాణ వచనము, వస్వౌకసారా శక్రస్య యామ్యా సంయమనీ తథా, సుఖా జలేశస్య, సోమస్య చ విభావరీ" యను విష్ణు పురాణ వచనము స్మరించునది.

ఇంద్రుని పట్టనము పేరు వస్వౌకసార, యముని పట్టనము సంయమని, వరు

తాత్పర్యము.

ఈ ప్రకారము లంకను గాఁగల బలవంతు లగు వానరుల లెక్కించి లక్ష్మణుని బలము శ్రీరామచంద్రమూర్తి శౌర్యము నాలోచించి భయములేదు, వారువచ్చిన జయింపఁగలరని సంతోషించిన వాఁడయ్యెను.

రామలక్ష్మణులైన నిచ్చట నేమిచేయఁగలరని యధైర్యము వచ్చిన వాని కిప్పుడు కొంచెము ధైర్యము వచ్చెను.

క. నెంజియుఁ గనె మణివాసో, మండిత గోష్ఠావతంస • మతి యంత్రసభా
కాంత స్తని భూషితవే, తండగమన యట్లు వెలయు • దశకంఠపురిన్. ౧౭౯

అర్థములు. మణివాసస్ మండిత=రత్నములను వస్త్రములచేతను నలంకరింపఁబడినది. గోష్ఠావతంస=పసువుల కొట్టము లనెడి యలంకారములుగలది, యంత్రసభా కాంత స్తని=యంత్రగృహ సమూహము లనెడి స్తనముల గలది. కావునవే; భూషిత వేతండగమన=అలంకరింపఁబడిన స్త్రీ.

తాత్పర్యము.

మణులను సమీపించి పోయి మణులు లను వస్త్రములచేఁ గప్పఁబడినదియుఁ బసువుల కొట్టము లనెడి శిరోభూషణముల గలదియు యంత్రశాల లనెడి స్తనములు గలదియునై యలంకరింపఁబడిన స్త్రీవలె నుండు రావణుని పట్టణమును జూచెను.

లంకా నగరమును స్త్రీగా వర్ణించుట లంకాధిదేవత రాక సూచించుటకే. లంక స్త్రీవలె నున్నది గదా యనుకొనఁగానే లంక స్త్రీయై రానేవచ్చెను.

—• హనుమంతుఁడు లంకాధిదేవతను జయించుట. •—

క. నవరత్నకలితశాలా, నివహానిరస్తాంధకార • నిచయంబగు నా
దివిజారిపురముఁ జొచ్చెడి, ప్లవగు నిజాకారమూని • లంకయుఁ జూచెన్. ౧౮౦

అర్థములు. నవరత్నకలిత=నవరత్నములతో నిర్మింపఁబడిన, శాలానివహ = ఇండ్లసమూహముచే, నిరస్తాంధకార నిచయంబు = కొట్టివేయఁబడిన చీఁకటి గుంపు గలది. నిజాకారము = తన స్వస్వరూపము.

తాత్పర్యము.

నవరత్నములచేఁ గట్టఁబడిన యిండ్ల సమూహములచేఁ జీఁకటి యనునది లేకుండఁ జేయుచున్న యా రావణాసురుని పురము నందుఁ బ్రవేశించు వానరుని లంకాధి దేవత లంక యను పేరు గలది తన స్వస్వరూపముతోఁ జూచెను. లంకను హనుమ చూచెను, హనుమను లంక చూచెను.

చ. కనుఁగొని కింక లంకయు వి • కారముఖంబును ఘోరరూపముం
బెనఁగొన లేచి, యా ప్లవగ • పేరున కడ్డము నిల్చి, గర్జిలన్
నినుచుచుఁ బల్కె నోరి విను • నీల్గక మున్నె యెవండ వీ వహో
వనచర యేమి కార్యమున • వచ్చితి విచ్చటికి న్వచింపరా. ౧౮౧

అర్థములు. కినకన్ = కోపముచే. లంక యనునది గ్రామదేవత. గ్రామము రక్షించుచు నూరివెలుపల నుండును.

తాత్పర్యము.

ఇట్లుమారి లంక కోపించి చూపులు కనుపట్టునట్లైన ముఖము భయంకర రూపము దాల్చి హనుమంతుని కడ్డమువచ్చి నిలువబడి సింహనాదములు చేయుచు నిట్లనెను. ఓరీ! నీ వెవ్వఁడవు? పనిపనిగా నిచటికి వచ్చితివి? నీవు దాచకముండఁ జెప్పుము.

క. ఏవేళల నేవాటుల, రావణబలగుప్తమగుచుఁ • గ్రాలెడులంకన్
నీవా చొచ్చెడివాఁడవు, దేవాదులు చొచ్చి బ్రదుక • దెరువుం గలదే. ౧౭౨

అర్థములు. రావణబలగుప్తము=రావణుని సేనలచే రక్షింపబడునది.

తాత్పర్యము.

అన్నివేళలందును నన్నిస్థలములందును రావణుని సేనలు రక్షించుచున్న లంకను నీవా ప్రవేశింపఁ గలవాఁడవు. దేవతలు లోనగువారు ప్రవేశించి బ్రదుకఁగలరా?

చ. అనిన వచింపు నా చరిత • మంతయు నైన విరూపనేత్రవై
పని యొకటి గల్గి యీ నగరి • వాకిట నుండెద? వేల యోర్చుచున్
నను నిటు లడ్డగించెదవు • నాకిది తెల్పు మటన్న నామరు
• త్తనయునిఁ గాంచి లంక యనె • దారుణభాషలఁ గ్రోధదీప్తయై. ౧౭౩

తాత్పర్యము.

అని యిట్లు లంక యనుచుండఁగా హనుమంతుఁ డిట్లనెను. ఓసీ! నా కథ చెప్పెదనుగాని యీ వికారపుఁగన్నులతో నీ పట్టణము వాకిటనుండు నీ వెవతెవు! ఏల యుండుచున్నావు? ఏల యీ ప్రకారము ఓర్పుచు నా కడ్డము వచ్చెదవు? ఊరనియుండిన నెవ్వరైన రాక పోక యుండురా! చెప్పవలసిన దని యనుచుండఁగా నా మారుతిని జూచి భయంకరవాక్యములచేఁ గోపముచే మండిపడుచు లంక యిట్లనెను.

ఉ. రావణునాజ్ఞ మోచి నగ•రంబిది కాచెద నెల్లవేళలన్
నీ విటు కన్నుఁ బ్రామి నను • నేరవె దీనిఁ జొరంగ? నిప్పుడే
చావఁ గలాఁడ వోరి వన•చారి! స్వయంబుగ నేన లంకరా
నా విధ మింతి, నీకిఁక వి•నన్ వచియింపు మటన్న నాతఁడున్. ౧౭౪

అర్థములు. కన్నుఁబ్రామి=మోసగించి.

తాత్పర్యము.

రావణాసురు నాజ్ఞ శిరసావహించి నే నీ పట్టణము సర్వకాలములు రక్షించెదను. నన్నుఁ గన్నులు కప్పి నీవు ప్రవేశింప సాధ్యమా? ఓరి క్రోఁతీ! నీ విప్పుడే చావఁగలవు. నేనే లంకనురా. ఇది నా చరిత్రము. నీ వెవ్వఁడవో యిఁకఁ జెప్పుము.

—• లంక దన్ను రక్షింప హనుమంతుని వేఁడుట. •—

క. అనుముష్టిఘాతముననే, భ్రామించిన వివృతవక్త్రః • లోఁతుక నమనిం
సామతిఁ గనెఁ బావని యా,భామిని గతగర్వ యగుచుఁ • బలికె నతనితోన్.

అర్థములు. వివృతవక్త్ర=నోరు తెఱచుకొనినది.

తాత్పర్యము.

ఆ పిడికిటి పోటుననే యది నోరు తెఱచికొని నేలఁబడఁ బడఁగా హనుమంతుఁడు దానిని దయతోఁ జూచెను. అదియును గర్వము విడిచినదై యాయనతో నిట్లు అనెను.

క. కరుణింప వయ్య వానర,వర! కావుము నన్ను వీర్య•వంతుఁడ వెంతున్
వనితలఁ జంపఁగ రా దను,మరియాదను దాఁట రెప్పుడు • మహితబలాఢ్యుల్.

తాత్పర్యము.

వానరేంద్రా! నన్నుఁ గావుము. నా యందు దయ దలఁపుము. నీవు విశేష పరాక్రమవంతుఁడవు. విశేష బల సంపద గలవారు స్త్రీలను జంపరాదను మరియాదను దాఁటరు.

చ. అగచరలోకపుంగవ! స్వ•యమ్ముగ లంకను నేను, పోరిలోఁ
దెగి నను గెల్చి తీవు భవ•దీయపరాక్రమ మొప్పఁగంగ; ని
న్నగచరుఁ డెవ్వఁ డే గెలుచు • నాఁడు మొదల్ సురదైత్యకోటికిం
దెగుదలకార్య మచ్చెడి న•నెన్ విధి మున్ను వరంబు లిచ్చుతోన్. ౧౫౧

అర్థములు. అగచర లోకపుంగవ = వానరశ్రేష్ఠా, తెగుదల = నాశమైపోవు
విధి = బ్రహ్మదేవుఁడు.

తాత్పర్యము.

వానరశ్రేష్ఠుఁడా! నేనే లంకను. యుద్ధమునందు సాహసించి నీ బలపరాక్రమములచే నన్నే గెల్చితివంట. ఇఁక రాక్షసులకు కష్టమా? నాఁడు బ్రహ్మదేవుఁడు నగరప్రతిష్ఠయందు వరములిచ్చు సమయంబున నిన్ను నేనాఁడు సీతాదేవిని వెదకుచు క్రోఁతి వచ్చి గెలుచునో యానాఁడు మొదలు లంక నాశ మగునని చెప్పెను.

ఉ. సత్యముఁ జెప్పితి న్విధియు • సత్యము పల్కెను దప్పు లేమిటన్
దైత్యులకున్ వినాశనము • ధారుణికన్యక కారణంబుగా
మృత్యువు దాపరించె నిఁక • నేఁడును పట్టన మెల్లఁ జూడుమీ
కృత్యము లెల్లఁ దీర్చుకొను•మీ మది కోర్కెలఁ గీశపుంగవా. ౧౫౨

తాత్పర్యము.

వానరశ్రేష్ఠుఁడా! నేను సత్యము చెప్పితిని. బ్రహ్మదేవుఁడు యథార్థమే చెప్పెను, అది యేమియు చేసినను తప్పదు. సీతాదేవి కారణంబుగా రాక్షసులకు రావణునకు

సీ. ఘోషానునాదముల్ • శూరభుజాస్ఫాలనంబులు భీమకం•ఠరవములును
జాపకమాంత్రిక•స్వనము లాకర్ణించె, స్వాధ్యాయరతుల ని•శాచరేంద్ర
సంస్తవశీలుర • జక్కఁగఁ గనుఁగొని, రాజమార్గస్థచ•క్రముల రాజ
చారుల గర్జన్ని•శాటుల దీక్షిత, జటిలముండుల వృష•చర్మధరుల

తే. దర్భముష్టిప్రహారుల • దహనకుండ
సాధనులఁ గూటముద్గర • శస్త్రధరుల
నొంటి కన్నొక్క చెవియు లం•బోదరములు
వ్రేలురొమ్ములుఁ గలవారి • వేడ్కఁ గనియె. ౧౯౦

అర్థములు. ఘోషానునాదముల్ = స్వర్ణరత్నమయములైన మొలనూళ్లు అందెలు లోనైనవి తగులఁగాఁ గలిగిన ధ్వనులును, ఘోషానము రూ. ఘోషానము. శూరభుజాస్ఫాలనంబులు=శూరులు భుజము లప్పళించు ధ్వనులు, భీమకంఠరవములును = భయంకర కంఠధ్వనులును, జాపకమాంత్రికస్వరములు = జపము చేయువారి యొక్కయు, వేదాది మంత్రము లుచ్చరించు వారియొక్కయు ధ్వనులును, స్వాధ్యాయరతులన్ = వేదాధ్యయనము చేయువారలను, నిశాచరేంద్ర సంస్తవ శీలురను = రావణుని బొగడువారిని, రాజమార్గస్థ చక్రములను = రాచబాటలయందు నడుమ గుంపులుగఁ జేరినవారిని, రాజచారులన్ = వేగువాండ్రను, గర్జన్నిశాటులన్ = సింహనాదము చేయు రాక్షసులను, దీక్షిత జటిలముండులను = దీక్షవహించిన జడధారులను; బోడులను; వృషచర్మధరులన్ = ఎద్దు చర్మమును ధరించినవారిని, దర్భముష్టిప్రహారులన్ = దర్భలను పిడికిళ్లలో నాయుధములుగా నుంచుకొన్న వారిని, దర్భను చేత నుంచుకొని సత్కార్యానుష్ఠానము చేసిన శత్రువులు నశింతురు.

"యథా వజ్రం హరేః పాణౌ, తథా విప్రకరే కుశః"
ఇంద్రునిచేతి వజ్రాయుధ మెట్టిదో బ్రాహ్మణునిచేతి దర్భ యట్టిది. దహనకుండ సాధనులన్ = నిప్పుగుండమే యాయుధముగాఁ గలవారిని, శత్రునాశార్థము నిప్పుగుండమున హోమము చేసి కృత్యను గలిగింతురు గావున వాని నాయుధముగాఁ జెప్పెను. లంబోదరములు=వ్రేలాడు పొట్టలు.

తాత్పర్యము.

అందెలు మెట్టెలు పాయుజేలు లోనగు కాలియాభరణములు మొలనూళ్లు తగులఁగాఁ బుట్టిన చప్పుడులు శూరులు భుజములు తట్టుకొనఁగాఁ బుట్టిన ధ్వనులు వీరుల భయంకరములైన సింహనాదములు జపములు చేయు వారియొక్కయు మాంత్రికుల యొక్కయు ధ్వనులను వినెను. వేదాధ్యయనము చేయువారలను, రావణు పొగడు స్వభావము గల వారలను (వీరు రాక్షస వంది మాగధులు) రాచబాటల నడుమ నిలఁబడిన గుంపులను, వేగు వాండ్రను, గర్జించు రాక్షసులను, దీక్ష గొన్న వారిని జడలు పెంచుకొన్నవారిని, బోడి తలల వారిని (రాక్షస సన్న్యాసులు) ఎద్దు చర్మ

ములను ధరించిన వారిని దర్భ పికిళిల్లు నగ్నికుండములు నాయుధములుగాఁ గలవారిని సమ్మెటలు ఇనుప గుదియలు ధరించిన వారిని, ఒంటికన్ను, ఒంటిచెవి, వ్రేలాడు పొట్టలు, వ్రేలాడుచన్నులు గలవారిని హనుమంతుఁడు చూచెను.

సీ. వికటకరాళుల • విపులకోదండుల, వామనులను భుగ్న • వక్త్రియుతుల
ఖడ్గుల ముసలులఁ • గవచులఁ బరిఘాయుధులను శతఘ్న్యాయు • ధులను మఱియు
నాధికస్థూలుల • నాతికృశాంగుల, నాతిదీర్ఘుల నాతి • హ్రస్వకులను
నాతిగౌరాంగుల • నాతికృష్ణాంగుల, నాతివామనులను • నాతికుబ్జ

తే. కులను బహురూపులను విరూ • పుల సురూపు
లను సువర్చసులను బతా • కినిచయముల
ధ్వజుల వివిధాయుధుల శక్తి • భుజధరులను
బట్టిసాయుధులను గాన్పు • పట్టి గనియె. ౧౧

అర్థములు. వికట కరాళులన్ = భయంకరములైన మిట్టపండ్లవాండ్రను, విపుల కోదండుల = పెద్దవిండ్లను ధరించినవారిని, వామనులను = పొట్టివారిని, భుగ్న వక్త్రియుతులన్ = వంకరయగు నోళ్ళతోఁ గూడిన వారిని, ఖడ్గులన్ = ఖడ్గముల ధరించిన వారిని, ముసలులన్ = రోఁకండ్లను ధరించినవారిని, కవచులన్ = కవచముల దొడిగిన వారిని, పరిఘాయుధులను = ఇనుపకట్ల గుదియలు ధరించినవారిని, శతఘ్న్యాయుధులను = శతఘ్నులాయుధములుగాఁ గలవారిని, 'అయః కంటక సంఛన్నా శతఘ్నీ పరికీర్తితా' వైజయంతి. మేకులు మేకుల యినుపగద శతఘ్ని యనఁబడును. నాధిక స్థూలులన్ = మిక్కిలి స్థూలములు కాని దేహములు గలవారిని, నాతికృశాంగులన్ = మిక్కిలి కృశింపని దేహములు గలవారిని, నాతిదీర్ఘులన్ = మిక్కిలి పొడవు కాని వారిని, నాతిహ్రస్వులను = మిక్కిలి పొట్టిగాని వారిని, నాతిగౌరాంగులన్ = మిగులఁ దెల్లని కాని శరీరము గలవారిని, నాతికృష్ణాంగులను = మిగుల నలుపుగాని వారిని, నాతివామనులను = మఱుగుజ్జులు కాని వారిని, నాతికుబ్జులను = విశేషము గూని లేని వారిని, బహురూపులను = అనేకవిధములైన రూపాకారములు గలవారిని, సురూపులను = చక్కఁదనము గలవారిని, సువర్చసులను = మంచికాంతి గలవారిని, పతాకినిచయములను = చిన్నధ్వజములు పట్టుకొన్నవారిని, ధ్వజులన్ = పెద్దటెక్కెములను బట్టుకొన్న వారిని, వివిధాయుధులను = పెక్కుతెగల యాయుధములను ధరించినవారిని, శక్తి భుజధరులను = శక్తులను బల్లెములను ధరించిన వారిని, పట్టిసాయుధులను = కటారులాయుధములుగాఁ గలవారిని, గాన్పుపట్టి = వాయుపుత్రుఁడు, కనియెన్ = చూచెను.

తాత్పర్యము.

మిట్టపండ్ల వాండ్రను, పెద్దవిండ్ల వాండ్రను, పొట్టివాండ్రను, వంకర నోటి వాండ్రను, బాకులు రోఁకండ్లు గుదియలు ఇనుపముండ్ల గదలు ఆయుధములుగఁ గల

అర్థములు. వెలిదమ్ముల్ = తెల్లతామరలు, రంగగు = అందమైన, ఈ మూడు పద్యము లేకాన్వయము; ఇందలి విశేషణములకు రాణివాసము (౯౫ వ. ప.) విశేష్యము.

తాత్పర్యము.

బంగారు తోరణములు గలిగి కొండ శిఖరములందుఁ దెల్లఁదామరలు గల యగడ్తలతో వెలింగెడి ప్రాకారము గలదై.

వ. అమరనివాసతుల్య మయి • హారినినాదయుతంబునై తురం
గమపటుహేషితంబు నయి • క్రమవిభూషణశింజితంబు నై
విమలవిమానయానరథ•విశ్రుతవారణమత్తపక్షిసం
ఘమ్మృగమనోహరంబు నయి • క్రాలు మహాబలయోధగుప్తమున్. ౯౫

అర్థములు. అమరనివాస తుల్యమయి=స్వర్గముతో సమానమై, నినాదము = ధ్వని, తురంగమ పటుహేషితంబు నయి=గుఱ్ఱముల గొప్ప సకిలింపులుగలదై, క్రమవిభూషణ శింజితంబునై = మనోజ్ఞములైన యాభరణముల ధ్వనులు గలదై, విమానము = ఆకాశమున సంచరించు వాహనము, యానము = పల్లకి మొదలగునవి, వారణ=ఏనుఁగులు, మహాబల యోధగుప్తమున్ = మిగుల బలముగల యోధులచే రక్షింపఁబడినది.

తాత్పర్యము.

స్వర్గముతో సమానమై మనోహర ధ్వనులతోఁ గూడినదై గుఱ్ఱముల గట్టి సకిలింతలు గలదై, మనోహరమైన భూషణ ధ్వనులు గలదై, ఆకాశ యానములు పల్లకులు తేరు ప్రసిద్ధి కెక్కిన యేనుఁగులు మదించిన పక్షులసంఘములు జింకలు వీనిచే నందమై మిగుల బలవంతులగు యుద్ధభటులచే రక్షింపఁబడినదై.

వంశస్థము. సహేమరత్నోజ్జ్వల•చక్రవాళమున్, మహార్హ ముక్తామణి•మండితాంతమున్
మహాఽసితాభ్రాగురు•మంజుగంధమై, రహించు రక్షోధిపు•రాణివాసమున్.

అర్థములు. సహేమ రత్నోజ్జ్వల చక్రవాళమున్ = బంగారుతోఁగూడి రత్నములచే వెలింగెడి ప్రాకార వలయము గలదానిని, మహార్హ=మిక్కిలి వెలగల, ముక్తామణి = ముత్యములచే మణులచే, మండితాంతమున్ = అలంకరింపఁబడిన లోపలి భాగముగలదానిని, మహాఽసిత=మిగుల నల్లనైన, అభ్ర=మబ్బువంటి రంగుగల, అగురు = అగురు చెక్కలయొక్క, మంజుగంధమై = మనోహరమైన వాసనగలదై, రహించు=ప్రకాశించు, రాణివాసమున్ = అంతఃపురమును, పై పద్యములోని కనుఁగొనితో నన్వయము. వంశస్థము. జత జరగణములు. ఎనిమిదింట యతి.

తాత్పర్యము.

బంగారుతోఁగూడిన రత్నములచేఁ బ్రకాశించు ప్రాకారవలయము గలదియును, మిగుల వెలగల ముత్యములచేతను రత్నములచేతను నలంకరింపఁబడిన మధ్య

వాఁడై, ఉత్తర శృంగమని, దక్షిణశృంగమని చంద్రుని కొనలకుఁ బేర్లు. ఇట్టి శృంగములు గల వాఁ డిప్పుడు శృంగములు లేనివాఁడై ప్రకాశించె నని భావము.

తాత్పర్యము.

బలసిన వాఁడి కొమ్ములుగల యెద్దువలె బంగారు కొమ్ములు గల యేనుఁగు వలె తెల్లని యున్నతమైన శిఖరములు గల కొండవలె నుండు చంద్రుఁ డిప్పుడు పరిపూర్ణ శృంగుఁడై లోకముల కింపైన కాంతి గలవాఁడై ప్రకాశించెను.

వంశస్థము. వినష్టశీతోదక•బిందుపంకుఁడున్, ఘనగ్రహగ్రాహవి•నష్టపంకుఁడున్
వినోదలక్ష్మ్యాశ్రయ•నిర్మలాంకుఁడున్, వినిద్రరుగ్యుక్తిఁ జ•నెన్ శశాంకుఁడున్.

అర్థములు. వినష్ట = నశించిన, ఇది పంక విశేషణము, శీతోదక = మంచు యొక్క, బిందు=తుంపరలచే, పంకుఁడు=మాలిన్యము కలవాఁడు, అట్టి మాలిన్యము లేదని భావము. ఇది చంద్రుని యందు సూర్యకిరణ సంబంధము చేత నని యెఱుఁగునది. ఇట్లు చెప్పుటచే మంచుకాలము పోయినదనిభావము. కావున నిది ఫాల్గునమస్యమే. ఘనగ్రహ గ్రాహ వినష్టపంకుఁడున్=(౧) ఘనగ్రహ=గొప్ప గ్రహములైన బృహస్పత్యాదులను, గ్రాహ = తనకిరణములచేఁ గప్పుటచేత, వినష్ట=నశించిన, పంకుఁడున్= కాంతి హీనత కలవాఁడు, తన కిరణములచే నితరగ్రహములను గాంతి తగ్గించి, తాను అధికముగ వెలుఁగుచున్నాఁడని భావము. (౨) ఘనగ్రహ=గొప్పగ్రహమైన సూర్యుని యొక్క, గ్రాహ = కిరణ సంబంధముచే, వినష్ట = నశించిన, పంకుఁడున్ = చీఁకటి గలవాఁడును. సూర్యకిరణ సంబంధముచేఁ దాను వెలుఁగుచుఁ జీఁకటిని దొలఁగించు చున్నాఁడని భావము. 'సలిలమయే శశిని రవే ర్దీధితయో మూర్ఛితా స్తమో నైశం। క్షపయంతి దర్పణోదర నిహితా ఇవ మందిరస్యాంతః॥' అను వరాహమిహిరాచార్యుని వాక్యము ప్రమాణము. సూర్యకాంతి యద్దముపైఁ బడి నేని యెట్లు ప్రతిఫలించునో యట్లే జలమయమైన చంద్రునియందుఁ బడిన సూర్యకాంతి ప్రతిఫలించి వెన్నెలగా వ్యాపించును.

వినోద లక్ష్మ్యాశ్రయ నిర్మలాంకుఁడున్=వినోద=ఆశ్చర్యకరమైన, లక్ష్మి= కాంతి విశేషమునకు, ఆశ్రయుఁడు కావున నిర్మలమైన కళంకముగలవాఁడు,అంకము= చిహ్నము, కళంకము తెల్లగా నున్న చంద్రునియందు నలని కళంకము పరభాగము నొంది వెలుఁగుచున్నదని భావము. శశాంకుఁడున్ = కుందేటివంటి మచ్చగలవాఁడు. చంద్రునియందు భూచ్ఛాయ కుందేటివలెఁ బ్రతిఫలించుచున్నది. "లోకచ్ఛాయ మయం లక్ష్మ తవాంకే శశసన్నిభమ్" అని హరివంశము. 'భూచ్ఛాయ మైచ్ఛన్నరే' చిల్లిగాఁడు. వినిద్రరుక్ + యుక్తిన్=అధిక కాంతితోఁ గూడిన వాఁడయి.

తాత్పర్యము.

నశించిన మంచు బిందువుల మాలిన్యము గలవాఁడును, తన కాంతిచే బృహ

షుల మనెడి తాపముచేఁ గలిగిన మనస్సునందలి ప్రణయకోపము గలదియునై స్వర్గలోక సంతోషము వంటి సంతోషమును తన తేజస్సుచేఁ గలిగించెను.

ఉ. అత్తఱిఁ దంత్రినాదము ల◆రాఁ దెను కర్ణసుఖప్రవృత్తమై
నిత్తరి మొత్తముల్ నిజుల◆పెల్చన నొప్పె హ్యాస్తిక వృత్తమై
హత్తెను క్రూరశీలపిశి◆తాశనసంఘము రౌద్రవృత్తమై
తత్తఱిచే వియుక్తవని◆తాతతి కుందె సుమేషుకృత్తమై. ౧౦౫

అర్థములు. అత్తఱిన్ = ఆ సమయమునకు, తంత్రీనాదము=వీణెలు వాయింపఁగాఁ బుట్టిన నాదము, కర్ణసుఖప్రవృత్తమై = చెవులకు సుఖము కలిగించునదియై, నిత్తరి మొత్తముల్=స్త్రీల గుంపులు, పెల్చన = అతిశయముచే, హ్యాస్తికవృత్తమై= భర్తల ననుసరించునదియై, క్రూరశీల=హింసాస్వభావముగల, పిశితాశన సంఘము = మాంసముభక్షించువారిసమూహము, రౌద్రవృత్తమై=భయంకర వ్యాపారముగలదై, హత్తెను=ఒప్పెను, వియుక్త వనితాతతి=భర్తల విడిచియుండు స్త్రీజనము, సుమేషుకృత్తమై=మన్మథుని పూల బాణములచేఁ జీల్పఁబడినదై, కుందెన్=దుఃఖించెను.

తాత్పర్యము.

ఆ సమయమునఁ గర్ణరసాయనంబుగా వీణానాదము వినవచ్చెను. శృంగారచేష్టలు గల యువతులు నిరతిశయముచే భర్తల ననుసరించిరి. హింసాశక్తిగల మాంసభక్షక సంఘము రౌద్రకార్యములు చేయసాగెను. భర్తలను విడిచియుండు స్త్రీలు మన్మథతాపముచే తత్తఱపడి దుఃఖించిరి.

క. గృహములు మత్తోన్మత్తని,వహములు రథగజతురంగ◆భద్రాసనసం
గ్రహములు శుభవీరవరా,వహములు గనుఁగొనియెఁ బ్లవగ◆వల్లభుఁ డచటన్.

అర్థములు. మత్త+ఉన్మత్త+నివహములు=మత్త = మద్యపానముచే దేహములు తెలియనివారలయు, ఉన్మత్త = చేయవలసిన కార్యముల మఱచిన వారలయు, నివహములు=సమూహములు, భద్రాసన = శుభకరములయినవాని సంపాదించ కలది, శుభ = క్షేమకరములైన, వీరవరా = వీరలక్ష్మిని, అవహములు = కల్గినవి. గృహములకు విశేషణములు. త్రిప్రాసకందము.

తాత్పర్యము.

మత్తులు నున్మత్తులు గలవియు, రథములేనుఁగులు గుఱ్ఱములు శుభాసనములు వీని సంపాదించ గలవియు, వీరలక్ష్మిని గలవియు నగు గృహములను వానరపతి కనుఁగొనెను.

—◆ హనుమంతుఁడు లంకలో రాక్షసస్త్రీపురుషులఁ జూచుట ◆—

క. ఆక్షేపంబుల నుడువుచు,విక్షేపంబులను మత్తవిధభాషా
ధిక్షేపంబుల నన్యో,న్యక్షేపంబులఁ జెలంగు◆దనుజులఁ గాంచెన్. ౧౦౬

సీతకును రవికె లున్నట్లు ప్రమాణము గానరాదు. కావుననే మరికొందఱు స్త్రీలు తమ వనాతి యూర్వ్యాచార మను చున్నారు. క్లాంతి = రతిశ్రమచే, గళత్ = జారిపోయిన, కరఁగిపోయిన, సుపర్ణులను = చెంపలందు స్తనములందు వ్రాయఁబడిన మకరికా పత్రములు గల వారిని, ఇప్పుడు కొందఱు స్త్రీలు పచ్చపొడిపించు కొన్నట్లు పూర్వకాలమందు కస్తూరి కుంకుమపువ్వు మొదలయిన వాని లేపముతో చెంపలందును స్తనములందును మొసళ్ళవలెఁ తీఁగలవలె స్త్రీలు చిత్రములు వ్రాసికొను చుండిరి. నాయక విద్ధ = భర్తలచే విసరి చల్లఁబడిన, సుగంధి చూర్ణలన్ = మంచి వాసనగల గంధపొడి గలవారిని, క్రాంత వికీర్ణ చూర్ణ కచలను, చారు దృగబ్జ నిగార కర్ణలన్; అని విశేషణోభయ పదము. క్రాంత = సురత శ్రమ కలవారు గనుకనే, వికీర్ణ = చెదరిన, చూర్ణకచ = ముంగురులు గలవారిని, చారు = అందమైన, దృగబ్జ = కమలములవంటి కన్నులచే; నిగార = మ్రింగఁబడిన, కర్ణలన్ = చెవులుగల వారిని, కన్నులు దీర్ఘములై చెవుల దాఁక వ్యాపించి యున్నవని భావము. పై పద్యముతో నేకాన్వయము.

తాత్పర్యము.

అందమైన బంగారు వంటి దేహకాంతిగల వారిని, భర్త నెడఁ బాసిన విరహ తాపముచే తెల్లబాఱిన వారిని, మన్మథకేళియం దాఱితేఱిన వారిని, పైఁటలు జాఱి పోవుటచేఁ గానవచ్చు పచ్చని స్తనములుఁ గలవారిని, రతిశ్రమముచేఁ గరఁగి పోయిన మకరికా పత్రములు గలవారిని, భర్త గంధపొడి చల్లిన వారిని, రతిబడలికచేఁ జెదరి వంకరలైన ముంగురులు గలవారిని చెవులదాఁక వ్యాపించిన నిడుపాటి కన్నులుగల వారిని.

ఉ. రామలఁ బ్రాప్తనాథపరి•రంభణహృష్టమనోభిరామలన్
శ్యామల నాత్మమందిరవి•హారకళాపరమాభిరామలన్
కోమలగాత్రవల్లు లగు•కోమలఁ బ్రేమరసైకధామలన్
రాముని మాట గన్గొనియె • రాక్షసకేళిగృహాళిసీమలన్. ౨౧॥

అర్థములు. ప్రాప్తనాథ = స్త్రీలచే స్వయముగాఁ బోయి పొందఁబడిన, భర్తల యొక్క, పరిరంభణ = కౌఁగిలింతలచే, హృష్టమనోభిరామలన్ = సంతోషించిన మనస్సుచే నొప్పినవారిని, శ్యామలన్ = నడిమి వయస్సువారిని, 'శ్యామా యౌవన మధ్యస్థా' అనుటచే. ఆత్మమందిర = తమ యిండ్లయందే విహారకళా = విహరించు వారగుటచే, పరమాభిరామలన్ = మిగుల మనోహరలైన వారిని, వీరు సంపదచే నిండకన్ను వారు కన్నెలుఁగాక యున్నవారో, లేక ఘోషాలో (పరదా పద్ధతిచే నిల్లు విడిచి వెలుపలఁబోని కులపాలికలో) కావున వెలుపలఁబోక తమ యిండ్లకే నిలుల చెల్లించుకొను నేర్పులని కొందఱి యభిప్రాయము. కోమలగాత్రవల్లులగు = మృదువైన తీఁగలవంటి దేహములుగల, కోమలన్ = స్త్రీలను, చూ. కొమ్మ. ప్రేమరసైకధామలన్ =

అర్థములు. అర్క-వర్ణ ప్రావృతమై=సూర్యకాంతిగల ప్రాకారముచేఁ జుట్టఁబడినదై, ఇది దివిజారి భవనమునకు విశేషణము.

తాత్పర్యము.

సింహములు గావఁగా నిరపాయముగా నుండు వనమువలె మిగులఁ గ్రూరులగు రాక్షసులు గాచుటచేఁ గీర్తిగని సూర్యునికాంతిగల ప్రాకారముచేఁ జుట్టఁబడి-

సీ. దేదీప్యమాన మౌ • దివిజారిభవనంబుఁ, గని ముక్కునను వ్రేలు • గదియఁ జేర్చి
రూప్యకోపహితాభి • రూపమణీహేమ, భూషితతోరణ • పుంజ మగుచుఁ
జిత్రకక్ష్యంబులఁ • జెలువారి రుచిర మా, ద్వారపంక్తులచే సు • దార మగుచు
వారణారూఢుల తా • బరికాంద్రజచేతను, శ్రమ నొందంగని యశ్వ • రాజిచేత
తే. శోభితం బయి శ్రోత్కనీ • చోట్ల శ్రోత్క-
యుగ్యములచేతఁ బలులయు • నుగ్రసింహ
ములయుఁ జర్మములను గప్పి • మొనసి దాంత
కాంచనాంచిత మగు రథ • గణముచేత. ౨౨౨

అర్థములు. దివిజారి భవనంబుఁ గని = రావణునింటినిఁ జూచి, రావణు గృహము హనుమంతుఁడు ప్రవేశించినట్టు ముందు చెప్పఁబడెను. మఱల నిప్పుడు చూచెనని చెప్పఁ బడియునిన మొదట రావణాంతఃపురమందు సీత యున్నదని చెప్పుటచేత నందు వెదకుద మని ప్రవేశించెనుగాని జాముర్రాత్రియే యయి యుండుటచే నందఱు నిద్రింపక మేలుకొని యుండిరి. ఆ కారణముచే మఱల వెలుపలికి వచ్చి లంకాపురమున వెదకెను. గనుకనే లంకాపుర స్త్రీలు మొదలగువారు వర్ణింపఁబడిరి. ఇప్పు డంతకంటెఁ బ్రొద్దు పోయిన కారణముచే మఱల రావణు గృహము నొద్దకు వచ్చెనని గ్రహింపవలయును.

దేదీప్యమానము = తళతళ ప్రకాశించునది. రూప్యక+ఉపహిత = వెండిచేఁ జేయఁబడినదియు, అభిరూపమణీ హేమభూషిత = మంచి రత్నములచేతను, బంగారుచేతను నలంకరింపఁబడినది, తోరణపుంజము = తోరణముల సమూహము గలది, చిత్రకక్ష్యంబులు = వింతలగు తొట్టికట్లు, వారణారూఢులు = ఏనుఁగుల నెక్కినవారు, బలికాంద్రజచేతను = మావటివాండ్రచేతను, క్రొక్కనిచోట్ల క్రొక్క=గుఱ్ఱముల వేగముగఁబోవు, యుగ్యములచేత = తేజీకట్టిన గుఱ్ఱములచేత, దాంతకాంచన అంచితమగు = దంతములచేతను బంగారుచేతను ప్రకాశించునదియు.

తాత్పర్యము.

భగభగాయమానముగ వెలుఁగుచున్న రావణు గృహముఁ జూచి యాశ్చర్యమున ముక్కుపై వ్రేలుంచుకొని వెండితోఁ జేయఁబడినదియు, మేలైన రత్నములు బంగారు చేతను నలంకరింపఁబడినదియు నగు తోరణ సమూహము కలిగి వింతలగు తొట్టికట్లు కలిగి యుందమయిన ద్వారములచే, విశేషించి యేనుఁగు లెక్కిన మావ

టేల చేతను, కష్టము తెలియని శూరులచేతను, శోభించి యతిశయముగ గొప్ప తే
స్సులచేతఁ బులులయు సింహములయుఁ జర్మములచేఁ గప్పఁబడి దంతము బంగా
రుతోఁ బ్రకాశించు తేర్ల గుంపులచేత.

సీ. రహిఁ మీఱుచు నమూల్య•రత్నసమాకీర్ణ, మై పరార్ధ్యాసన • మగుచు మతిశయ
మతిరథావాస మై • యతులరథంబులు, నతులపీఠంబులు • నమర బహువి
విధమృగంబులచేత • వికిరసంఘముచేతఁ, బరిపూర్ణ మగుచు ని•ర్భయత రేఁగు
నంతపాలురచేత • నభిరక్షితం బయి, యాత్మ కెక్కినయింపు•లాఁడు గొప్ప

తే. బలువు వెన్నెలపులుఁగుల•బలిసి యార్పు
కన్నుఁగవ లొప్పు ప్రమదల•కనకరత్న
భూషణంబులరావున • బొడము నులివు
లబ్ధిరావంబు నటు లుండు•మనుచు నుండె. ౨౨౩

అర్థములు. రహిమీఱుచు=బాగుమీఱుచు, అమూల్యరత్న సమాకీర్ణము = వెలలేని మణులచేఁ గూడినదై, పరార్ధ్యాసన = గొప్ప పీఠములు గలది, అతిరథ + ఆవాసమై=అతిరథులకు స్థానమై, పెక్కు-విలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు అతిరథుఁడు, వికిర = పక్షుల, అంతపాలురచేతన్=గృహము వెలుపల రక్షించువారిచేత, ఉలివులు=ధ్వనులు, అటు లుండు మనుచు=తిరస్కరించుచు.

"స్పర్ధతే, జయతి, ద్వేష్టి, ద్రుహ్యతి, ప్రతిగర్జతి, ఆక్రోశ త్యవజానాతి, కదర్థయతి, నిందతి, తస్య చానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః । ఉపమాయా మిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసంపదాః" అండ్రు. కావున నిది యుపమాలంకార మని తెలియఁదగునది.

తాత్పర్యము.

బాగు మీఱి వెలలేని రత్నములచే నిండినదై పెద్దపీఁటలుగలిగి, యతిరథులకు వాసస్థానమై యసమానములైన తేర్లు, పీఁటలు గొప్పవియుండ, అనేక విధములైన మృగములచేతను, పక్షుల గుంపులచేతను, నిండి భయములేక విజృంభించు వెలుపలి కావలివారిచేఁ జక్కఁగఁ గాపాడఁబడి మనస్సునకుఁ దృప్తిని గలిగించు సొమ్ములనొప్పు లగు స్త్రీలను గలదై, బలసిన చకోర పక్షులతో సమానములైన కన్నులుగల స్త్రీల బంగారు, మణుల భూషణముల రాపిడిచేఁ బుట్టిన ధ్వనులు సముద్రధ్వనులను గెలిచియుండె.

తే. చంపకాగరుధూపవా•సనలు నిండ, భేరికామర్దలధ్వనుల్ • బోరుకొనఁగ
నిశిచరావిరతాభ్యర్చి•తయు మగుచు, నబ్ధిగంభీర మగు రావ•ణాలయంబు. ౨౨౪

అర్థములు. నిశిచర = రాక్షసులచే, అవిరత = ఎడఁతెగక, అభ్యర్చితయు మగును = పూజింపఁబడినదై, అబ్ధి గంభీరము = సముద్రమువలె గంభీరమైనది.

తాత్పర్యము.

చందనము, అగరు మొదలగు ధూపముల వాసనలు నిండఁగా భేరులయు, మద్దెలలయు ధ్వను లతిశయింప, రాక్షసులచే సర్వదా పూజింపఁబడుచు సముద్రమువలె గంభీరమైన రావణ గృహము.

క. పొంకంబుగ హయవారణ,సంకులమై వివిధరత్న•జాలక వేశ్మా
లంకృత మగుదానిని గని, లంకాభరణంబుగాఁ దఁ•లఁచి నికటమునన్. ౨౨౫

అర్థములు. హయవారణ సంకులమై=గుఱ్ఱములచే, ఏనుఁగులచే నిండినదై; వివిధ రత్నజాలక = నానావిధములయిన మణులు, గవాక్షములు గల యిండ్లచే నలంకరింపఁబడిన దానిని; నిది లంకకు నలంకారమైనదని తలఁచి దాని సమీపమున,

చ. నెదకెను రాక్షసావళుల • వీడును వీడును వాడ వాడయున్
వదలక తోఁట తోఁటయును • నానవిమానముఁ దొడ్డి దొడ్డియున్
గొనకొని మేడ మేడయును • గూటము గూటము మూల మూలయున్
మది వెఱలేక తా విసివి • మానక కార్యభరంబు పెంపునన్. ౨౨౬

అర్థములు. రాక్షసావళుల = రావణు పోదనులు మున్నగు రాక్షసుల, గొనకొని = త్వరపడి, వెఱలేక=భయముపడక, విసివి మానక=విసుఁగుచే వదలక.

తాత్పర్యము.

సులభము.

—• హనుమ రాక్షసముఖ్యుల యిండ్లయందు సీతాదేవిని వెదకుట. •—

సీ. వేగ ప్రహస్తుని•వీటికి లంఘించి, మొలము మహాపార్శ్వ•నిక్క— కెగిరి
కంవతుల్యము కుంభ•కర్ణుసౌధముఁ జొచ్చి, యల విభీషణు వాస • మధిగమించి
యలి మహోదరవిరూ•పాక్ష విద్యుజ్జిహ్వు, లిండ్లు విద్యున్మాలి•గృహము వెదకి
వజ్రదంష్ట్రుని శాల • వలనొప్పఁగా రోసి, శుకసారణులసదల్ సారిచి • నెమకి
తే. యింద్రజిత్తుని వేశ్మంబు • నెల్ల వెదకి, జంబుమాలి సుమాలుల•సదనములను
రశ్మికేతువుసూర్యశా•త్రవుల నెలవు, వజ్రకాయుని గేహంబు • వరుసఁ జూచి. ౨౨౭

అర్థములు. నిక్క = యిల్లు, కంవతుల్యము = మేఘముతో సమానము. కం + వ = నీళ్ళ నిచ్చునది, శాల = గృహము. వేశ్మంబు = గృహము.

తాత్పర్యము.

శీఘ్రముగఁ బ్రహస్తునింటికి దాఁటి, మహాపార్శ్వనింటికి నెగిరి, మేఘముతో సమానమైన కుంభకర్ణు గృహము ప్రవేశించి, విభీషణు నిల్లు చొచ్చి, మహోదర విరూపాక్ష విద్యుజ్జిహ్వ విద్యున్మాలి వజ్రదంష్ట్ర శుకసారణులయు, నింద్రజిత్తు జంబుమాలి సుమాలి రశ్మికేతువు సూర్యశత్రువు వజ్రకాయుఁడు వీరల యిండ్లు వెదకి.

సీ. బలులు ధూమ్రాక్షసం•పాతినామకులు విద్యుద్రూపభీములు • నుగ్రులైన
ఘనుఁడు విఘనుఁడు వి•కటుఁడు వక్రుండును, శఠశుకనాస వ•క్రప్రమదులు

బ్రహ్మకర్ణుండు దంష్ట్రధ్వజగ్రీవయు,ద్ధోన్మత్తమత్తులు • నుకుటు విహీను
రోమశుండును మఱి•బ్రహ్మవిద్యుజ్జిహ్వ,హస్తిముఖేంద్రజి•హ్వాద్రపనులు
తే. శోణితాక్షపిశాచులు • శూరుఁడైన, యా కరాళుండు నివసించు•నాలయముల
వరుస దప్పక యా గంధ•వహసుతుండు, తెగవ ముజ్జవక వెదకె సీ•తావధూటి.

అర్థములు. ఉమటు = గర్వము.

తాత్పర్యము.

బలవంతులైన ధూమ్రాక్షుఁడు, సంపాతి, విద్యుద్రూపుఁడు, భీముఁడు, ఘనుఁడు, విఘనుఁడు, వికటుఁడు, వక్రుఁడు, శఠుఁడు, శుకనాసుఁడు, బ్రహ్మకర్ణుఁడు, దంష్ట్రధ్వజ, గ్రీవ, యుద్ధోన్మత్త మత్తులు, రోమశుఁడు, విద్యుజ్జిహ్వ హస్తిముఖేంద్రజిహ్వులు, శోణితాక్షుఁడు, పిశాచుఁడు, కరాళుఁడు, వీరంద్రు, గృహములన్నింటిని వరుస దప్పక హనుమంతుఁడు వెదకెను.

—• హనుమంతుఁడు రావణగృహంబుఁ జొచ్చుట. •—

ఉ. ఈ విధి వారి వారి వసి•యించు గృహంబుల నెల్ల రోసి యా
పావని పాశతోమరకృ•పాణసుముద్గరశూలహస్తలై
కావలి కాచు స్త్రీల నుప•కంఠమునన్ శయనించువారి ర
క్షోవిభుమందిరంబునను • జూచి తదంతరసీమ దోపలన్. ౨౨౯

అర్థములు. తోమర=చిల్లకోలయను నాయుధము, కృపాణ=కత్తి.

తాత్పర్యము.

ఈ ప్రకారము వారి వారి కాపురములందు వెదకి యాంజనేయుఁడు పాశములను, చిల్లకోలలను, కత్తులను, ముద్గరములను, శూలములను, చేతి యందు ధరియించి కావలియుండు స్త్రీలను సమీపమున శయనించువారిని రావణు గృహమందుఁ జూచి దాని లోపలి ప్రదేశమందు.

క. నానావిధసాధనముల, మానుగ ధరియించు యుద్ధ•మర్మజ్ఞుల ర
క్షోనిచయము రక్తసితా,జానేయంబులను జూచె • జవనాశ్వములన్. ౨౩౦

అర్థములు. రక్తసిత+ఆజానేయములను = ఎఱ్ఱని, తెల్లని యుత్తమజాతి గుఱ్ఱములను, యుద్ధమర్మజ్ఞుల, రక్షోనిచయము='మహాత్మమహార్థక శబ్దం బమహత్కార్య యుక్తంబయ్యె నెద్విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యంబులు విధానమగు' త్రి. శ. ౧౭. జవనాశ్వములన్=వేగసంపత్తి గలవి.

తాత్పర్యము.

అనేకవిధము లయిన యాయుధములు ధరించి యుద్ధ రహస్యము తెలిసిన రాక్షస సమూహములను, అతి వేగముగఁ బోఁగల ఎఱ్ఱని, తెల్లని యుత్తమజాతి గుఱ్ఱములను హనుమంతుఁడు చూచెను.

గృహా=పగలు క్రీడింపఁ గట్టఁబడిన యిండ్లను, మందరప్రఖ్య = మందర పర్వతముతో సమానమైన, మయూర శిలంబులన్=నెంపులను నెమిళ్ళ నివాసస్థలములను.

తాత్పర్యము.

విస్తారముగ బంగారుచే నలంకరింపఁబడి బాలసూర్యునితో సమానములైన సేనల సమూహములను, అనేకరూపములు గల పల్లకీలను, చిత్రముగా వల్లిన తీఁగ లచే నిర్మింపఁబడిన యిండ్లను, చిత్రములైన క్రీడా గృహంబులను క్రీడించుటకై కొయ్యలచే నిర్మింపఁబడిన పర్వతములను, కామము వృద్ధిచేయు నిండ్లను, పగటివేళఁ గ్రీడించు నట్టివైన యిండ్లను, నెంపులను నెమిళ్లుంచుటకై కట్టఁబడిన మందరముతో సమానమైన ప్రదేశములను, ధ్వజదండములను, నిధుల సమూహములను గలిగి ధగ ధగ మని ప్రకాశించుచుఁ గైలాసముతోఁ సమానమైన రావణుని యింటిని రాము దూత చూచెను.

క. సురశాత్రవు తేజముచేఁ, బరమమణినికరదీప్తి • పటలంబులచే
భరితం బయి రావణుమందిరము వెలింగెను గరాళి • దినకరుమాడ్కిన్. ౨౩౪

అర్థములు. సురశాత్రవు = దేవ విరోధియగు రావణుని యొక్క, పరమ మణి నికర = ఉత్తమములైన రత్నసమూహముల యొక్క, దీప్తి పటలంబులచేన్ = కాంతి సమూహములచే. భరితంబయి = నిండి, కరాళిన్ = కిరణములచే. దినకరు మాడ్కిన్ = సూర్యునివలె.

తాత్పర్యము.

కిరణములచే సూర్యుఁడు ప్రకాశించునట్లు దేవవిరోధి తేజముచేతను, జాతి రత్నములకాంతుల సమూహములచేతను, రావణుమందిరము ప్రకాశించెను.

క. ప్రానాదసంఘయుతమై, భాసురమణిభాజనాళి • భరితంబై మ
ధ్వాసవసుపరిక్లిన్నంబై పరమృదంగనాద • మై నరుచిరమై. ౨౩౫

అర్థములు. భాజనాళి = పాత్రల సమూహముచే, భరితంబై = నిండి, మధ్వాసవ = తియ్యని సారాయముచే, పరిక్లిన్నంబై=తడిసినదై, మృదంగనాదమై= మద్దెల ధ్వనులు గలదై, విరిదై = వెడల్పై.

తాత్పర్యము.

మేడలు, యిండ్లు గుంపులు గలదై ప్రకాశించు రత్నములచేఁ జేయఁబడిన పాత్రములతో నిండి తియ్యని సారాయములతోఁ దడిసి యానందకరమైన మద్దెల ధ్వనులు గలదై వెడల్పై.

ఉ. బంగరునిచ్చెలుం దళుకు • బంగరుపాత్రలుఁ జిత్రచోరణ
త్రాంగజఘోటికానిభవ • రాంగనలున్ మణికాంచినూపురా
భంగరవంబులుం గలిగి • బాధమనోరమమై విశాలమై
యుంగను రావణాసురగృ • హంబువరంబును గాంచి దాసిలోన్. ౨౩౬

గగనమున గ్రహచంద్రవిచిత్రము • గని విమానము రత్నచిత్రము
ధరణి పర్వతరాజిపూర్ణము • ధరము వృక్షవితానపూర్ణము
ధరణీరుహము సుమౌఘపూర్ణము • తతిసుమావళి పత్రిపూర్ణము
భాసురసుమగపుష్కరంబులు • పక్షికలయుతనిష్కుటంబులు
కేసరాన్వితపుష్కరంబులు • గృహము లచ్ఛ ద్యుత్కరంబులు
ఆకుపచ్చవిహంగమంబులు • హారిజాత్యతురంగమంబులు
నైకరత్నభుజంగమంబులు • నవ్యరుచి నభసంగమంబులు.　　౨౩౮

ఇచట కుబేరుని జయించి తెచ్చిన పుష్పక విమానము వర్ణింపఁబడుచున్నది.

ఘన = గొప్పదియును, ఘనాఘన = వర్షాకాల మేఘమువలె, కలితరూపము = ఒప్పిన యాకారము గలది, కాంచనాంచిత = బంగారుచేఁ బ్రకాశించు, చారు రూపము = మనోహరమైన రూపము గలది, దనుజ నాథ = రావణుని యొక్క, బల = బలమునను, అనురూపము = తగినది, అప్రతిరూప = ఎదురులేని, రూపము = సౌందర్యముగలది, భూమీగస్వః ప్రకీర్ణము = నైజవశమున భూమి మీఁద జాఱిపడిన స్వర్గము వంటిది, తతివిభా = విస్తార కాంతిగల, రత్నకీర్ణము = రత్నములతోఁ గూడినది, చారుతరకుసుమ = మిగుల మనోహరమయిన పుష్పములచే, అవకీర్ణము = వ్యాపించినది; పాండ్రమనఁగన్ = తెల్లగా యున్నట్లు, రజోవికీర్ణము = పుష్పాదిచే నిండినది. "మాక్షికం తైలవర్ణం స్యాత్, ఘృతవర్ణంతు పౌత్తికమ్, విజ్ఞేయం భ్రామరం శ్వేతం, పాండ్రంతు కపిలం మతమ్" మాక్షికము తేనె తైలవర్ణము గలది. పౌత్తికము తేనె నేతివర్ణము గలది. భ్రామరము తేనె తెలుపువన్నె గలది. పాండ్రము తేనె కపిల వర్ణము గలది. చంచలాంగీ = మెఱుపువంటి దేహముగల స్త్రీలచే, దీప్యమానము = ప్రకాశింపఁ జేయఁబడినది. చంచలాయుత = మెఱుపులతోఁ గూడిన, ఘనసమానము = మేఘముతో సరిపోయినది. అంచిత = ప్రకాశించు, సితఖగ = హంసలచే, ఉహ్యమానము = మోయఁబడుచున్నది. అగు విమానమునను, అనూనము = తక్కువకానిది, అనఁగా ఘనమైనది, నగమునన్ = పర్వతమునవలె, నైకవర్ణపయోదచిత్రము = నానావర్ణములు గల మేఘమువలె చిత్రమైనది, గ్రహచంద్ర చిత్రము = సూర్యచంద్రులచే చిత్రింపఁబడినది, ధరము = పర్వతము, వితాన = సమూహము, సుమౌఘ = పూలరాశి, భాసుర+సుమగ+పుష్కరంబులు = కాంతిగల పుష్పములతోఁ గూడిన జలములు, కల = అవ్యక్త మధుర ధ్వని, నిష్కుటంబులు = ఉద్యానవనములు, కేసరాన్విత పుష్కరంబులు = కేసరములతోఁ గూడిన కమలములు, అచ్ఛ = నిర్మలమైన, ద్యుత్కరంబులు = కాంతిగల కిరణములు గలది, విహంగమంబులు = పక్షులు, హారి = ఇంపైన, జాత్యతురంగమంబులు = ఉత్తమాశ్వములు, నైకరత్న భుజంగమంబులు = అనేక రత్నములతోఁ జేయఁబడిన పాములు, నవ్యరుచి = మనోజ్ఞ కాంతిగల, నభసంగమం

సీ. మూఁడును నాల్గు కొ•మ్ములు గలయేనుఁగు, లెడ తెగకయుఁ గట్టఁ•బడుచునుంట
యుద్ధృతాయుధు లైన•యోధులు గాచుట, యసురనాయకుని భా•ర్యాళిచేత
విక్రమాహృతపృథ్వీ•పతికన్యకా, బృందంబుచేఁ బరి•వృతము నగుట
తిమితిమింగిలనక్ర•తీవ్రఝషాఢ్యమై, దధి నాఁగఁ గల్లోలి•తంబు నగుట

ఆ. శ్రీదు లక్ష్మి యింద్రు•సిరియును సర్వంబు, వాయు నింట నాని•బంధు లిండ్ల
యమకుబేరవరుణ•రమయును నంతకు మిన్న, నెలయు నుంటఁ గనెను • నీరసుండు.

అర్థములు. ఉద్ధృతాయుధులు = ఎత్తఁబడిన యాయుధములు గలవారు; విక్రమ=పరాక్రమముచే, ఆహృత=అపహరింపఁ బడిన, పృథ్వీపతి కన్యకాబృందం బుచే=రాజకన్యల సమూహముచే, పరివృతము = ఆవరింపఁబడినది, తిమింగిల = తిమిని మ్రింగెడి పెద్దచేపచేత, దానిని మ్రింగెడి చేపను తిమితిమింగిల మని యేరు, నక్ర= మొసళ్ళచేత, తీవ్రఝష=నిశిత చేపలచేత, ఆఢ్య=కలఁత చెందిన, ఉదధి నాఁగన్ = సముద్రమో యనునట్లు, కల్లోలితంబు=అల్లకల్లోలమైనది, శ్రీద=కుబేరునికొఱకు, రమ=సంపద, మిన్న=హెచ్చుగ.

తాత్పర్యము.

ఆ యింటియందు మూఁడుకొమ్ములు, నాలుగు కొమ్ములు గల యేనుఁగులు మారిమారముగఁ గట్టఁబడి యుండుటయు, యుద్ధమునకు సిద్ధపడి యెత్తఁబడిన యాయుధములు గల యోధులు గాచుచుండుటయు, రావణుని భార్యలచేత, వాఁడు బలాత్కారముగ నపహరించి తెచ్చిన రాజకన్యలచేత నావరింపఁబడి యుండుటయు, తిమితిమింగిలము మొసళ్ళు నిశితమైన చేపలు వీనిచేఁ గలఁత నొందిన సముద్రము వలె నల్లకల్లోలమై యుండుటయు, కుబేరుని సంపదయు, నింద్రుని యైశ్వర్యము, సర్వ దిక్పాలుర లక్ష్మి వాని యింటను, వాని బంధువుల యిండ్లయందు యమ కుబేర వరుణుల సంపద కొక్కొక్కరి యింట కొక్కొక్క దిక్పతి సంపద వలెనే యంతే కంటె నెక్కువగా నుండుటయు హనుమంతుఁడు చూచెను.

ఉ. ఆ సొబగారు మేడనడు•మందున మం డొకటి విశ్వకర్మ నా
వాసిగ నింటఁ దొల్లి యొలుత • వారిజగర్భునకై రచించె నా
నాసుమణీయుతంబుగ న•నంతర మా ధనదుండు నీరజా
తాపసుఁ గొల్చి చేకొనెను; దాతని గెల్చి రణాంగణంబునన్. ౨౫౦

పుష్పకవిమానము పూర్వచరిత్ర చెప్పఁబడుచున్నది.

తాత్పర్యము.

ఆయుంచమైన మేడ నడుమ నుండు పుష్పకమును దొలుత విశ్వకర్మ బ్రహ్మ దేవునకుఁగాను మంచి రత్నములచే నాకాశమున నిర్మించెను. దాని నాయన యావలఁ దన్ను సేవించిన కుబేరున కిచ్చెను. ఆయనను యుద్ధ భూమి యందు గెల్చి,

నెత్తికెంటను వంటుఁ బుట్టునది (సేంకగాపుఁబూవు) ఛాయగలది. పంది కొమ్మునం దుండునది కేంగుఁ బండంత యుండును, కుంకుమ ఛాయగలది. నెమరుముత్తెములు కోడిగ్రుడ్డంత యుండును. ఇది మంత్రసాధకులకు లభించును. స్వాతియందు ముత్తెపుఁ జిప్పలలోఁ బడిన వానచినుకులు మంచిముత్యము లగును. వర్షబిందువు కొలంది ముత్తెము. ఇందు శృంగశంఖములందుఁ బుట్టినవి సొమ్ముగాను, రావణ శంఖములందుఁ బుట్టినవి బంగారు వన్నె కలవిగా నుండును. తామ్రపర్ణి శుక్తియందలివి తెల్లగా నుండును. పూర్వకాలమున నానాదేశములవారు పాశ్చాత్యులు వీని వ్యాపారమునకై యీ దేశమునకు వచ్చుచుండిరి. వీనిలో ఆనే, సుతారము, సుహాని యనునవి మంచి జాతులు.

తాత్పర్యము.

ఆ వాసనజాత కట్టి పోయి యుండు నుక్కిలి యింపై పొడవై సుందరమగుఁ బ్రియమై రావణాసురునికి దన ప్రియభార్యవలె మనోహరమై రత్నసోపానములు బంగారు కిటికీలు దంతపు బొమ్మలు పగడములయు ముత్యములయు బంగారు నెండు లయు పటుత్వముచేఁ దీర్చిన స్తంభములు గలదై సమమై వంకర లేనిదై నెత్తైన కంబములచే నాకాశమున కెగిరిపోవుచున్న దానివలె నొప్పి భూమి యందుగల క్షితములన్ని వ్రాయఁబడిన కంబళ్ళు గలిగి నెపలునై.

ఉ. ఘుమ్మని కమ్మవాసనలు • క్రమ్మ నితాంతశకుంతనాద మ
భ్రమ్మును ముట్టఁగా మృదువు•పాన్పులు వన్నెలు మీఱ శుభ్రమై
నెమ్మది రావణాసురుఁడు • నిచ్చ చరించెడి ధామ మారు ధూ
పమ్ముల ధూమ్రమై శబల•భంగి విచిత్రసువర్ణజాతమై. ౨౭

అర్థములు. నితాంతశకుంతనాదము = అతిశయించిన పక్షులధ్వని, అభ్రము= ఆకాశము, ధూమ్రము = నలుపు ఎఱ్ఱవన్నెఁ గలసిన రంగు, శబలభంగిన్ = కామధేనువువలె, దీనివలననిది చిత్రవర్ణముగలదనుటగాక సర్వకామముల నిచ్చునది యని సూచితము. విచిత్ర సువర్ణజాతము=చిత్రమైన మంచి రంగులు గలది.

తాత్పర్యము.

ఘుమ్మని కమ్మని వాసనలు వ్యాపింపఁగాఁ బక్షులధ్వనులు విశేషించి యాకాశమును దగులు చుండఁగా మెత్తని పాన్పులు తెల్లనై కాంతి లీను చుండఁగా రావణాసురుఁడు సంతోషముతోఁ దిరిగెడి యిల్లై సాంబ్రాణి యగరు దశాంగము వీని పొగలచే ధూమ్రవర్ణము గలదై శబలవలెఁ జిత్రమై మంచి రంగులు గలదై.

క. మదికిని నతిసంహ్లాద, ప్రదమై రంగులకు మేలి•రం గొసఁగుచు శో
కదళనసమర్థమై సమ్మదమై కాంతులకు జనన • మందిర మగుచున్. ౨౮

అర్థములు. అతి సంహ్లాదప్రదము = మిగుల సంతోషము గలిగించునది, శోకదళన సమర్థము=శోకమును బాపుటయందు శక్తి గలదై.

క. వీరల మోములు నిజముగ, వారిజములు గాక యున్న • షట్పదగణంబుల్
నీరజములవలె నేలా, నారయ నీ వదనములను సంప్రార్థించున్. ౨౬౪

తా త్ప ర్య ము.

వీరలముఖములు నిజముగ, కమలములే. అటుగాకయున్నఁ దుమ్మెదలు కమలములనువలె నేల వీని చుట్టు తిరుగుచున్నవి.

క. అందము చందము మఱి చ,ల్లందనమును బరిమళంబు • నలితోష్కృతులన్
సుందరము లగుటఁ బంకజ,బృందములో ముఖము లనుచు • నెంచెను గపియున్.

తా త్ప ర్య ము.

అందముయొక్క విధము చల్లఁదనము సువాసన మనోజ్ఞమైన యాకారము నవియన్నియు సుందరములేయైన కారణముచే వారి ముఖములు నిజముగఁ బద్మములే యని తలఁచెను. 'హో' యనునది నిశ్చయార్థమును దెలుపును.

'కమల ముకుళమృద్వీ ఫుల్లరాజీవగంధ
స్సురత పయసి యస్యా స్సౌరభం దివ్య మంగే
చకిత మృగ దృగాభే ప్రాంతరక్తే చ నేత్రే
స్తనయుగళ మనర్ఘ్యం శ్రీఫలశ్రీవిడంబి ॥
తిల కుసుమ సమానం బిభ్రతీ నాసికాగ్రం
ద్విజ గురు సురపూజా శ్రద్దధానా సదైవ
కువలయ దళకాంతిః కాపి చాంపేయగౌరీ
వికచ కమలకోశాకార కామాతపత్రా
వ్రజతి మృదుసలీలం రాజహంసీవ తన్వీ
త్రివళి లలితమధ్యా హంసవాణీ సువేషా
మృదుశుచిలఘు భుంక్తే మానినీ గాఢలజ్జా,
ధవళ కుసుమవాసో వల్లభా పద్మినీస్యాత్.

అని పద్మినీ జాతి స్త్రీ లక్షణము.

పద్మినీ జాతి స్త్రీలు రాత్రి మూఁడు యామములందు భర్తలతోఁ గలియుదురు. ఈ కాలమందు వీరు నిద్రించుచున్నారని చెప్పుటచేతను వీరు పద్మినులనియే చెప్పవలెను. 'రమయతి రమణీయాం పద్మినీ పూర్వయామే' యని లక్షణము.

క. తారాగణరాజిత మగుశారదతారాపథంబు • చందంబున దే
వారివరమందిరము కాం,తారత్నగణంబుచేతఁ • దద్దయు నొప్పెన్. ౨౬౭

అర్థములు. తారాగణరాజితము = నక్షత్రసమూహముచేఁ బ్రకాశించునది, శారద తారాపథంబు = శరత్కాలమందలి యాకాశము.

తా త్ప ర్య ము.

నక్షత్ర సముహముచే శరత్కాలమందలి యాకాశము ప్రకాశించునట్లు స్త్రీ

రత్నములచే రావణాసురుని యిల్లు ప్రకాశించెను. రావణాసురుడు చంద్రుడనియు స్త్రీలు నక్షత్రము లనియు గ్రహింప నగు.

శా. ఆ రాజీవవిలోచనాపరివృతుం • డై రాక్షసాధీశుఁడున్
తారాసంవృతకైరవాప్తుఁ డన న•త్యంతంబు శోభిల్లె తా
లారత్నంబులఁ బుణ్యవిచ్యుతిని నే•లన్ వ్రాలు తారాళిగా
ధీరాగ్రేసరుఁ డా మరుత్తనయుఁ డెం•తే కాంచెఁ జిత్తంబునన్. ౪౩

అర్థములు. రాజీవ విలోచనా = కమలములవంటి కన్నులుగల స్త్రీలచే, పరివృతుండై = చుట్టఁబడినవాఁడై, తారాసంవృత = నక్షత్రములచే జుట్టఁబడిన, కైరవాప్తుఁడనన్ = చంద్రుఁడో యన్నట్లు, పుణ్యవిచ్యుతిని = పుణ్యము క్షీణించిన కారణమున, ధీరాగ్రేసరుఁడు = ధైర్యము గలవారిలో మొదటివాఁడు.

తాత్పర్యము.

కమలములవంటి ముఖములుగల యా స్త్రీలచేఁ జుట్టఁబడిన రావణుఁడు నక్షత్రములచేఁ జుట్టఁబడిన చంద్రుఁడో యనునట్లుండెనుగాని పుణ్యము క్షీణించి పోఁగా నేల రాలిన నక్షత్రముల వలె నా స్త్రీలు ధైర్యవంతులలో శ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు తలఁచెను. వీరు శీఘ్రకాలములోనే విధవలు కాబోవుచున్నారు కావున హనుమంతుఁడట్లు తలఁచెను.

ఉత్తమ వర్ణములను బలవంతముగ హరింపఁబడిన స్త్రీలు రావణునింట నున్నట్లు చెప్పఁబడెను. ఇది వారి స్థితి తెలుపుచున్నది. ఉత్తమజాతి క్షత్రియస్త్రీలు రాక్షసులతో సంభోగింపవలసి వచ్చుట వారి పుణ్యక్షయముచేతనే కదా. కనుకనే ఉత్తమజాతిస్త్రీ లధమజాతి పురుషులతోఁ గలియరాదని సూచితము. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' యనికదా భగవంతుఁడు చెప్పెను.

క. తళుకు తళుక్కను మెఱుఁగా,రలవన్నె ప్రసాదగరిమ • ప్రభయును ఘనమై
చెలువారుచుండె రావణునిలయంబునఁ గూర్కుచున్న • నెలఁతుకలందున్.

తాత్పర్యము.

తళుకు తళుక్కను నక్షత్రముల గొప్ప రూపము వారి నైర్మల్యము వారి కాంతి ఘనమై రావణునింట నిద్రించుచున్న స్త్రీల యందుఁ గానవచ్చెను.

క. పానవ్యాయామంబుల, విగానాంగని యుద్ధమునను • సోయి స్రగ్భూషల్
పీనుగోని చాలిపడినను, మే నెఱుఁగక కూర్కు వంతు • పొలఁతులఁ గంటిన్. ౪౫

అర్థములు. పానవ్యాయామంబులన్ = మద్యపానానంతరము జరుగు కామ్యము లందు, విగానాంగని యుద్ధమునను = రతియందు, స్రక్ + భూషల్ = హారములు సొమ్ములు.

తాత్పర్యము.

పానానంతరము జరిగిన రతికేళులందు వారు చేసికొన్న హారములు

తా త్ప ర్య ము.

గొప్పవగు స్తనములందును, చనుమొనలందును, సుకుమారములై మిగుల మనోహరములైన యవయవములందును ధరింపఁబడిన యందములైన రత్నాభరణముల సమూహములు ఆ స్త్రీలు నిద్రపోవునపుడు వారిని జూచిన మగవారు మదన వికారముచేఁ బరవశులై వారిమీఁదఁ బడునంతటి సొంపుగలవై యుండెను.

ఈకారణముచేతనే స్త్రీలు నిద్రించునపుడు పురుషులు చూడరాదను నియమ మేర్పడెను. స్త్రీలును వెల్లకిలఁ బరుండరాదు.

క. అస్వాప నిమరించెను వక్త్రోయ్యాలలముఖములనుండి ♦ తూలఁ కెడి యూర్పుల్
పస్యోవ చెంగులచేఁ దా, మొయ్యన పీచోపు లిడెను ♦ యోషాస్యములన్. ౨౬౭

అర్థములు. యోష్యాల = స్త్రీలయొక్క, ఒయ్యన = మెల్లగా, పీచోపులు = వింజామరలు, యోషాస్యములన్ = స్త్రీల ముఖములందు.

తా త్ప ర్య ము.

ఆ సమయమున నిద్రించు స్త్రీల ముఖముల నుండి వెలువడు నూర్పు గాలులచేఁ గదలుచున్న పైఁటకొంగులు ఆ స్త్రీల ముఖములపై వింజామరలు వేయుచున్నట్టు లుండెను.

వీరి కెవ్వరికి రైకలు లేవనుట స్పష్టము.

క. నానావర్ణ సువర్ణ స, తీవక్త్రముఖాబ్జములను ♦ దీవ్యచ్ఛుభశై
కానివహము మదనపతా, కానికరము నట్లు వెలిఁగె ♦ గమనీయంబై. ౨౬౮

అర్థములు. నానావర్ణ సువర్ణ = పలు రంగులగు మంచి కాంతులు గల, సతీ = స్త్రీలయొక్క, వక్త్రముఖాబ్జములను = అందమైన ముఖకమలములను, దీవ్యత్ = ప్రకాశించు, శుభశైకానివహము = అందమైన పైఁటల సమూహములు, మదన పతాకానికరము నట్లు = మన్మథుని ధ్వజముల గుంపువలె.

తా త్ప ర్య ము.

పలు రంగులగు మంచి కాంతులు గల స్త్రీల యందమైన ముఖకమలములందుఁ బ్రకాశించుచున్న పైఁటలు మదనుని ధ్వజములవలె నందములై యుండెను.

పై పద్యమునందలి యీ పద్యమునందలి వర్ణనమును బట్టి యీ స్త్రీలు ముఖములపై పైఁటలు కప్పుకొని నిద్రించు చుండిరని యేర్పడుచున్నది. అటు గానిచో యోష్యల మీఁది పైఁట లూర్పుగాలికిఁ గదలుటగాని ముఖములకు పీచోపు లిడుటగాని ఘటస్థింపదు.

క. ఇందుముఖీ ముఖనిర్గత, మంద సుగంధవహా సర్గ ♦ మండిత ముగుదున్
మందంబుగఁ గదలెను సుమ,బింబమణీరుచిరము లగు♦ వెలఁగల కమ్మల్. ౨౬౯

అర్థములు. ఇందుముఖీ = చంద్రునివంటి ముఖముగల యా స్త్రీలయొక్క, ముఖ = ముఖములనుండి, నిర్గత = బయలు వెడలిన, మంద = మెల్లనైన, సుగంధవహా =

మంచిగాలియొక్క, సర్గ = కూడికచే, మండితము = అలంకరింపఁబడినది, మంద
ముగ=కొంచెముగ, కురువిందమణీరుచిరములు=కెంపులచే సుందరములు.

తాత్పర్యము.

ఆస్త్రీల ముఖమునుండి వెడలుచున్న కమ్మని వాయువుచే నలంకరింపఁబడినవై
వెలగల కెంపులు కమ్మలు కొంచెముగఁ గదలెను.

కురువిందము పద్మరాగములందు భేదము.

సీ. ఉదయార్కబింబ సముజ్జ్వల ప్రభగల్గి, కరమొప్పు పద్మరాగంబు పేరలు
అసమాన దాడిమీ కుసుమ మంజరిచాయ, గలిగి శోభిల్లు సౌగంధికంబు
సలలిత మత్తకోకిల లోచనద్యుతి, నలరారుఁ గురువింద మనెడి కెంపు
మండిత శశమాంస ఖండంబు గతి నున్న, మందతేజంబగు మాంసగంధి
గీ. నలుపు నెఱ్ఱదనము మిళితమై నెగడెను, వాలు గలిగినదియు నీలగంధి
లాలు లేక కోమలం బను సంజ్ఞలు, గ్రాలు కెంపు చాల రంగు లేక.
క. ధరఁ బద్మరాగ మొందును, నొరకదు కలియుగమునందుఁ • దోచిన క్రేఁకై
నిరుపమ రుచి నిర్మలముగుఁ, గురువిందపుఁ గెంపు గలదు • గోరి ధరింపన్.

(రత్నపరీక్ష.)

క. చక్కెరకల్లలపులు సెలఁ గ్రక్కఁగ నచ్చిగురుఁబోండ్ల • కమ్మనియూర్పుల్
మిక్కిలి రావణుమీఁదను, జక్కఁగ విహరించెఁ గైపు•సంపద లోలయన్. ౨౮౦

అర్థములు. చక్కెరకల్లలపులు = చక్కెరతోఁ జేసిన కల్లువాసనలు, చక్కెర
యొక్కయు, కల్లుయొక్కయు సువాసనలు, చిగురుబోండ్ల = స్త్రీలయొక్క, కైపు
సంపద = మదాతిశయము.

తాత్పర్యము.

చక్కెర కల్లువాసనలు గొట్టుచున్న యాస్త్రీల కమ్మని శ్వాసములు మదాతి
శయముచే రావణునిమీఁద వ్యాపించెను. దీనివలన హనుమంతుఁడు రావణు సమీ
పించు చున్నాఁడని సూచన.

సీ. రావణాననము లన్ • భ్రాంతిని సవతుల, ముఖముల ముద్దిడు • ముద్దరాండ్ర
నధిపుఁడే ముద్దిడె • న భ్రమ మత్తున, సవతాండ్రఁ జుంబించు • ధవసురతలఁ
బసుకలు పైఁబడు • కడిఁదూలచేతులు, దిండ్లుగా నిమురించు • తీఁగఁబోండ్లఁ
దమయురంబుల నుంచి•తలలు ఖ్రిసించుచె,ల్వాల తొమ్మలను జేయి•నైచు సతుల
తే. నొలవు మొఱయంగ నొక్కర్తు • కుచువుమీఁద
శిరము ఘటియించి కూర్కెడి • చెలువతొమ్మ
నందుఁ గేల్సాఁచి నిమురించు • బిందుముఖుల
నంటఁ గనుఁగొనె సంకనా•నవనునం. ౨౮౧

కారణముగా, స్కంధసంతతులన్ = చెట్లబోదెల, సుమ+ఓఘములన్ = పూల సమూహములను, మిళింద = తుమ్మెదల, సద్వనీవిలసనమున్ = మంచి యుద్యానవను యొక్క చక్కఁదనమును, సురవైరి విరోధి = రావణునియొక్క, వధూవనము = స్త్రీ వనము.

### తాత్పర్యము.

రావణుని స్త్రీలను వనము మనోహరమైన మెల్లని గాలిచే నొకదానితో నొకటి పెనవేసికొనిన తీఁగలతోఁ గలసిన బోదెలను పూలసమూహములను దుమ్మెద గుంపులను గల చైత్రమాసమున వికాసముతోఁ గూడిన వనమువలె నుండెను.

ఇచ్చట మన్మథోద్దేశము మందమారుతము తీఁగెలు, చేతులు, స్కంధములు బొమ్మలు నడుములు గల దేహభాగములు సుమములు వారు ధరించిన పూవులు, తుమ్మెదలు తలవెంట్రుకలుగా నుపమానోపమేయంబులు గ్రహించునది.

ఆ. మెలఁత లచట నత్తి•మిల్లిన లీలలు, చూడ నవయవములు•సొలుగు మీఱు
వస్త్రమాల్యములును • వారి వారి వ టంచు, వేఱువేఱుపరాక • మెరసి యుండె.

అర్థములు. అత్తమిల్లిన=పరుండిన, లీలలు=విధములు, మెరసి=కలసి.

### తాత్పర్యము.

స్త్రీలచ్చటఁ బండుకొనిన విధము చూడఁగా వారి చేతులు వస్త్రములు మాల్యమ్ములు ఇది దీనిది అవి దానివి యని వేఱు వేఱుగఁ జెప్పరానట్లు కలిసి యుండెను.

క. ఆ మందిరమణిదీపము, లామునితలరూపు చెప్ప•లొప్పెఁ జగతీ
స్తోమభయదుండు నూర్కొనఁ, గామము చెనఁ జూచు మాడ్కి•గ్రాలెనవలతన్.

అర్థములు. ఆ మందిర = ఆయింటియందలి, జగతీస్తోమభయదుండు = లోకములకన్నిటికి భయము కలిగించువాఁడు, కామముచెనన్ = కోరికదీరునట్లు, ఉత్ప్రేక్షాలంకారము.

### తాత్పర్యము.

ఆయింట మణిదీపములు చలింపక యేకాగ్రముగ వెలుఁగుచుండు విధము చూడ లోకభయంకరుఁడైన రావణుఁడు నిద్రించుచున్న కారణముచే భయముతీఱి కోరికదీర నవి వాని స్త్రీలను జూచుచున్నవా యేమి యన్నట్లుండెను.

ఇట్లు చెప్పుటచే రావణుఁడు మేలుకొనియున్నప్పు డా స్త్రీలను దీపములుకూడ నిర్భయముగాఁ జూడఁజాలవని భావము.

ఉ. కామునిబారి కోహటిలి • కైవసమైన నృపర్షి దైత్యక
న్యామణులున్ సుధాంగనలు • నాహవకాంక్షను దెచ్చినట్టి కాం
తామణులున్ స్వరాగహ•తప్రమదల్ సురవైరి చుట్టు ని
ద్రామదపారవశ్యమున • రంజిలు చుండిరి తల్పలంబునన్. ౨౮౩

అర్థములు. ఈ స్త్రీ లందఱు రాజస్త్రీలు, రావణాసురుఁడు యథావిధి వివాహ మాడినవారా యనినఁ గాదని చెప్పుచున్నాఁడు. కాముని బారికి = మన్మథుని వాఁడికి, భీతాత్మ = భయపడి, కైవసము = స్వాధీనము, నృప=రాజులయొక్కయు, ఋషి = ఋషులయొక్కయు, నృపర్షి = రాజర్షులయొక్కయు, దైత్య = దైత్యుల యొక్కయు, కన్యామణులన్ = కన్యకలు, సురాంగనలు = దేవతాస్త్రీలు, ఆహవకాంక్షను=యుద్ధమందలి కోరికచే, అనఁగా కొందఱు యుద్ధమునకు రాక ముఖము తప్పించుటచే వారిని యుద్ధమున కిచ్చుటకై వారి స్త్రీల నపహరించి తెచ్చెనని భావము. స్మరాశుగహత ప్రమదల్ = మన్మథ బాణములచేఁ గొట్టఁబడిన స్త్రీలు, నిద్రామదపారవశ్యమున = నిద్రమబ్బుచే దేహములు తెలియని వారై.

తాత్పర్యము.

ఆప్రదేశమందు మన్మథతాపము సహింపలేక స్వాధీన పడిన రాజుల ఋషుల దైత్యుల కన్యకలును దేవతాస్త్రీలును యుద్ధమునందలి కోరికచేఁ దెచ్చిన స్త్రీలును కామముగలస్త్రీలును నిద్రమబ్బుచే దేహము తెలియక రావణాసురుని చుట్టుపడియుండిరి.

ఇట్లు చెప్పుటచే నీ గుంపులోఁ గొందఱు స్త్రీలు తమంతటఁ దామే రావణు వరించి వచ్చిరి. కొందఱు బలాత్కారముగఁ దేఁబడి మరల వారు తమ బంధువుల గలిసికొను ప్రాప్తిలేమిచే వ్రతము చెడినను సుఖము దక్కవలెఁ గులము చెడినను సాగు పుట్టవలె నన్న సామెత చొప్పున వస్తులఁ జూపలేక వానిబాధపడలేక కామము వ్యర్థము చేయనొల్లక వానికి వశపడిరని యేర్పడుచున్నది. కాని మండోదరివలె ధర్మపద్ధతిని వివాహ మాడినవారు కారని భావము.

చ. ప్రమదలలో సురారి ప్రసభంబున దెచ్చిన దన్యకామ ము
న్నమగనిఁ బొందినట్టి చెలి • యెక్కడ లే దొకసీత దక్కఁగా
సమరవిశేషఁ గాంచి తమ • యంతన తాము తదీయ శౌర్యమున్
రమణము గుణంబు మెచ్చి తమి • రాములు వచ్చిరి వానిఁ గూడఁగన్. ౭౧

అర్థములు. ప్రమదలలో = స్త్రీలలో, ప్రసభంబునన్ = బలాత్కారముగ, అన్యకామ=ఇతరపురుషులందుఁ గామముగలది.

తాత్పర్యము.

ఆ స్త్రీలలో బలాత్కారముగఁ దేఁబడినది, ఇతర పురుషునందు మోహము గలది, పూర్వము మగనితోఁ గలిసినది సీతదక్క వేఱొక్కతెయు లేదు. అచ్చట నున్నవా రందఱు రావణుఁజూచి వాని శౌర్యము సంపద గుణము మెచ్చి వానిని గూడ వారంతటవారే వచ్చిరి.

ఇట్లు చెప్పుటచే నా గుంపులో సీతవంటివారు లేరని యర్థమైకాని రావణుఁ డెవ్వ తెను బలాత్కరించి తేలేదని యర్థముగాదు. ఎట్లన:—

౧. రావణాసురుఁడు పరస్త్రీలను గాముకుఁడై బాధించె ననుటకు వేదవతీ చరిత్రము ప్రమాణము.

౨. దశరథుని యజ్ఞకాలమున దేవతల శరణాగతియందు రావణుఁడు దేవతాస్త్రీల హింసించెనని చెప్పుట ప్రమాణము.

౩. రావణుఁడు రంభాది స్త్రీలను చెఱచుట నలకూబర బ్రహ్మలచే శాపగ్రస్తుఁడగుట ప్రమాణము.

౪. మండోదరీ విలాపంబున

'దేవాసుర నృకన్యానా మాహర్తారం తతస్తతః.

దేవతల, అసురుల, మనుష్యుల కన్యల హరించినవాఁడని యుండుట ప్రమాణము.

౫. అన్నను విడిచి వచ్చితివని యింద్రజిత్తు విభీషణు నాక్షేపించినప్పుడు:—

పరధనములఁ బరదారల హరియించుట,
పరవిత్తమపహరించుట - పరదారలఁ గోరుచుంట.

యివి రావణు దోషములని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

హింసా పరస్వహరణే పరదారాభిమర్శనం
పరస్వానాంచ హరణం పరదారాభిమర్శనం
* ఏతే దోషా మమభ్రాతు ర్జీవితైశ్వర్యనాశనాః.

యుద్ధ. ౮౭ సర్గము.

౬. ఉత్తరకాండమున ౪౩ మొదలు పద్యములఁ జూచునది.

చ. దనుజుఁడు రావణుండు బల•సంపద పొంపిరివోవుచుండఁ గ్రొ
వ్వునఁ దనమార్గమందు నృప•పుష్కరనేత్రల మాని కన్యలన్
దనుజకులాంగనామణుల • దైవతకాంతల వీరు వారలం
చన కగపడ్డ సుందరుల • యావతియుం గులకన్యకాతతిన్. ౪౩

చ. బలిమిని బట్టి యుద్ధమున • బంధువులం బడఁగొట్టి కేలుఁ గ్రొ
ప్పులు విడఁబట్టి యుచ్చలిబు • బ్రయ్యఁగఁ దిట్టఁగ మొత్తుకోఁగ ని
ర్దిలఁబడ నిచ్చకొం చరిగె • నొక్కఁడ నొక్కఁడ పుష్పకంబునన్. ౪౪

క. ఈ రీతిఁ బన్నగకన్యల, మానవభామలను నసుర•మానినులన్ ర
క్షోనారుల యక్షసతుల, దానవ యోషల విమాన•తలమునం జేర్చెన్. ౪౫

౭. అరణ్యకాండమున ౩౨వ సర్గమందు.

"పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్యచ వాసుకిం । తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః" యని చెప్పఁబడెను.

౮. రావణుఁడు సీతాదేవితో,

'పరదారాగమనకేళియుఁ బరదారాపహరణంబు వర్ణింపఁ దగునే పరమునకు గల ధర్మమయి' యని చెప్పెను. (సుందర ౯౧౯ వ స.)

అచ్చటచ్చట నాఁచికొనుచుఁ దెచ్చిన నాయిల్లు లెఱుఁవలలో వ్యగ్రమహిషివి గమ్ము. (సుందర. ౯౨౭)

'బహ్వీనా ముత్తమ స్త్రీణా మాహృతానా మితస్తతః సర్వాసా మేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ. (సుందర. ౨౦ వ స. ౧౬ శ్లో.)

౯. రావణుని శూర్పణఖ చూచినపుడు వాని గుణవర్ణనమందు 'పరదారాభిమర్శన'మ్మని చెప్పఁబడెను.

౧౦. పంక్తికంఠుఁడు బలిమిని బట్టినట్టి నాగకన్యలలోన జానకియు లేదు. (సుందర. ౩౯౭ వ. ప.)

ఇత్యాద్యనేక ప్రమాణములచే రావణుఁడు పరస్త్రీల నంటని సదాచార సంపన్నుండని తలఁపరాదు. కావున నిచ్చటి మాటలకేమి యర్థమనిన నాపనుకటింటిలో వాని కొల్లని స్త్రీలు లేరనియేకాని యట్టివారు వేఱు స్థలమునందు లేరని యర్థము కాదు. ఈ స్త్రీలలోనే వానియందుఁ బ్రేమ లేనివారు లేకపోలేదు. చూ. సుం. ౯౭౬.

రావణుఁడు సీతాదేవిని బెదరించినపు డాతని ముఖంపఁగా నీ స్త్రీలలోఁ గొందఱు సీతాదేవికి ధైర్యము వచ్చునట్లు కన్నులచే ముఖములచేఁ బెదవులచేఁ దల యూఁచుటచే లోఁబడవలదని సైఁగలు చేసిరి. వానియందు నిజమైన కామము గలవారెట్లు చేయుదురు? వేఱు రక్షకులు లేక గతి లేక వీనికిఁ జిక్కిరి, అనుభవించెదమని వారు వాని కనుకూలలుగా నుండిరి కాని వాస్తవపు మక్కువచేఁ గాదు. అట్లు లోఁబడనివారిని వాఁడనేక హింసలఁ బెట్టెను.

ఉ. లేదు కురూప యందు నకులీనయు లే దుపచారసత్క్రియా
నోదితచిత్త గాని యొక ముగ్ధ యదక్షిణ లేదు చూడఁగా
లేదు విహీనసత్త్వయును లీలల భర్త కకామనీయయున్
లే దల రావణాసురుని లేమలయం దొకభార్య యేనియున్. ౨౭౭

అర్థములు. అకులీన = మంచి వంశమందుఁ బుట్టనిది, ఉపచారసత్క్రియానోదితచిత్త=ఉపచారముచే సంతోషింపని మనస్సుగలది, అదక్షిణ = సామర్థ్యము లేనిది, విహీనసత్త్వ=బలములేనిది, అకామనీయ=కామింపరానిది.

తాత్పర్యము.

ఆ రావణు భార్యలందు నొకతెయైన కురూపగాని యుత్తమ వంశమందుఁ బుట్టనిదికాని యుపచారములచే సంతోషింపని ముగ్ధగాని భర్తను వశపఱుచుకోలేని మధ్యగాని బలము లేనిది ప్రౌఢగానిది గాని శృంగారచేష్టలచే భర్తకుఁ గామింపదగనిది గాని లేదు.

లీల=అధిపుని యొలపు ననుకృతి లీల యనఁబడును. ఇచ్చట లీల లను నది శృంగారచేష్టల కన్నిఁటికి నుపలక్షణము. అవి యెవన:—

కం॥ ఇల భావ హావ హేలా, విలాస మాధుర్య ధైర్య • విభ్రమములు లా,
కిలికించిత మోట్టాయిత, లలితాదులు చేష్టలగుఁ దలంపఁగ మఱియున్.

సీ. వెలయు విబ్బోక విచ్ఛిత్తి విహృతి చకిత, హసిత కుట్టమిత కుతూహలాదులవఁగఁ
గలవు మఱియును భావంబు వెలయుచుండు మహిరసజ్ఞాన యోగ్యతాపాత్రమనుచు.

నర. భూ.

క. ఈ రావణు భార్యలవలె, శ్రీరాముని ధర్మపత్ని • చేరినచో దే
వారాతి సుకృతి యనెడు విచారం బుదయించె హరికి • సద్బుద్ధి కటన్. అర్థ

తాత్పర్యము.

(౧) ఈ రావణుని వాని భార్యలవలె శ్రీరాముని నాయన ధర్మపత్ని సీతాదేవి చేరినచో రావణుఁడు తప్పించుటచేఁ గలిగికొనెనేని, ఈ దేవారాతి = రావణుఁడు, సుకృతి = మంచికార్యము చేసినవాఁడగును, హనుమంతుఁడు సద్బుద్ధి = మంచి బుద్ధిగలవాఁడగుటచే నిట్టి యాలోచన దోఁచెను. రావణుఁడు సీతను రామున కిచ్చి యామెను సుఖ పఱిచెనేని తాను బుణ్యవంతుఁ డగునని హనుమకు దోఁచెనని భావము.

(౨) చేరినచో = రామచంద్రుని వివాహము కాకముందే వీని యొద్ద కే యుండినచో ననఁగా వివాహమాడి యుండినచో నని యర్థము. అనఁగా సీతాదేవి యీ స్త్రీలవలె శ్రీరామచంద్రుని దాను వరింపకముందే యీ రావణుని వరించి యుండెనేని వీఁడు పుణ్యాత్ముఁడై యుండునుగదా యని సుబుద్ధియైన హనుమకుఁ దోఁచెను. ఇచ్చట సుబుద్ధి యను ప్రయోగముచే నిది కపిత్వమువలనఁ గలిగిన చపలతయే గాని స్వభావ సిద్ధము గాదని భావము. ఇట్టి దుర్బుద్ధి పుట్టినందులకు హనుమ పశ్చాత్తాప పడుచున్నాఁడు.

వ్యసనపడి ఇత్యాదిగాఁ బై పద్యమున కవతారిక, అవనిజ, అపద్భశగుణ విశిష్ట= నాటిజేని పాతివ్రత్యముచే నందఱ మించినది (అని తలఁచి) అతఁడు వ్యసనపడి = ముందు కలిగిన దురాలోచనకుఁ బశ్చాత్తాప పడి, మఱియున్ అయ్యో! అసమాత్మ్యుఁడు = విషమబుద్ధిగల రావణాసురుఁడు, ఆమె యెడ, అసత్కార్యంబున్ =దుష్కార్యమును చేసెఁ గదా యని చింతించెనని పై పద్యమునకు నన్వయము.

(౩) రావణు భార్యలు ఇతరులచే నపహరింపఁబడక సనాథ భర్తతోఁ గూడి యెట్లు సుఖపడుచున్నారో యట్లే సీతయు సనాథ భర్తతోఁ గూడి సుఖించుచుండినచో రావణుఁడు నైశ్వర్యము చెడకుండును గదా యని, సుబుద్ధికిన్ = శత్రువులను మేలుకోరు హనుమంతునకుఁ దోఁచెను. మఱియు నాలోచించుచున్నాఁడని పై పద్యమున కవతారిక. అవనిజ యనవ్యాకో గుణవిశిష్టగదా, అయ్యో, మహాత్ముల

జాతుఁడయ్యును విమలబుద్ధిగల రావణుఁడు ఆమెయెడ నకార్యమ్ము నొనరించెఁ గదా యని వ్యసనపడి చింతించుచు నని యన్వయము.

సీత దృఢమనస్కురాలు గావున నామె పాతివ్రత్యమున కే లోపము గలుగదు కాని యామెకు లేనిపోని యపవాదము మాత్రము వీఁడు కలిగించెఁగదా యని వ్యసనపడుచు నాలోచించె నని భావము.

(౪) రావణు భార్యలవలె సీత రావణుచే నపహరింపఁబడక సదా భర్తతోఁ గూడి యుండినచో రావణుఁడు సుకృతియై యుండు నని హనుమ మొదట నాలోచించెను. నిరతిశయ సౌందర్యవంతురాలైన సీతను రాక్షసస్త్రీ సామ్య మెంచి నందున దా నామెకు హీనోపమాన మిచ్చినట్లనుకొని హనుమ దుఃఖించుచున్నాఁడు. అని పై పద్యమున కవతారిక. అవనిజ అసదృశ గుణ విశిష్టగదా యని యాతఁడు పశ్చాత్తాపముచే వ్యసనపడి మఱియుఁ జింతించు చున్నాఁడు.

అయోధ్యా యిత్యాదిగా, అయోధ్యా సీతాపహరణముచే నీతని రాజ్యమంతయు నశించునుగదా యని యన్వయము.

ఇది గోవిందరాజీయము ననుసరించి వ్రాయఁబడెను.

హనుమంతుఁడు సద్బుద్ధి యయ్యు నాయన కొక దుర్బుద్ధి పుట్టెను.

ఈ రావణుని భార్యలవలె, రావణుని యీ భార్యవలె, శ్రీరాముని ధర్మపత్నియుఁ జేరి యుండినచో నీ దేవారాతి పుణ్యాత్ముఁడై యుండును గదా యను నాలోచన గలిగి.

క. వ్యసనపడి మఱియు నాతం, డసదృశసద్గుణవిశిష్ట • యవనిజ యయోధ్యా
ధిపమాన్యుఁ డామె నెడ రా,క్షసరా జొనరించెఁగా యకార్యంబున్. ౨౯౦

తాత్పర్యము.

అట్టి యాలోచన గలిగిన దానికై అసమానమైన పాతివ్రత్యమున గొప్పదియు అవనిజ-అయోనిజ- భూమియందుఁ బుట్టినది, అప్రకారము చేయునాయని యాలోచనము నాకేల గలిగె నని వ్యసనపడి యట్టి పతివ్రతయందు వీఁడు తననాశనముకొఱకు విమలబుద్ధి గలవాఁడై చేయరాని పని చేసెఁగదా యనుకొనెను.

—• ౧౦ వ సర్గము. హనుమంతుఁడు నిద్రించు రావణుని జూచుట. •—

క. అని చింతించుచుఁ జూచు ను, జనుచుం బలుఁగులను రత్న • సమితుల గొనలై
కనకవిమూరజదాంతా,సనములఁ జిత్రాంగములను • సవు రగుదానిన్. ౨౯౧

అర్థములు. పలుఁగులను = స్ఫటికములను, కనకవిమూరజదాంతాసనములన్ = బంగారు వైడూర్యములు ఏనుఁగు దంతములతోఁ జేయఁబడిన యాసనములను, చిత్రాంగములను=చిత్రాసనములచేతను, సవురు=అందము.

తాత్పర్యము.

అని యాలోచించుచుఁ జూచుచుఁ బోవుచు స్ఫటికములచేతను బంగారు

నై హార్మ్యములు,దంతములు, వీనిచేతను చేయఁబడిన యానవనములచేతను కాంచనముల చేతను సంపన్నమైనదానిని, ఇదియు మునుపర్వము రావణుని శయ్యావర్ణనము.

౬. పలుసైన పటువులఁ • బట్టుదిండ్లును గల్గి, మహితమై దేదీప్య•మాన మగుచు
నొక్కచో నవ్యమా•లోదారహరికాంక,సన్నిభ పాండరచ్ఛత్ర మమరు
జాతరూపఖచిత•హారనాష్టప్రభా,శోకమాలాపంక్తి•సుందర మయి
వీవనల్ విసరెడి•వెలఁదిబొమ్మల నొప్పి, వరధూప పంక్తులఁ • బరిఢవిల్లి
తే. మేఁకపిల్లల చర్మముల్ • మీఁదఁ బఱచి, పూలదండల నల్లెసఁ • బొలుపుమీఱి
కనఁగ సురనాథశయ్యాది•కాశమైన, యసురపతిమంచమును గనె•హనుమ యచట.

అర్థములు. పటువు = నేతలువ్వు, నవ్యమాలోదార = విశేషముగఁ గ్రొత్త మాలికలచే నలంకరింపఁబడి, హరికాంక సన్నిభ = చంద్రునితో సమానమైనదై, పాండరచ్ఛత్రము = తెల్లగొడుగు, జాతరూపఖచిత = బంగారుచేఁ జెక్కఁబడిన, హారనాష్టప్రభా = సూర్యకాంతిగల, అశోకమాలాపంక్తి = అశోక పుష్పముల మాలికలచే నందమై, వెలఁదిబొమ్మలు = ఆఁడుబొమ్మలు, యంత్రితము లగుమన బొమ్మలు వీవనలు విసరుచున్నవని భావము. శిల్పచమత్కారము శ్లాఘింపఁదగినది కదా. ఇవి బొమ్మలేకాని రాక్షసస్త్రీలుగావు. స్త్రీలే నైయుండిన హనుమ సమీపించుటకుఁ జాలుటకు సాధ్యమైయుండదు. వరధూప పంక్తులన్ = శ్రేష్ఠమైన ధూపములచే నొప్పి.

## తాత్పర్యము.

నేతలుపాటి పటువులు పట్టుదిండ్లు గలిగి గొప్పదై ప్రకాశించునదై యొక చోట పూలమాలలచే నలంకరింపఁబడిన చంద్రబింబమువలెఁ దెల్లనైన శ్వేతచ్ఛత్రము ముప్పఁదనంబుగా బంగారుతోఁ జెక్కఁబడి సూర్యకాంతిగల యశోకపుష్పముల పంక్తులచే నందమై విసనకఱ్ఱలు విసరుచున్న యాఁడుబొమ్మలు గలిగి అగరు మహిమాన్విత ధూపములచే నొప్పి మేఁకపిల్లల చర్మములు మీఁదఁ బఱచి మల్లె పూల దండలు గట్టి యమరుటకు నింద్రుని పానుపుతో సరిపోలుచున్న రావణుని మంచమును హనుమంతుఁడు కనుఁగొనెను.

సీ. ఆ మహాసనమున•దమ్మారెలరుచున్నయుండుఁ, గాఁడు మేఘము వన్నె•కాంతివాఁడు
క్రొత్తసొమ్ములఁ దేఱు • కుండలంబులవాఁడు, కావిసాఱిన పెద్ద•కనులవాఁడు
సంజకెంజాయ ప•రించాంబువెమురీతిఁ, బొడి నెఱ్ఱగిందించు•బూఁతవాఁడు
దివ్యసౌరభ్య•దేదీప్యమానుండు, రూపసియును గామ•రూపధరుఁడు
తే. అసురకన్యలకును బ్రియుం • డైనవాఁడు
వాడి మాపటు మిక్కిలి • యలయువాఁడు
మేలిసొమ్ముల మెఱసెడి • మేనివాఁడు
రావణుఁడు నిద్రరింప మ•ర్కటుఁడు గనెను.

అర్థములు. సరంధ్యాంబుదము = మెఱుపులతోఁ గూడిన మేఘము, పరిష్కార = ఆభరణములచే, రూపసి = అందగాఁడు, అసి = క్రీడించి, దోషన్ = రాత్రివేళ.

తాత్పర్యము.

ఆపెద్ద పానుపు మీఁద వర్షాకాలమేఘము వలె నల్లని దేహకాంతి గలవాఁడును క్రొత్తకాంతులచేఁ దేటయగు కుండలములు గలవాఁడును, ఎఱ్ఱనైన పెద్ద కన్నుల వాఁడును, సంధ్యాకాలపు రాగము మెఱుపులతోఁడి మేఘమువలె విస్తారముగ నెఱ్ఱ గంధము బూసికొన్నవాఁడును, దివ్యాభరణములచేఁ బ్రకాశించువాఁడును, సుందరుఁడును, కోరిన రూపము ధరించువాఁడును, అసుర స్త్రీలకును బ్రియుఁడైనవాఁడును, రాత్రివేళ యాడి యలసిన వాఁడును, శ్రేష్ఠములైన సొమ్ములచే మెఱయుచున్న దేహముగలవాఁడును నగు రావణుఁడు నిద్రింపఁగా హనుమంతుఁడు చూచెను.

తే. రజతచేలంబువాని దీ♦ర్ఘంబు లైన బాహువులవాని భూరుహా♦వనకురంగ
సహితమందర మనఁగను ♦ జాలువాని, నెల్ల రాక్షసులకు సుఖ ♦ మిడెడువాని.

అర్థములు. రజతచేలంబువానిన్ = వెండిసరిగ వస్త్రము ధరించినవానిని, భూరుహావన = చెట్లతో నిండిన వనములతోను, కురంగ=పొదలతోను, సహిత = కూడిన, మందర మనఁగను=మందరపర్వత మనునట్లు.

తాత్పర్యము.

వెండిసరిగ గల వస్త్రమువాని నిడుపాటి చేతులవాని చెట్లు దట్టముగాఁగల వనములతోను పొదలతోను గూడిన మందరము వంటి వాని రాక్షసుల కందఱకు సుఖమిచ్చువాని.

ఉ. పెద్దగ దంతివోలె బుస♦పెట్టెడువానిని, పానము త్తతన్
నిద్దురఁ గొన్నవాని, రణ♦నిష్ఠుని, రావణు జూచి భీతిమైఁ
దద్దయు దద్దరిల్లె హరి ♦ దయ్యముఁ జూచి వణంకు కోఁచ నా
నొద్దకు నేల వచ్చితి న♦హో యని హనుమ డిగ్గి యుంటటన్  ౨౬౫

అర్థములు. దంతి=ఏనుఁగు, దద్దరిల్లెన్=తల్లడిల్లుపడెను, కోఁచ=పిల్లకి.

తాత్పర్యము.

ఏనుఁగువలెఁ బెద్దగ బుసపెట్టుచున్నవానిని, త్రాగిన మత్తుచేత నిద్రించు వానిని, యుద్ధమందుఁ గఠినుఁడైనవానిని, రావణు సమీపించి భయపడి దయ్యమును జూచి వణఁకు పిల్లకివానివలె మిగులఁ దల్లడిల్లుపడెను. అయ్యో! యీ పాపిదగ్గఱ కేలవచ్చితి నని హనుమదిగి తరువాత.

దీనివలనఁ బాపాత్ముల సమీపింపరాదని తెల్పుచున్నది.

ఉ. చెచ్చెర వేదికాంతరముఁ ♦ జేరి కనుంగొనె నిద్రించు నా
కుచ్చితు, నచ్చయంబు మది♦కుంజరయుక్తపుష్కరప్రకాశ నై

ప్రయోగింపఁగా వ్యర్థమై పోయినట్లు చాల. ౧౦౬౦ వ పద్యంబునఁ గలదు. కావున నిది యాయుధమే కాని సుదర్శన చక్రముగాదు. సుదర్శన మనునది భగవత్సంకల్ప రూపకము. అది విశ్వామిత్రున కెట్లు లభించె. వసిష్ఠునిచే హరి యెట్లయ్యె. నామ సామ్యముచేఁ బ్రమాద పడరాదు.

### తాత్పర్యము.

అనుచు సింహాసనముతో సమానము లగునవియు, ఇంద్రుని వాహనమైన ఐరావతము కొమ్ముల పోట్లచే గాయములు గాచినవియు, గొప్పవజ్రాయుధము దెబ్బల సహించిన మూఁపురములు గలవియు, విష్ణుచక్ర మను నాయుధముచే గాయపడినవియు, బలముగలిగి సమములైన మూఁపులు గలవియు, నిర్మల లక్షణములు గల గోళ్లు బొటనవ్రేళ్లు గలవియు సుడియులఁ బోలినవియు పిడుగు తొండములవంటి యందము గలవియు, నైదుపడగల పాములఁ బోలునవియు, పానుపుపై నావరించి పడియుండు నవియు, మంచి చేటి కస్తురివంటి మంచి గంధము పూయఁబడినవియు.

సీ. మృగవిలోలాక్షివి • మృదితంబు లగువాని, మంచిగంధములుఁ బరిమళించువాని
యక్షపన్నగసిద్ధ • దానవగంధర్వ, పటలికి భోభో యనఁ • బ్రబలువాని
మందరాచలశృంగ • మధ్యశయనము నట్లు, క్రుద్ధాహు లన శోభ • గొలుపువానిఁ
గ్రవ్యాదనాథుని • ధంబుల రెంటిని, బావని కనుఁగొనె • బాహుయుగము

తే. కల్గిన సశిఖరమందర • ధరాధ్ర మనఁగఁ, గ్రాలు రావణు వదనవి • ర్గతము లైన
మారుతపున్నాగవకుళోన్న • సురభితములు, శ్వాసపవనముల్ నిండారె • సదనమునను.

అర్థములు. మృగవిలోలాక్షీ = జింక కన్నులవలెఁ జలించు కన్నులుగల స్త్రీలచే, విమృదితంబులు = ఆలింగనాదులు చేసికొనఁబడినవి, క్రుద్ధాహులు = కోపించిన పాములు, క్రవ్యాదనాథు = రాక్షసపతియొక్క, ధరాధ్రము = పర్వతము, నిర్గతములు = బయలువెడలినవి సురభితములు=సువాసన గలవియు.

### తాత్పర్యము.

స్త్రీలచేఁ గౌఁగిలింపఁబడినవియు, మంచిగంధము వాసనగలవియు, యక్షుల పన్నగుల దేవతల యసురుల గంధర్వుల సమూహము విలపింపఁజేసినవియు మందర పర్వతము శిఖరము నడుమ నిద్రించు కోపించిన పాములవలె భయపెట్టునవియు, నగు రాక్షసేశ్వరుని రెండు చేతులను హనుమంతుఁడు చూచెను. రెండు బాహువులుండుటచే శిఖరములతోఁ గూడిన మందర పర్వతమువలె నుండు రావణుని నోరనుండి వెడలు చున్న మారుతిఁడి పున్నాగము పొగడ వీనితోఁ జేయఁబడిన సారాయము ద్రాగుటచే నా వాసన గల యూర్పు లిల్లు నిండియుండెను.

ఈ పద్యమునందు రావణున కొక తల, రెండు చేతు లున్నట్లు చెప్పఁబడెను. ఈ తలల, చేతుల విచారము ౧౧౩౪ వ్యాఖ్యయందుఁ జేయఁబడును.

సీ. ఒకచోట నొఱఁగిన యుజ్జ్వలమౌక్తిక, కాంచనమకుటంబు • పెంపువాని
కుండలజ్వలితాస్య•మండలంబుఁ గలాని, క్రూరసర్పముఁబోలె • రోఁజువాని
రక్తచందనదిగ్ధ•రమణీయహారసం, సక్తవిశాలవ•క్షంబు వాని
నొకవంక ప్రాలిన•యొక్క సైన తెలిపట్టు, బుట్టంబు మునుఁగొంగు•బోలుచువాని
తే. విలువ లేని పైఁడి•వలువఁ గట్టినవాని, పెనుపదగ్ధపర్వ • నెనయు వాని
గంగ నడుమ నిదుర•నంగం బెఱుంగని, ద్విపము రాఁగ మెఱుగుల• వెలుఁగువాని.

అర్థములు. కాంచనమకుటంబు = బంగారు కిరీటము, కుండల = చెవి పోగులచే, జ్వలిత = ప్రకాశించు, ఆస్యమండలము = ముఖబింబము, రక్తచందన దిగ్ధ = ఎఱ్ఱగంధముచేఁ బూయఁబడిన, రమణీయ = మనోహరమైన, హారసంసక్త = హారములతోఁ గూడిన, విశాలవక్షంబువాని = వెడలుపాటి ఱొమ్ముగలవాని, ద్విపము = ఏనుఁగు.

తాత్పర్యము.

పండుకొన్న కారణముచే నొకప్రక్కకు నొఱగిన- ప్రకాశించు ముత్యములు గల బంగారు కిరీటము గలవాఁడును, చెవుల కుండలములచే ప్రకాశించు ముఖమండలము గలవాఁడును, క్రూరమైన పామువలె బుసకొట్టువాఁడును, ఎఱ్ఱగంధపుఁ బూఁత గలిగి యందమైన హారములతోఁ గూడిన వెడలుపాటి ఱొమ్ముగల వాఁడును, నొకప్రక్క ప్రేలిన యందమైన తెల్లని పట్టువస్త్రము మునుఁగొంగు గల వాఁడును, వెలలేని బంగారు పరిగ వస్త్రముఁగట్టినవాఁడును, మినుములరాశివలె నున్న వాఁడును, గంగనడుమ నిద్దురగొని దేహము తెలియని యేనుఁగువలె నుండువాఁడును.

క. నాలుగు దిక్కులఁ దమరుచి, వాలాయము నింప వెలుఁగు•వరదీపములన్
నాలుగిటు మెఱయు మెయి శం,పాలలితాబ్దంబు పగిది • భాసిలువానిన్. ౩౦౦

అర్థములు. శంపాలలితాబ్దంబు = మెఱపుచే నందమైన మేఘము. ✓

తాత్పర్యము.

నాలుగు దిక్కులందుఁ దమకాంతి వ్యాపింపఁజేయు నాలుగు దీపములచే మెఱయుచున్న దేహముతో మెఱుఁగులతోఁ గూడిన మేఘమువలె నున్నవానిని.

—• హనుమంతుఁడు నిద్రించు రావణుభార్యలఁ జూచుట. •—

తే. అసురవల్లభు నాతని•యంఘ్రిమూలముననుఁ బండినయనాతని • ముద్దరాండ్ర
రాక్షసాధీశు దివ్యహ•ర్మ్యంబునందుఁ, గాంచెఁ బవమానసూతి ని•ష్కలుషమతిని.

అర్థములు. అంఘ్రిమూలమునను = పాదముల కడ, నిష్కలుషమతిని = పాపములేని మనస్సుతో.

తాత్పర్యము.

రావణాసురుని, వాని కాళ్లయొద్దఁ బండుకొనిన యాతని స్త్రీలను, రావణా సురు నింట నిర్మల మనస్సుతో నాంజనేయుఁడు చూచెను.

క. కన్నులతో వాడని మా,ల్యమ్ములతో నిండు వెలుగు • హసియించెడు నా
స్యమ్ములతో వల ముద్దుం, గుమ్మలఁ గనుగొనెను గాలి•కొడుకు కపీశన్. ౩౦౨

తాత్పర్యము.

ఆ స్త్రీలు వర్ణింపఁబడుచున్నారు. కన్నులతోను, వాడిపోని పూలదండల తోను, పున్నమ చంద్రుని నవ్వు ముఖములతోను నుండు స్త్రీలను హనుమంతుఁడు చూచెను.

క. ఇంబుగఁ దాలిచి యాభర,ణంబుల వీణాదివాద•నంబుల శుభన
ృత్తంబులఁ జదురలఁ బర్యం,కంబులపై నిదురఁగొనెడి•కాంతలఁ గనికొనెన్. ౩౦౩

తాత్పర్యము.

మనోహరముగ నాభరణంబుల ధరించి వీణాదుల వాయించుట యందును, నృత్యములందును నేర్పుగలవారిని, పతి తొడలపైఁ బండుకొని యుండఁగాఁ జూచెను.

ముందుఁ జెప్పఁబడినవారు రావణునకు దూరముగా నేలఁబడియుండినవారు. వీ రంతకంటె నుత్తములు గావున రావణు సమీపంబున వాని తొడలమీఁదనే తల యుంచి పండుకొనిరి.

క. అంగనల చెవు లందుఁ బె,లంగెడి వైడూర్యమండ•లంబులు మఱి యా
చెంగట వెలుంగు బంగరు,టంగదములు గాంచె వాన•రాగ్రణి యచటన్. ౩౦౪

తాత్పర్యము.

ఆ స్త్రీల చెవులందు వైడూర్యముల కుండలంబులు వారి సమీపమున బంగారు భుజకీర్తులు హనుమంతుఁడు గనుఁగొనెను.

క. ఇందునుచిఁ గేరు ముఖములు,సుందరతఁ దళుక్కు మనెడి • చొక్కపుఁగమ్మల్
మందిరమును దారాగణ,మందిన గగనంబుమాడ్కిఁ • శోభించెఁ గడున్. ౩౦౫

తాత్పర్యము.

చంద్రుని పరిహసించు ముఖములు, సౌందర్యముచేఁ దళుక్కు మను కమ్మలు ఆ యింటిని నక్షత్రసమూహములచే నిండిన యాకాశమును బోలి యుండఁజేసెను.

క. హాలారతిఁ గేళిగతి, లీలారతిఁ దేలినట్టి • లీలావతు ల
వ్వేళను నే నెఱుఁగక కనుఁ,దూలిన యుం దుండు నిదుర • తోరముగాఁ గనెన్. ౩౦౬

అర్థములు. హాలారతిన్ = మద్యపానాసక్తిని, కేళిగతిన్ = క్రీడలందు, లీలారతిన్=విలాసముతోఁ గూడిన రతియందు, లీలారతి యనుటచే, నాకేళి బంధములు సూచితము. లీలావతులు = శృంగారవతులు. స్త్రీలు.

తాత్పర్యము.

మద్యము బాగుగఁ ద్రావి, నృత్యాదులు సలిపి, నేనుకాని బంధముల భర్తతో రతి సలిపిన స్త్రీలు నిద్దుర పెల్లున దేహములు తెలియక యుండఁగఁ బడి నిద్రించిరి.

క. మత్తచకోరాంబక వర,నృత్తకళాశీల యగుట • నే యభినయ సం
పత్తి మును వెలసె నిద్రా,యత్తయునై తదభినయము • యనువుగఁ దాల్చెన్.

అర్థములు. మత్తచకోరాంబక = మదించిన చకోరములవంటి కన్నులుగలది, వరనృత్తకళాశీల=నాట్యము చక్కగా నాడుట స్వభావముగాఁ గలది.

తాత్పర్యము.

నాట్యమునందు సామర్థ్యము గల యొకతె యూరకునప్పుడే హస్తాభినయము చూపెనో నిద్రించి నప్పుడును నా యభినయమే చూపించుచుండెను.

క. వెల్లనఁ బోవుచుఁ బోతము, ఫుల్లనళిని యాశ్రయించు•పోలుపున నిమురన్
హల్లకపాణి యొకతె కర,పల్లవములఁ గౌఁగిటన్ వి•పంచిం గూర్చెన్. ౩౭

అర్థములు. పోతమును = పడవను, ఫుల్లనళిన = వికసించిన తామరతీఁగ, హల్లకపాణి=చెంగలువ వంటి యఱచేయి గలది, విపంచిన్=వీణెను.

తాత్పర్యము.

నీటియందుఁ బోవు వికసించిన తామరతీఁగ పడవను చుట్టుకొన్నట్లు యొకహల్లకపాణి తన చిగురువంటి చేతులతో వీణెను కౌఁగిలించి పండుకొనెను.

క. కక్షంబున నొక కంజా,తేక్షణ మడ్డుకము నుంచి • యెలమిని శిశువున్
గక్షమునఁ జేర్చి పండు మృ,గేక్షణ యన నిద్దురించె • నెలమిం గొనుచున్. ౩౮

అర్థములు. కక్షంబునన్ = చంకయందు, మడ్డుకము=మురుజము.

తాత్పర్యము.

ఒకతె చంకయందుఁ మురుజము నుంచుకొని శిశువును జంక నుంచుకొని నిదురించు స్త్రీవలె సంతోషముతోఁ బండుకొనెను.

క. చిరకాలాగతు వల్లభుఁ, గరముల బిగిఁ గౌఁగిలించు•కామిని కరణిన్
సురుచిర యొకర్తు పటహముఁ, గరముల బిగిఁ గ్రుచ్చి నిదుర•కైపునఁ బొల్చెన్.

అర్థములు. చిరకాలాగతున్ = దీర్ఘకాలమునకు వచ్చినవానిని, పటహము = తప్పెట, కైపునన్ = మత్తుచే.

తాత్పర్యము.

దేశాంతరము పోయి యుండి చాలఁగాలమునకు వచ్చిన భర్తను గౌఁగిలించు కామినివలె గొప్ప స్తనములు గల స్త్రీ యొకతె తప్పెటను గట్టిగఁ గౌఁగిలించుకొని నిద్దుర మత్తున పడియుండెను.

క. కామమదంబున నొకర్తుక, కామిని ప్రియుతోడు రహస్య • గ్రహియించినటుల్
తామరసాక్షి యొకర్తుక, ప్రేమంబునఁ గౌఁగిలించి • వేణువుఁ బండెన్. ౩౯

అర్థములు. రహస్య = రహస్యాంగము, లింగము.

తాత్పర్యము.

కామాతిశయమున నొకకామిని తనకు చిక్కిన ప్రియుఁడగు వాని లింగమును

చేతఁబట్టుకొని నిద్రించు నట్లు యొకతె పిల్లఁగ్రోవిని చేతఁ బట్టుకొని నిదురించెను.

క. కాంతునితోఁ బరుండిన, కాంతామణి నా విపంచి • కౌఁగిట నొరఁగన్
దంతిగమన నృత్తకళా,త్యంతనిపుణ యొప్పె నిదుర • సంగము ప్రాప్పెన్. ౩౧౩

తాత్పర్యము.

మగనితోఁ బండుకొనిన కాంతవలె నృత్తమునందు మిగుల నేర్పుగల యొకతె వీణను కౌఁగిలించి నిదురచే దేహము ప్రాల్చి పరుండెను.

నిద్దుర మబ్బుచే వీరికి నీ కొఱముట్లు దూరముగ నుంచి పండుకొనుటకు నవకాశము దొరకినది కాదు. ఎవరిపని వారు చేయుచు నట్లే పడి నిద్రించిరి.

క. బంగరుజిగి మృదుత్వము హృద,యంగమమును బీవరంబు • నగు నంగములన్
రంగార నొత్తి యొక్క మృ,దంగ మొక కురంగనయన • దద్దయుఁ గూర్కెన్.

అర్థములు. పీవరము=బలిసినది, మృదంగము=మద్దెల.

తాత్పర్యము.

బంగారు కాంతి, మృదుత్వము, మనోహరత్వము బలుపుగల యవయవములచే నొకతె మృదంగమును నొత్తుకొని పండుకొని నిదురించెను.

క. మద్దెల మొరయించుచు నొక,ముద్దియ శ్రమ నొందిన బాహు•మూలంబులచేఁ
దద్దయుఁ గతింబున నది, గ్రద్దన బిగియించి సోలె • గాఢపు నిదురన్. ౩౧౪

తాత్పర్యము.

ఒకతె మద్దెల వాయించుచు బడలి దానిని చంకలచే బిగించి గాఢనిద్రచే సోలెను.

క. డిండిమముఁ గ్రుచ్చి వెనుకను, నొండొక డిండిమము గ్రాల • యువవల్లభుతోఁ
గొండొక బిడ్డనితోఁ బ,రుండిన కలభోరు వనఁ బరుండెను నిదురన్. ౩౧౫

అర్థములు. డిండిమము = రాయిడి గిడిగిడి, ఢక్క. కొండొక = చిన్న, కలభోరువు=కలభమువంటి తొడగలది.

తాత్పర్యము.

ఒకతె ముం దొక ఢక్క, వెనుక నొక ఢక్క యుంచుకొని చిన్నబిడ్డను ముందు, వయస్సుమగని వెనుక నుంచుకొని పరుండిన స్త్రీవలెఁ బరుండెను.

క. మదనమదభృశవిమోహిత,మదకలమదిరాక్షి యొకతె • మతి తెలియక తా
మృదుకరముల నాడంబర,ము నగఁ గవుంగిలను జేర్చి • మునిఁగెను నిద్రన్. ౩౧౬

అర్థములు. మదన మద = కామమదముచే, భృశవిమోహిత = మిక్కిలి మోహము చెందిన, మదకల = మదముచే నందమైనది, మదిరాక్షి = మద్యము వలె నెదుటివారిని మత్తుఁగొనఁ జేయు కన్నులుగలది. ఆడంబరము=తూర్యవిశేషము.

ఆడంబర స్సమారంభే గజగర్జిత తూర్యయోః విశ్వము.

తాత్పర్యము.

కామ మదమున మిగుల మోహముచెందిన యొకతె దేహము తెలియక తన మృదుకరములచే నాడంబరమును కౌఁగిలించి నిదురలో మునిఁగెను.

క. జలకలశ మొకర్తు వసంత, తిలకమున నొరలించి దానఁ దనిసెన్ సురభిన్
చెలువలి వాడమికై సి,గ్ధలజలసిక్త మగు శబల•మాల్యము మాడ్కిన్. ౩౧౭

అర్థములు. జలకలశము = నీటిపాత్ర, సురభిన్ = వసంతకాలమందు, చెలువలి = అందముచేసి, వాడమికై = వాడిపోకయుండుటకై, శబలమాల్యము = నానా వర్ణములు గల పూలదండ, మాడ్కిన్ = వలె.

తాత్పర్యము.

రావణాసురునకు నీళ్ళుపోసెడి పనికత్తె నీటిపాత్ర నిద్ర మబ్బున నేల దొరలించి యా నీటియందే పండుకొని వసంతకాలమున వాడిపోకుండుటకై నీళ్ళచేఁ దడుపఁబడిన పెక్కురంగుల పూలదండవలె నుండెను.

శబల శబ్దస్వారస్యముచే నీళ్లు పట్టువేసు నొకతెయైన దాని వాసన గలదై యందము పూవులతోఁ గలసి యుండెనని భావము.

క. బంగరు గిండుల మేలిపొ, రంగులు గల నిజపయోధ•రంబులఁ గేలన్
భృంగీకుంతల యొకర్తుక, పొంగుగ బిగఁ బట్టికొనుచుఁ బొండెన్ నిదురన్. ౩౧౮

అర్థములు. భృంగీకుంతల = ఆఁడు తుమ్మెదలవంటి ముంగురులు గలది.

తాత్పర్యము.

బంగరు గిన్నెలవంటి శ్రేష్ఠమగు విలాసము గల తన కుచములను సంతోషముతో గట్టిగాఁ బట్టికొనుచు నొక యాఁడుతుమ్మెదలఁబోలు ముంగురులు గల సుందరి నిద్రించెను.

క. మదవిహ్వల యగు నొక్క, ప్రమద శారదపూర్ణ చంద్రు • మణిపించెడి స
ద్వదనముఁగలయొకహరికటి, నిమురను బిగియారఁ గ్రుచ్చె • నెఱమోహమునన్.

అర్థములు. మదవిహ్వల = మదముచే వికలమైన మనస్సుగలది, హరికటిన్ = సింహమధ్యను.

తాత్పర్యము.

మదముచేఁ జెదరిన మనస్సుగల యొకపడుచు శరత్కాల చంద్రునితో సమానమైన ముఖముగల యొక సింహమధ్యను నిండు మోహముచే నిదురఁబోవుచు గట్టిగాఁ గౌఁగిలించుకొనెను.

తే. కామినులు కామమదమునఁ గాముకులను, జన్నులను బిగ్గ నొక్కైడి • చందమునను
తతఘనానద్ధసుషిరవా • ద్యములఁ గ్రుచ్చి, మత్తకాశిను లయ్యెడ • నత్తమిలిరి.

అర్థములు. తత = వీణాదిక వాద్యము - తంత్రులుగల వాద్యము, ఘన = తాళాదికము - వాయించునవి - కంచుతాళములు, అనద్ధము = మద్దెల మొదలయినవి,

సుషిరములు = పిల్లంగ్రోవులు - మొదలయినవి, మత్తకాశినులు=మద
ముచే బ్రకాశించు స్త్రీలు, అశ్వపులిరి=పండుకొనిరి.

తాత్పర్యము.

కామముగల స్త్రీలు కామముగల తమ భర్తలను గాఢాతిశయముచే జన్ను
లచే గట్టిగా నొత్తు విధముగాఁ గొందఱు స్త్రీలు వీణెలను, మద్దెలలను, తాళములను,
వెనుకకొట్టములతో వాయించు పిల్లంగ్రోవులు మొదలగు వాద్యములను గట్టిగాఁ
గౌఁగిలించుకొని పండుకొని నిద్రపోయిరి.

రావణాసురుని యంతఃపురస్త్రీ లందఱు సొమ్ము లూడిపోయినవారుగను, చీర
లూడిపోయిన వారుగను, ముఖములందుఁ జెమటకొంగు చేసికొనినవారుగను వర్ణింపఁ
బడిరి. ఇందు శృంగారరసము వర్ణితమైనను నివన్నియు రాఁగల వైధవ్య చిహ్నము
లని ధ్వనిత మని యెఱుంగ నగు.

క. వారల నెల్లరఁ జూచుచు, వీరుఁడు కపివరుఁడు పోయి వే ఱొకచోటన్
జారుతరరూపవిభవో, దారను నేకాంతసీమఁ దరుణిని గాంచెన్. ౩౨౧

తాత్పర్యము.

వీరుఁ డగు నాంజనేయుఁడు వారి నందఱఁ జూచుచు బోయి పోయి వేఱొక
చోట నేకాంతస్థలమున మిగుల మనోహరమైన సౌందర్యాతిశయము గల యొక
వయస్సు స్త్రీని జూచెను.

ఇచట వీరుఁ డనఁగా నింద్రియజయము గలవాఁ డని భావము. ఇందఱు సుంద
గత్తెలఁ గామమత్తల నేకాంతమునఁ జూచినను ఆయన మనస్సు చలింపలే దని
భావము. ఈమె పట్టపుదేవి గనుక ఈ మూకలో గలియక వేఱుగ నొంటిగఁ బండు
కొనెను.

— హనుమంతుఁడు మండోదరిని జూచుట. —

శా. రాణ న్మించిన మంచిముత్తియపు హారాళుల్ తూల వక్షస్థలిన్
మాణిక్యప్రకరప్రభాపటలశుంభన్మండనోద్దీప్తయై
రాణింపన్ శయనంబునం గనియె నిద్రాసక్త స్వర్ణాంగి మ
త్తైణీలోచనఁ జారురూపిణిని శుద్ధాంతేశ మందోదరిన్. ౩౨౨

అర్థములు. తూలన్ = వ్రేలాడఁగా, మాణిక్యప్రకర = మాణిక్య సమూహ
ములయొక్క, ప్రభాపటల = కాంతి సమూహముచే, శుంభత్ = ప్రకాశించు,
మండన = అలంకారములచే, ఉద్దీప్తయై = మిగుల వెలుఁగుచున్నదై, నిద్రాసక్తన్ =
నిద్రించుదానిని, స్వర్ణాంగిన్ = బంగారువలెఁ బచ్చనైన దేహము గలదానిని,
మత్త+ఏణీలోచనన్ = మదించిన యాఁడుజింక కన్నులవంటి కన్నులు గలదానిని,
చారురూపిణిని = మనోహరమైన సౌందర్యముగలదానిని, శుద్ధాంతేశ = అంతఃపుర
ప్రభ్విని - పట్టపురాణిని, మందోదరిన్ = మందోదరి యను పేరు గలదానిని, మందో

దళ=పలుచని కనుపుగలది, మందోదరి యనియు రూపము గలదు. అష్టదళ తామరగడ వంటి కనుపుగల దని యర్థము. చూ. ౧౩౧౮ పద్యము.

తా త్ప ర్య ము.

మంచి ముత్తియముల హారములు తోమ్ముస ప్రేలాడఁగా మాణిక్యముల కాంతులచేఁ బ్రకాశించు నలంకారములచే మిగుల వెలుఁగునదియై నిద్రించుదానిని, బంగారువలెఁ బచ్చనైన దేహము గలదానిని, మదించిన యేనుఁగుపిల్లకన్నులవంటి కన్నులు గలదానిని, మనోహరమైన సౌందర్యము గలదానిని, పట్టపురాణి యగు మందోదరిని పఱుపు యందు దోఁపఁచుండఁ జూచెను.

ఉ. హత్తిన మేలిరూపమును • దానవనుపదఁ జూచి కంటి నే
నత్తరళాక్షి సీత నని • హర్షమునన్ భుజ మప్పళించు, ము
ద్దొత్తును దోఁక, నాడు, ముద • మొందును, గంబము లెక్కు, దూఁకు, గిం
చిత్తుగఁ బాడు, నైజ మగుచేష్టలు సేయుచు వానరుం డటన్. ౩౭౩

అర్థములు. హత్తిన = పొందిన, మేలి రూపమును=గొప్ప సౌందర్యమును, అప్పళించున్ = తట్టుకొనును, ముద్దు+ఒత్తును = ముద్దు పెట్టుకొనును, కించిత్తుగ = కొంచెముగ, 'కించిత్తు నల్లి గఱచిన' యని సుమతీ శతకము, నైజము=సహజము.

తా త్ప ర్య ము.

ఆమెయొక్క గొప్ప సౌందర్యమును, ప్రాయమును జూచి, చూచితిఁ జూచితి సీత నని సంతోషాతిశయముచే భుజములు తట్టుకొనును. తోఁకముద్దు పెట్టుకొనును. గంతులు వేయును. సంతోషించుచు స్తంభము లెక్కి దూఁకును. మెల్లగఁ బాడును. (హనుమంతుఁడు సంగీతవిద్వాంసుఁడు) కోఁతులకు స్వాభావికమైన చేష్టలు చేయును.

వాస్తవపు సీతాదేవిని జూచినప్పు డీ చేష్టలను జేయలేదు. ఏల? తన కష్ట మంతయు ఫలించెఁగదా యన్న సంతోష మంతయుఁ బొంగి పొరలిపోయెను.

—• ౧౧-వ సర్గము. హనుమ సీతాదేవిని పానశాలయందు మరల వెదకుట. •—

ఉ. కాంచితిఁగా రఘూత్తముని • కామిని నంచును స్వస్థచిత్తుఁడై
యించుక యుండి యా హనుమ • యిట్లను నీ సతి సీత? సీత ని
ద్రించునొ! యారగించునొ! ము • దించునొ! సొమ్ములు మేనఁ దాల్పఁ గాం
క్షించునొ! తాన మాడను సు • చించునొ? రాముని బాసి యుండుటన్. ౩౭౪

అర్థములు. స్వస్థచిత్తుఁడై = కుదుటఁబడిన మనస్సుగలవాఁడై, ఇంచుక = కొంచెము, ముదించునో = సంతోషించునా?

తా త్ప ర్య ము.

అయ్యా! యిప్పటికి చూచితిని శ్రీరామచంద్రమూర్తి భార్యను అని కొంచెము సేపు మనస్సు కుదుటగా నుంచుకొని యీమె సీత యగునా యని వితర్కించి సీత యైనయెడల నామె పతివ్రతగదా! భర్తను విడిచియుండు సమయంబున నామె

నిద్దురవోవునా? ఆహారము తీసికొనునా? సంతోషించునా? దేహమున సొమ్ములు ధరించునా? పానము, మదము మంచిని శ్యయనము ఆమెకు రుచించునా? ఇవన్నియు నీమె యొద్ద నున్నవి కావున నీమె సీత యెట్లగును? కాదు.

క. రాముని కెక్కుడగ నా సు, త్రాముని నేని భామికన్య • తగఁ గనుఁగొనునే?
కాముని తోఁ దుల్యుఁడు స్వర్గాములనేన్ లేఁడు నిశ్చితం బిది యనుచున్. ౩౫౪

అర్థములు. సుత్రామునినేన్ = ఇంద్రునైనను, స్వర్గాములనేన్ = దేవతల యందైన.

తాత్పర్యము.

సీతాదేవి రామచంద్రమూర్తిని దప్ప నింద్రుని నైనఁ గన్నెత్తియైనఁ జూచునా? చూడఁజాలదు. ఏల? ఆమె పతివ్రత. ఎట్టి నికృష్టుఁడైనను ఆ పతియే దైవమని పరు లెట్టివారైనను తన పతికంటె నికృష్టు లని యుండునది కదా పతివ్రత. అట్టు లుండ రామచంద్రమూర్తితో సమానుఁడు దేవతలందైన లేఁడే. ఇఁక నీ రావణుని మాట చెప్పనేల. ఉత్తమోత్తమ వస్తువు లభించిన వారధమవస్తువు గోరుదురా? కావున నీమె సీత గాదు. ఇది నిశ్చయము, అనుచు,

సీ. ఆవల నరిగి పా•నాలయంబునయందు, వెదకంగఁ జొరఁగ నా•వీరవర్యుఁ
డాటలఁ బాటలఁ • నలసినవారిని, మధుపానమున మేను • మఱచువారి
మర్దలమురజముల్ • మఱి కౌఁగిలించి, తలకడిండ్లు గాఁగను • దనరువారి
నుచితాస్తరణాళి • నత్తుఱిల్లినవారి, వాఱుఁగంటులఁ గాంచి • వానరేంద్రుఁ
తే. జనులమనోహరమగాలంకృ•తాంగులైన, రూపసల్లాపశీలతా•రూఢలైన
కాలదేశాభియుక్తతా•కాంత లెల్ల, బియుఁగ రతాభిరతసుప్త•వాసవారి. ౩౫౫

అర్థములు. పానాలయంబు = మద్యపానము చేయు నిల్లు, మర్దలమురజముల్ = మద్దెల మృదంగములు, ఆస్తరణాళి = నేలఁ బఱచిన కంబళ్ళు మొదలయినవి, అత్తుఱిల్లినవారిని = పండుకొనిన వారిని, రూపసల్లాపశీలతారూఢలు = సౌందర్య విషయమైన ముచ్చటలు చెప్పు స్వభావమందుఁ దేఱినవారు, కాలదేశాభియుక్తలు = యుక్తమైన దేశకాలముల నెఱిఁగినవారు, రతాభిరతసుప్తన్ = సురతమున నిష్టముగలవానిని, నిద్రించిన వానిని, విశేషణోభయపదము. రతశబ్దము బాహ్యసురతమును, అభిరతశబ్దము కరణబంధాదులను సూచించునని కొందఱు. రతాభిరతసుప్త = స్నాతానులిప్తశబ్దమునందువలె రతాభిరతశ్చ అసౌ సంసుప్తశ్చ యని సమాసము గ్రహింపనగు. 'బాహ్య మాభ్యంతరం చేతి ద్వివిధం రతముచ్యతే తత్రాద్యం చుంబనాశ్లేష నఖదంతక్షతాదికం, ద్వితీయం సురతం సాక్షాన్నానా కరణ కల్పితమ్. అతో రతం బాహ్య మిహ ప్రయోజ్యం తత్రాపి చాలింగన మేవ పూర్వమ్॥ రతి రహస్యే. బాహ్యమనియు అభ్యంతరమనియు రతి రెండు విధములు. ముద్దుపెట్టుకొనుట, కౌఁగిలించుట, నఖక్షత, దంతక్షతములు లోనైనవి బాహ్యమనఁ

బడును. నానాబంధకల్పిత నాకోపస్సరతిము అభ్యంతర మనఁబడును, బాహ్యముతో నందు నాలింగనముతో రతి నారంభింపవలయును. ఇం దీ రెండు తెగలవారు చెప్పఁబడిరి. వాసవారిన్ = ఇంద్రద్వేషిని - పైపద్యముతో నన్వయము.

తా త్ప ర్య ము.

మందోదరిని దాటి యావలఁ బోయి మద్యము ద్రాగు నింటియందు హనుమంతుఁడు వెదక నారంభించెను. ఆట లాడి పాటలు పాడి, యలసినవారిని, మద్యము ద్రావి దేహములు మఱచినవారిని, మద్దెలలు, మృదంగములు, పీటలు, తలదిండ్లుగాఁ గలవారిని కంబళ్ళు, తివాచీలు పఱచుకొని పండుకొనినవారిని, స్త్రీలను జూచి నిర్మలమైన రత్నాభరణములచే నలంకరింపఁబడినవారై, సౌందర్యలక్షణ మునవ్యసించు స్వభావము గలవారై, దేశకాలముల యుచిత జ్ఞానము గలవారైన స్త్రీలు చుట్టుకొన బాహ్యాభ్యంతర రతుల నలసి నిద్రించు రావణునిని,

ఉ. అవులమందలో వృషము•నట్టులు కానలలోఁ గరేణుపూ
గావృతమైన దంతిగతి • నబ్జముఖీపరివారకీర్ణునిన్
రావణుఁ గాంచి దాఁటి చని • రమ్యసమస్త సువస్తుపూరితం
బౌ వరపానభూమి, గడి•యం జని యందు సమీరసూతియున్. ౩౨౭

అర్థములు. వృషము = ఎద్దు, కరేణుపూగావృతము=ఆడేనుఁగల సమూహముచేఁ జుట్టఁబడినది, దంతి = ఏనుఁగు, అబ్జముఖీ పరివారకీర్ణునిన్ = స్త్రీ పరివారముతోఁ గూడియుండువానిని.

తా త్ప ర్య ము.

అవుల మందలో నెద్దువలె, ఆఁడేనుఁగుల గుంపులో నేనుఁగువలె స్త్రీ పరివారములో నుండువానిని రావణుఁ గాంచి దాఁటిపోయి, మనోహరమైన సమస్త వస్తువులచే నిండిన మద్యపాన గృహప్రదేశము చేరఁబోయి యందు హనుమంతుఁడు.

సీ. మహిషసూకరమృగ•మాంసంబు లచ్చట, నచ్చటఁ ద్రోవ్వత్తై • హెచ్చి యుండ
మీఁగడ పెరుఁగున • మేలిమి సౌవర్చ్చలములఁ గీరదిన గో•ళ్ళయు నెమళ్ళ
కిసుల ఖణ్డంబుల • వనశల్యముల శేళ్ళ, క్రకరచకోరసం•ఘము నెఱచుల
సాభిభక్షితకల•శంబుల బహువిధ, పక్వ శేహ్యాసుధో•ర్వ•పటలములను

తే. నుప్పు పులుసుల వండుట • నొప్పు మీఱు. రాగషాడబములను దో•రంగ వైవఁ
బడినసరగలు నందెలఁ దొడవు లెల్లఁ బానభాజనవిక్షిప్త•ఫలచయముల. ౩౨౮

అర్థములు. సౌవర్చ్చలము=సౌవర్చ్చ మను పేరుగల లవణము, శల్యము=ఏదు పంది, క్రకరము=కక్కెర, ఎఱచులన్ = మాంసములను, సాభిభక్షిత = సగముతినఁబడిన, రాగషాడ్బములన్; రాగ=తెల్లయావాలు, 'రాగసిద్ధార్థకో జ్ఞేయః' అని పాకశాస్త్రము. షాడబము=మధురసములుగల యట్లు చేయఁబడిన భక్ష్యము. (౨) రాగ= పలుచగా నున్న మధురరసము - షాడబము = చిక్కఁగా నున్న మధురాదిరసము.

చక్కెర తోడి ద్రాక్ష దానిమ్మ - వీని రస మని భావము. సితా మధ్వాదిమధురో ద్రాక్షో దాడిమజో రసః। విరళశ్చేత్ కృతో రాగః సాంద్రశ్చేత్ షాడబ స్స్మృతః॥ పానకం ద్రాక్షమాధూకం ఖార్జూరం తాల మైక్షవం। మధూత్థం శీధుమాధ్వీకం మైరేయంనారికేళజమ్। అర్ణవము. అను వాక్యము ప్రమాణము. తోరంగన్ = దొంతులు నట్లు, సరగలు = హారములు, తొడవులు = ఆభరణములు, పానభాజన = పాన పాత్రములందు, నిక్షిప్త = ఉంచఁబడిన.

తాత్పర్యము.

మన్నుపోతులు - పందులు - జింకల మాంసము లందందుఁ గుప్పలు కుప్పలు గాఁ బడియుండెను. పెరుఁగడ పెనుఁగులో సౌవర్చలవణము కలిపి సిద్ధము చేసిన కోళ్ళ - నెమిళ్ళ - పందుల - ఖడ్గముల - పందుల - లేళ్ళ - కక్కెరల - చకోరముల మాంసములను సగము భక్షింపఁబడిన పాత్రములందు నానావిధములుగఁ బాకము చేసిన లేహ్యములను, భోజ్యములను ఉప్పు పులుసువేసి వండిన రాగషాడబములను తొరలిపడిన హారములను, అందెలను అన్నివిధముల యాభరణములను, పానపాత్రలం దుంచఁబడిన ఫలములను హనుమంతుఁడు చూచెను.

తే. అచ్చటచ్చట నానిచిన • హారుపుమీఁదు
నవ్య కనకమణీశయ్య•నముల నాస
నములకాంతులఁ బావకో•హము కృశాను
రహితమయ్యుఁ బ్రదీప్తమై • రమణఁ దోఁచె. ౩౨౯

అర్థములు. కృశాను రహితమయ్యున్ = అగ్నిహోత్రము లేకున్నను ప్రదీప్తము = మండుచున్న, రమణ = విధము.

తాత్పర్యము.

అక్కడక్కడ నుంచిన యుపవనముచే నతిశయించు క్రొత్తబంగారు రత్నములచే జేయఁబడిన శయ్యలయు నాసనములయుఁ గాంతులచే నా గృహము నిప్పులేకున్నను గాలుచున్నట్లు లుండెను.

క. వెరవరులను వడబాలును, సరసంబుగఁ దిన్న నామి•షంబులు సుమశే
ర్కరలను మధుఫలములచే, సురుచిరముగఁ జేసినట్టి • సురలం గాంచెన్. ౩౩౦

అర్థములు. వెరవరులు = నెరవు + అరి=ఉపాయశాలులు, అడబాలులు = వంటవాండ్రు, ఆమిషంబులు = మాంసములు, సుమశర్కరలను = పూలరసము చేతను చక్కెరచేతను, మధుఫలములచేన్ = ద్రాక్ష మొదలగు తీయని పండ్లచే, సురలన్ = సారాయములను.

తాత్పర్యము.

పాకము చేయు నుపాయము తెలిసిన వంటవాండ్రు రుచిపుట్టునట్లు వండిన

మాంసంబులను పూలచేతను చక్కెరచేతను ద్రాక్ష ఇప్పపూవు లోనగు తియ్యని ఫలములచేతను ఇంపుగ సిద్ధముచేసిన సారాయములను జూచెను.

క. బుక్కాములు పలు తెగ లగు, ప్రక్కలు బంగారు వెండి ♦ స్ఫటికంబులఁ జెం
 పెక్కిన కలశంబులు రుచి, పెక్కువ పానీయములఁ గ♦పిప్రభువు గనెన్. ౩౩౧

అర్థములు. బుక్కాములు=గంధపొడులు, ప్రక్కలు=హారములు.

తా త్ప ర్య ము.

గంధపొడులు నానావిధములైన హారములు బంగారు వెండి స్ఫటికంబులఁ జేసిన పాత్రములు విశేషము రుచి గల పానీయములను హనుమంతుఁడు చూచెను.

క. అఱ్ఱాపిన నెఱ ద్రావిన, కొఱగానని కమ్మరసముఁ ♦ గూడినపాత్రల్
 నెఱమెక్కిన యఱ చిక్కిన, కొఱ దక్కని భక్ష్యములయుఁ♦గుప్పలు గాంచెన్.

అర్థములు. నెఱ ద్రావిన = పూర్ణముగఁ ద్రావిన, కొఱగానని = కొఱంత లేక నిండియున్న, కమ్మరసము = సారాయము, నెఱ=పూర్ణముగ, మెక్కిన=తినిన అఱచిక్కిన=సగము మిగిలిన, కొఱదక్కని=కొఱువలేక నిండియున్న.

తా త్ప ర్య ము.

కొన్ని పాత్రము లందలి సారాయము సగము త్రావఁబడియుండెను. కొన్నిఁటి యందుఁ బూర్ణముగఁ ద్రావఁబడి యుండెను. కొన్నిటియందు నేమియుఁ ద్రావఁబడక నిండియుండెను. భక్ష్యములు కొన్ని సగము తినఁబడినవి, పూర్ణముగఁ దినఁబడినవి, ఏమియుఁ దినఁబడనివి కుప్పలు కుప్పలుగాఁ బడియుండెను. ఇవియన్నియు హనుమ చూచెను.

మనోరంజని. పగిలిన గిన్నెలు దొరలెడి కుండలుఁ♦ బాఱు జలంబులు దండలుఁ బల్
 తెగ లగు పండులు బిగి గల కౌఁగిటఁ♦దేల్చుచు నొండొరు నిద్దుర నై
 వగ గల కన్నెలచెలు వగుచిన్నెలు ♦ వారక పేఱొక తొయ్యలిచీ
 ర గరిత యొక్కతె నిదురను లాగి యు♦రంబునఁ గప్పికొనం గనిమెన్.

తా త్ప ర్య ము.

పగిలిన గిన్నెలు, దొరలుచున్న కుండలు, నేలఁ బాఱుచున్న నీళ్ళు, దండలు, నానావిధములయిన పండ్లు నిద్దురచే గట్టిగా నొకరి నొకరు గౌఁగిలించుచున్న సుందరుల చిన్నెలు, నొకదాని చీర తీసికొని వేఱొకతె యీడ్చుకొని తొమ్ములపైఁ గప్పుకొనుటలు హనుమంతుఁడు చూచెను.

మనోరంజని: నజనలు నైదు సగణంబులు, పదేనింట యతి.

క. సుందరుల మేనివలువలు, నందపుసరములును మాఱ్పు♦టనిలమున దర
 స్పందము లయి మందానిల,కందళముల సుఖముఁ జెందు క్రైవడి నమ్మెన్. ౩౩౪

అర్థములు. దరస్పందములు = కొంచెముగాఁ గదలినవి, మందానిల కందళములన్ = మందమారుతముయొక్క మొలకలు అనఁగా మెల్లఁగా వీచుపిల్లగాలులు.

తా త్ప ర్య ము.

అందగత్తెలు దేహముల ధరించిన చీరలు సొగసైన పండలు వారి వారి యూర్పుగాలిచేఁ గొంచెముగాఁ గదలుచు తెల్లని పిల్లగాలులచే సుఖించుచు విధముగ నుండెను.

ఉ. కమ్మని చందనంబు కసు•గందని పూలసరాలు శీధుపా
నమ్ములు స్నానలేపములు • నవ్యసుధూపము లీను చున్న ఘం
ఘుమ్మను కమ్మఁదావు లెస•కంబునఁ గైకొని తన్మహావిమా
నమ్మున నించె సౌరభము • నవ్యముగాఁగ మరుత్కిశోరముల్. ౩౩౫

అర్థములు. కసుగందని = వాడిపోని, శీధుపానమ్ములు = సారాయము త్రాగుటలు, 'శీధు రిక్షురసైః పక్వై రపక్వై రాసవో భవేత్, మైరేయం ధాతకీ పుష్ప గుడధాన్యాంబు సంహితమ్.' చెఱకు పాలతోఁ గాచిన సారాయము శీధు వనియు, కాఁచక సిద్ధము చేసినది ఆసవమనియు, ఆరెపూలు బెల్లము ధాన్యము (ధనియాలు) నీళ్ళు కలిపి కాఁచినది మైరేయ మనియుఁ బేరు. స్నానలేపములు=స్నానము చేయునపుడు రుద్దుకొను నలుగుపిండులు, ఎసకంబుగన్ = విస్తారముగ, సౌరభము = పరిమళము, మరుత్కిశోరముల్=గాలిపిల్లలు.

తా త్ప ర్య ము.

మంచి వాసనగంధము, వాడని పూలదండలు, సారాయి రసములు, సున్నిపిండి మొదలగు నలుగు పిండులు, క్రొత్త మంచి ధూపములు - వీనివలనఁ గలుగు మంచి వాసనలను విస్తారముగఁ గొని పిల్లగాలు లా విమానమ్మును మంచి సువాసనలతో నించుచుండెను.

క. నల్లని తెల్లని పచ్చని, తెల్లం బగు వన్నె లొప్పు • మోహానవతు లం
దెల్లెనఁ గూర్కియుఁ గూర్కిన, హల్లకలత లట్లు లొప్పి • రంగజుగాసిన్. ౩౩౬

అర్థములు. నల్లని తెల్లని పచ్చని మోహానవతు లనుటచే నానాదేశ స్త్రీలు చెప్పఁబడిరి. హల్లకలతలు=తామరతీఁగలు.

తా త్ప ర్య ము.

నల్లని - తెల్లని - పచ్చని వర్ణముగల స్త్రీ లందఱుఁ గామకేళియం దలసిన వారై నిద్రించు తామరతీఁగలవలెఁ బడి నిద్రపోవుచుండిరి.

—• పరాంగనాదర్శనంబునను హనుమంతుఁడు చింతించుట. •—

క. అంతయు దశకంధరు నే, కాంతగృహాంబిఁబులు కడిగి • గాలించియు ధా
కాంకాత్మజ యునపాడ గన, కింతయుఁ జింతించె వాన• కేశ్వరుఁ డాత్మన్. ౩౩౭

అర్థములు. ఏకాంతగృహము = అంతఃపురము, కడిగి గాలించి = చక్కఁగాఁ బరిశోధించి, అడపొడ = ఆకారముజాడ.

తాత్పర్యము.

రావణాసురుని యంతఃపురమంతయు నిటుల చక్కఁగా శోధించి సీతాదేవి రూపముగాని యామె యుండు స్థలము జాడగాని తెలియక హనుమంతుఁడు ఇటుల చింతించెను.

ఉ. అచ్చట నిద్రించు కమ•లాక్షుల నెల్లరఁ జూచి యయ్యయో
వచ్చెను ధర్మహాని పర•వారిజలోచన లందు నాదుచూ
పెచ్చట లేని వర్తిలద • యిచ్చటిమేనలఁ గూర్కు కాంతలన్
జొచ్చియు మీఁదఁ జూచితిని • బోవఁగఁ ద్రోచితి ధర్మమార్గమున్. ౩౭

తాత్పర్యము.

అక్కడ నిద్రించుచున్న స్త్రీలను పైటలు తొలఁగిన వారిని చీరలు తొలఁగిన వారిని లెక్కలేని వారి నందఱను జూచి యయ్యో నేనెంతటిధర్మ విరుద్ధమైన కార్యము చేసితిని. పరస్త్రీలయందు నాదృష్టి పాఱునదిగాదు. అటులుండ నిప్పుడు మేను లందు నొడలు తెలియక నిద్రించు స్త్రీలను కపటవిధముగఁ జూచితిని. నిద్రించు స్త్రీలను అందుఁ బరస్త్రీలను అందు దేహము తెలియక చీరలు తొలఁగిపడి యుండు స్త్రీలను జూచుట యను ధర్మమునకు హాని కలిగించితిని. 'నేక్షేతార్కం న నగ్నాం స్త్రీమ్'.

క. పరదారల నెయ్యెడ నే, నరసి కనుట ఘోరపాప • మందును నిద్రా
పరవశలై యొడ లెఱుఁగని, పరసతులంగంటి నెంత•పాపం బకటా. ౩౮

అర్థములు. దారలను=భార్యలను.

తాత్పర్యము.

మేలుకొని తిరుగు చున్నప్పుడే పరుల భార్యలను మోఁకాటికి మీఁదఁ బాలించి చూడరాదు. అది మహా పాపకార్యము. అటు లుండ నిద్రచేఁ బరవశలై దేహము తెలియక యుండు పరస్త్రీలను జూచితిని. అయ్యో! యెంత పాపము చేసితిని.

తే. అనుచుఁ దలపోయు చున్న మ•హాత్మునకును, నిశ్చితైకాంతమతికి ని•శ్ఛిద్రగతికిఁ
గార్యనిశ్చయదర్శన•కోవిదుఁడు నైన, బుద్ధి జనియించెఁ గ్రమ్మఱఁ•బూతగతిని. ౩౯

అర్థములు. మహాత్మునకు = గొప్ప మనస్సు గలవానికి, జితేంద్రియునకు, నిశ్చిత + ఏకాంత + మతికిన్ = నిశ్చయించుట స్వభావము గాఁగల మనస్సుగల వానికి, 'వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన' యన్నట్లు - ఏకాంతము=ఏక+ అంతము = ఒకటే అంతము గాఁగలది. అనఁగా నిటునటు చలింపని, మతికిన్ = మనస్సుగలవానికి. సీతాదేవిని జూచుటయందే మనస్సంతయు నిశ్చయమై యుండు టచే నెవతెను జూచినను 'ఈమె సీతయా, ఆమె సీతయా' యని సీతాదేవియందు దృష్టి, సీతాదేవి స్మరణము తప్ప వేఱు భావము వేఱు దృష్టి లేనివాఁ డని భావము. ఆ కారణము చేతనే, నిశ్ఛిద్రగతికి = హెచ్చరికతోఁ గూడిన గమనము గలవానికి, అనఁగాఁ బ్రతిస్త్రీయొద్దకుఁ బోయి యనయమ పరీక్ష చేయు లేదు. అప్పుడు గార్యనిశ్చ

యుంచుకొనుటకు నెంతకావలయునో యంతవఱకుఁ బోవచ్చునో యంతమాత్రమే పోవుచుండెను. కార్యనిశ్చయదర్శినీ మమ=చేయవలసిన కార్యము నిశ్చయించి తీర్మానింప సామర్థ్యము గలది. ఈ సందేహముచేఁ బని చాలించిన యెడలఁ నాచే బూనిన కార్యము చెడిపోవును. అట్లు కార్యము చెడిపోకుండఁ జేయు బుద్ధి- పూతగతిని = పవిత్రమైన విధముగ.

తాత్పర్యము.

అని యాలోచించు గొప్పమనస్సుగలట్టియు, నిశ్చయింపఁబడిన యేకాంతమైన మనస్సుగలట్టియు, హనుమంతునకుఁ బవిత్రమైన మార్గమున నిది చేయఁదగినది. యిది చేయరానిది యని నిశ్చయించి తీర్మానింప సామర్థ్యము గల బుద్ధి మరలఁ గలిగెను. చేసిన పని తప్పా యొప్పా యని మనస్సు సందేహించును. దానిని నిర్మలబుద్ధి యించుచున్నది.

ఉ. కాంచితి రావణాసురుని • కాంతల నెల్లర నైన నేమి నా
కించుక నైన బుద్ధి చలి • యింపదు; యింద్రియవర్తనంబు సా
గించుఁ గదా మనంబు గనుఁ • గీడున కేనియు మేలు సేఁతకే
నెంచఁగ నట్టి నా మన మ్మె • కింతయుఁ గ్రాలదు సాభిలాషమై.	౩౪౧

తాత్పర్యము.

రావణాసురుని స్త్రీల నందఱను జూచితిని. చూచుటచే వచ్చిన హాని యేమి? నా బుద్ధిఁ గొంచెమైనఁ జలించినది కాదు. పాపకార్యమందో పుణ్యకార్యమందో యింద్రియ వ్యాపారము జరుపునది మనస్సు. చూచినంత మాత్రమున నిలువంత మాత్రమునఁ బుణ్యముగాని, పాపముగాని రాదు. మనసు పాపాభిలాషగల దయ్యెనేని ప్రత్యక్షముగఁ జూచినను జూడకున్నను బాపము వచ్చును. పుణ్యాభిలాష గల దయ్యెనేని పుణ్యము వచ్చును. ఏ యభిలాష లేకున్నవారి కేదియు రాదు. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' యని కలదు గదా. కావున మనో వ్యాపారము ప్రధానము, గాని యింద్రియవ్యాపారము మాత్రము ప్రధానము గాదు. అట్టి నామనస్సు నందు నభిలాష యనునది లేదు. నేను వీరిని గామాసక్తిని జూడను లేదు. చూచిన కారణముచేఁ గామ ముదయింపను లేదు. ఇఁక నాకేమి భయము.

ఉ. ఇన్నెడఁ గాక యిం కెచట • నే వెదకం దగు భూమికన్యకన్ ?
కొయ్యలు లంకఁ గా కెచటఁ • గొయ్యలి యుండఁగ నేర్చుఁ జూడఁగా ?
నెయ్యది జాతి దేని కది • యేర్పడ నంకులఁ గాది గోయ నౌ ;
నెయ్యెడ నష్టకాంత నగు • నె నెమకం జని శంకనుండలన్.	౩౪౨

తాత్పర్యము.

ఈ విచార మేల. ఇది విడిచి మఱియొకచోట వెదుకవలయునా! ఆఁడుది యాఁడువారి యం దుండక మఱి యెందుండఁ గలదు? ఏ జాతి వస్తువును ఆ జాతిలో

వెదకవలయును గాని వేఱొక జాతిలో వెదకిన లాభ మేమి? పోయిన యావును ఆలమందలోఁ గాక మఱి యే పశువుల గుంపులో వెదకిన దొరకును. అట్లే కాన రాని స్త్రీ స్త్రీల గుంపులోఁ గాక యింకెందులో వెదకవచ్చును? కావునఁ గర్తవ్య మును జేయవలయును, మానరాదు. నిష్కాముఁడనై చేయవలయును. అది యకార్య మైనను పాపము రాదు. శ్రీకృష్ణభగవానుఁడు అర్జునున కుపదేశించిన దాని సారాంశ మిదియే. అకార్యమో సుకార్యమో చేయవలసివచ్చినప్పుడు చేయవలయును. నిష్కా ముఁడై చేయవలయునుగాని కర్మము స్వరూపత్యాగము చేసెద ననరాదు. పరస్త్రీ దర్శనము పాప మను సామాన్యశాస్త్రవిధి ననుసరించి హనుమంతుఁడు సీతాన్వేషణ కార్యము చాలించియుండిన నేది యెట్లు యుండునో యూహింపవచ్చును. కావునఁ గామము త్యాజ్యము గాని కర్మము త్యాజ్యము గాదు.

క. శుద్ధం బగు మనమున నే, శుద్ధాంతం బెల్ల వెదకి • చూచితి నధిక
శ్రద్ధను నెచ్చటఁ గానను, నద్ధారిణి తనయ నను చు • నారయు మఱియున్. ౩౪౩

అర్థములు. అద్ధారిణి తనయ – అద్ధారిణీ, ఇబ్బంగి యని రూపము రాదు. కావలయు నని కొందఱు సందేహించిరి గాని యీ విషయము తొలుత సులభవ్యాకర ణము పరిష్కరించెను. తరువాతఁ బండితులు దానికే తమ వ్యాఖ్యానాదుల నామోదించిరి. చూ. సు. వ్యా. సమాస. ౩౬. సూ.

తాత్పర్యము.

నేను నిష్కల్మషమైన మనస్సుతో నంతఃపురమంతయు మిగుల శ్రద్ధతో వెదకి తిని. సీతాదేవి యెచ్చటను గానరాలేదు, అనుకొని మఱియు హనుమంతుఁడు,

తే. నాగకన్యల యందును • నాకకన్యలందు గంధర్వకన్యల • యందు వెదకెఁ
గాని కానక సీతఁ ద • త్పానశాల, విడిచి యంతఃపురంబున • వెదకె మరల. ౩౪౪

తాత్పర్యము.

నాగకన్యక లందును, దేవతాస్త్రీలయందును, గంధర్వ స్త్రీల యందును మరల వెదకెఁ గాని సీత గానరాలేదు. కావున నా పానశాల విడిచి మరల నంతఃపురంబున వెదకెను.

—• ౧౨-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవిని గానక విచారపడుట. •—

క. ఆ యంతఃపురమున నడుమ ల, తాయతనంబుల విచిత్ర • తాయతనములన్
వాయుతనూజుండు వెదకియు, మాయురె! కనఁ డయ్యె రాము • మహిళామణినిన్,

అర్థములు. లతాయతనంబులన్ = తీఁగల యిండ్లయందును, విచిత్రతాయతన ములన్ = చిత్రముల నలంకరింపఁబడిన యిండ్లయందును, మాయురే = ఆశ్చర్యార్థ కము.

తాత్పర్యము.

ఆ యంతఃపురము నడుమ తీఁగలచే నేర్పఱుపఁబడిన యిండ్లయందును, చిత్ర

తాత్పర్యము.

సీతను జూడలేక యిూమాపు చెప్పిన పౌరుష వాక్యముల నెల్ల నెఱవేర్పక సుగ్రీవుఁడు పెట్టిన గడువుమీఱి యాయనను జూచుటకు నేను ధర్మము నతిక్రమించి పోదునా? పోయితినిలో యతఁడు బలవంతుఁడు; తనయాజ్ఞ మీఱి వర్తించిన వారిని దండింపక విడుచునా?

క. చూచితి నంతిపురంబును, జూచితి దశకంఠు సకల • సుందరులను నీ
తా చపలాక్షిని గాన, నే నోలను నీను శ్రమము • వృథ వోయెఁ గదే. ౩౪౦

తాత్పర్యము.

అంతఃపురమును జూచితిని. రావణాసురుని స్త్రీల నందఱఁ జూచితిని. ఎక్కడను సీతాదేవి కానరాలేదు. నేను చేయవలసిన కృషియంతయుఁ జేసితిని. శ్రమమంతయు వ్యర్థమయ్యెఁ గదా.

ఉ. ఏమి యొనర్చితో హనుమ! • యేమి నరాసుత! యన్న క్రోఁతు లే
నే మని యుత్తరం బిడుదు • నేఁగి సుగ్రీవు పురంబుఁ జొచ్చి శ్రీ
రాముని దేవిఁ గానక యి • క్రమ్మఱితిన్ వృథ యందు నందునా?
హా! మరణించు వానరచ•యంబులు నే నిటు నాలపించినన్. ౩౪౧

తాత్పర్యము.

వానరుల యెదుట నన్ని పౌరుషములు పలికితిని గదా! ఇప్పుడు నేను మరల పోఁగానే హనుమంతా! యేమి చేసి వచ్చితివి? సీతను దెచ్చెద నంటివే. ఏది సీత యని క్రోఁతులందఱు అడిగిన నే నేమని ప్రత్యుత్తర మిత్తును. పోయితిని, లంకలో వెదకితిని, కానరాలేదు, పోయినవాఁడను పోయినట్లు మరలి వచ్చితి నందునా! ఎట్లందును! కావున నేను పోను. ఇందే యుందును. ఇంక నెంతకాల మని యుందును! నేను ఆలస్యము చేసితినా? హనుమంతుఁడు రావణుచే హతుఁడయ్యెనో మఱి యేమయ్యెనో, కావుననే రాలేదు. మనము బ్రతికి లాభ మేమి? సుగ్రీవుని చేతిలోఁ జచ్చుటకు కంటె ప్రాయోపవేశమున నిందే మరణింత మని యందఱు నిశ్చయముగఁ జత్తురు.

ఉ. ఆవలియొడ్డు చేరఁ గపు • లందఱు గుంపుగఁ గూడి జానకీ
దేవిని గాన నైతి నన • దెల్పుచు నా వచనంబు భంగిఁ దా
వారికి దెచ్చినట్టి గుణ•వంతుఁడు వృద్ధుఁడు జాంబవంతుఁడున్
శ్రీవిభవుండు నంగదుఁ డి•కే యనరే ప్లవగాగ్రగణ్యులున్. ౩౪౨

తాత్పర్యము.

కావున నే నిచ్చటఁ బడియుండను. మరలి పోవలసినదే పోయితినిలో—అందఱు వానరులు గుంపులై వచ్చి జానకీదేవిని నేను జూడలేదు అని చెప్పఁగానే నేను బుట్టిన

విధముగా అప్పుడు నేను చేసిన కార్యము శ్లాఘించి శ్లాఘించి చెప్పిన గుణవంతుండు పెద్దవాండు నగు జాంబవంతుండు అంగదుండు ఇంకను వానర ముఖ్యులు ఛీ ఛీ యనరా.

—• హనుమ యుత్సాహంబు వహించి మరల సీతాదేవిని వెదకుట. •—

శా. ఉత్సాహంబె సిరిన్ ఘటించు మఱి యా•యుత్సాహమే సౌఖ్య మా
నుత్సాహంబె సతంబు నెల్ల కెలసం • బొప్పారంగాం దీర్చు నా
యుత్సాహంబునె యాశ్రయించి పనికై • యుంకింతు నింకొక్కమా
టుత్సాహంబుం ద్యజింతురే పనికి ను•ద్యోగించు ధీరాత్మకుల్. ౩౫౩

అర్థములు. కెలసము = కార్యము, ఉంకింతున్ = ప్రయత్నింతును. త్యజింతురే = వదలుదురా. ధీరాత్మకుల్ = ధైర్యవంతులు.

తాత్పర్యము.

కావున నే నిందుండను రాదు. వ్యర్థుండనై పోనురాదు. ఈ విధముగ నే నధైర్య పడనురాదు. కార్యమెట్టులైన సాధింపవలెను. కార్యసాధనమునం దుత్సాహము ప్రథమ సాధనము. దానిని విడిచి నే నేమి చేయంగలను. సంపద సంపాదించి యిచ్చునది యుత్సాహమే. ఉత్సాహమే సౌఖ్యము. ఆ యుత్సాహమే సకల కార్యముల నెఱవేర్చును. కావున నా యుత్సాహము నాశ్రయించి మఱియొకసారి ప్రయత్నించెదను. కార్యము చేయు ధీరు లుత్సాహమును వదలుదురా.

"క్లైబ్యం మా స్మగమః పార్థ, నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం, త్యక్త్వోత్తిష్ఠ పరంతప."

అను భగవద్వాక్యము స్మరించునది.

ఉ. చక్కంగం జూతు నెండి యొక•సారి సురారిసురక్షితంబు లౌ
నిక్కవ లెల్లం బానగృహ•మేడ్తెఱం జిత్రగృహాళి తోంటలున్
జక్కని కేళిశాలలును • సందులు వీథులు నవ్విమానముల్
దక్కక యుండ నొక్కటియుం • దత్పరవృత్తి వటందు నెంచుచున్. ౩౫౪

అర్థములు. ఇక్కవలు=ప్రదేశములు.

తాత్పర్యము.

రావణాసురుండు రక్షించు ప్రదేశము లన్నియు మఱియొకసారి చూచెదను. అని పానగృహములు చిత్రగృహములు తోంటలు కేళిశాలలును సందులు వీథులు విమానములు నన్నియు నొక్కటినైన విడువక వదిరే పనిగా వెదకెదను అని యాలోచించుచు;

చం. వెదకుటకుం గదంగెం బృథి•వీగృహవర్గము చైత్యగేహముల్
సదనసమీపకేళివన•శాలలు నొండొకచోట నెక్క వే
ఱుదలల డిగ్గం దాం బలుమ•ఱుం జనుచోటికె పోవు ద్వారముల్
వదలిచి దల్పులుం దెఱచి • వచ్చును బోవును నెక్క దూంకెడిన్. ౩౫౫

అర్థములు. పృథివీ గృహవర్గము = భూమిలోనుండు నిండ్ల సమూహము, నేల మాళిగలు, చైత్యగేహములు=నాలుగు వీథులు కలియుచోట నుండు నిండ్లు - సదన సమీపకేళి వనశాలలు = రావణు నింటికి సమీపమున నుండు నాటపట్టులు.

తాత్పర్యము.

వెదుకఁ బ్రారంభించెను. నేలమాళిగలు, నాలుగు వీథులు కలియుచోట నుండు మందిరములు, రావణుని యింటి సమీపమున నుండు నాటపట్టులు - చూడ నారంభించి యొకచోట నెక్కును, ఒకచోట దిగును, పోయినచోటికే పోవును, వాకిండ్లు గడియలు దీసి తలుపులు తెఱచి వచ్చును, పోవును, నెక్కును, చూచును.

తే. కొంచెమైనను విడక శో।ధించె హనుమ, రావణాసురు నంతిపు।రంబునందు
నాలుగంగుళముల యేని । గాలిడుటకు, నొచ్చి చూడని దేశ మ।చ్చోట లేదు.

తాత్పర్యము.

ఈప్రకారము వదలక రావణుని యంతఃపుర మంతయు శోధించెను. ఆ యంతఃపురమున హనుమంతుఁడు చొచ్చి చూడని ప్రదేశము నాలు గంగుళముల మాత్రమైనను లేదు.

సీ. ప్రాకారములు నడి।బాటలు వేదికల్, దిగుడుబావులు సర।స్తీరములును
వివిధవికారరూ।పవిశేషలను సోఁకుఁ, జెలువలఁ గనె నందు । సీత లేదు
అసమానసౌందర్య । లసమానవిద్యాధ, రీతతు లందు శ్రీ।సీత లేదు
పూర్ణచంద్రాస్యలౌ।భోగినులం దంత, గత్తెలలోన భూ।కన్య లేదు
తే. పంక్తికంఠుఁడు బలిమిని । బట్టి వట్టి, నాగకన్యలలోన జా।నకియు లేదు
సుందరుల నటఁ బెక్కురఁ । జూచెఁగాని, కమలలోచన మైథిలి । గాన రాదు. ౨౦-౨౪

అర్థములు. సరస్+తీరములు = కొలఁకులయొడ్డులు, సోఁకుచెలువలన్ = రాక్షసస్త్రీలను.

తాత్పర్యము.

ప్రాకారములు, ఇండ్లకు నిండ్లకు నడుమ నుండు వీథులు, అరుఁగులు, దిగుడుబావులు, కొలఁకుల యొడ్డులు, నానావిధ వికారవేషములు గల రాక్షసస్త్రీలను జూచెఁగాని యందెందును సీత లేదు. అసమానమైన చక్కఁదనముచేఁ బ్రకాశించు విద్యాధరస్త్రీలను జూచెఁగాని, వారియందు సీత లేదు. నిండుపున్నమనాఁటి చంద్రుని వంటి ముఖములు గల భోగినీస్త్రీల యందు దండిగత్తెలలో సీత లేదు. రావణుఁడు బలాత్కారముగాఁ బట్టి తెచ్చిన నాగకన్యక లందు సీతమాత్రమే లేదు. అందు సుందరుల నెందఱనో మరున్నందనుఁడు చూచెఁగాని భూనందన గానరాలేదు. ఇందుఁ జెప్పఁబడినవారు మునుపు చెప్పబడిన రావణున కనుకూల లగు స్త్రీలు గారు. బలాత్కారముగఁ దెచ్చి, వారు వశపడువఱకు నందఱ వేఱొకచో వేసియుంచె నని యేర్పడుచున్నది. రెండవపాదమునఁ జెప్పఁబడినవారు కావలియుండు స్త్రీలు.

క. జనకజ మైథిలి రాముని, వనిత విదేహభవ సీత • వశమతి దుష్టున్
దనుజున్ మనుజాశను నే,మనుచుం బ్రాపించు నట్టి • యాగడ మున్నే. ౩౬౨

అర్థములు. జనకజ = జనకరాజకూఁతురు, 'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః' యన్నట్లు సదాచారసంపన్నులలో నుత్తములైన వానికూఁతురు. కులముఁ బట్టి గుణములు. అట్టివాని కూఁతురు రావణునకు లోబడునా? మైథిలి = ఆయన యొకఁడే కాదు 'యథా రాజా తథా ప్రజా' యన్నట్టులా దేశము వారందఱు నట్టివారే. అట్టి మిథిలయందుఁ బుట్టినది. అట్టి సదాచార సంపన్నులుండెడి చోట దుష్టస్త్రీ పుట్టునా?

పుట్టిన యింటి సమాచార మిట్లుండ మెట్టిన యింట రామునివనిత. ధర్మ విగ్రహమగు రామచంద్రుని భార్య. గుణవత్సంబంధముచేతఁ బరుసవేదిచే నినుము బంగారమైనట్లు చెడువారు కూడ మంచివారగు చుండ బంగారు చెడునా? విదేహభవ=విదేహులు = దేహాభిమానము లేనివారు, బ్రహ్మజ్ఞాన పరాయణులు. అట్టి దేశము విదేహదేశము. అట్టి దేశ మందుఁ బుట్టిన సీత, తుచ్ఛమైన దేహసౌఖ్యము నకై చేయరాని పని చేయునా? సీత = అందు మనుష్యస్త్రీలు పుట్టినట్లు పుట్టినది కాదు. అయోనిజ - కావుననే అమానవి - అట్టిది యకార్యము చేయఁబూను కొనునా? వశమతి=తన మనస్సును తన స్వాధీన మందుంచుకొనలేక - దుష్టున్ = దోషకార్యములే చేయువానిని, దనుజన్ = రాక్షసుని, మనుజాశనున్ = మనుష్యులను జంపి తినువానిని, దుష్టు ననుటచే దుష్టస్వభావము- దనుజన్- అనుటచే దుష్ట జాతి - మనుజాశనుని అనుటచే క్రియయుఁ, జెడ్డది. మనుష్య స్త్రీ మనుష్యులఁ దిను వానిని గామించునా? ఆగడము = విపరీతవర్తనము, ఉన్నే = ఉండునా? - ఉండదు.

తాత్పర్యము.

రావణాసురునకు వశపడుటచే నాఁడాకెను వీరిలోఁ గలుపక మఱియొండైన నుంచినాఁ డనుకొందునా? ఛీ ఛీ యది హేయపు టాలోచన. జనకరాజ కూఁతురు, మిథిలయందుఁ బుట్టినది, రాముని భార్య, విదేహసంబంధముగలది, భూమియందుఁ బుట్టినది, సీత యను పేరు గలది, కామవశురాలై గుణమున దుష్టుఁడు, జాతిచే నీచుఁడైన దనుజుఁడు, క్రియలచేఁ గ్రూరుఁడై మనుష్యులఁ దినువాఁడు నగు వాని నేమని కామించును? అట్టి విపరీతముకూడ నుండునా? ఎప్పటికి నుండదు.

క. సీతఁ గొని రామమార్గణ, భీతి న్వడి నెగురు నసుర•నీరుఁడు నీకే
జాతాశ్రయు నని క్రోవను, భీతిం బడిపోను నోటు • భీరువు గానన్. ౩౬౩

అర్థములు. మార్గణ = బాణములవలన, భీతిన్ = భయమున, భీరువు = పిఱికిది.

క. కొడుకులమరణము విని వగఁ,బడి కౌసల్యయు సుమిత్ర • భరతుజననియున్
వినుతగుని వెంటనె ప్రాణముఁ, బడయుని జీవింప నెట్లు • బుద్ధియుఁ బుట్టున్. ౩౨౪

తాత్పర్యము.

కొడుకులచావు విన్నంతమాత్రముననే కౌసల్య సుమిత్ర కైకేయియుఁ జత్తురు. వారు కొడుకులఁ బోఁగొట్టుకొనియు బ్రదుక నెట్లు బుద్ధి పుట్టును ?

క. కృత మెఱుఁగునః సత్యముఁ దన,మతిఁ బాయఁడు కపివిభుండు•మార్తండజుఁడున్
క్షితిపతియావల్లభుఁ డా,గతిఁ బట్టుఁ జూచి తాను • గాలముఁ జెందున్. ౩౨౫

తాత్పర్యము.

పనులు తనకుఁ జేసినమేలు మఱువనివాఁడు, చెప్పినమాట తప్పనివాఁడు నగు సుగ్రీవుఁడు రామచంద్రుని గతిఁజూచి తాను మరణించును.

క. శోకోపహతయు భృశదుః, ఖాకులిత యపాస్తనిర్భ•రానందమహా
శోకాకుల యయి రుమ పతి, శోకంబున మేను విడఁగఁ • జూడక యున్నే. ౩౨౬

అర్థములు. శోకోపహత = మగఁడు చచ్చిన శోకముచేఁ గొట్టఁబడినది, భృశదుఃఖాకులిత = మిగుల దుఃఖముచేఁ గలఁత నొందిన మనస్సు గలది, అపాస్త = పోయిన, నిర్భర = అధికమైన, ఆనంద = సంతోషము కలిగినది.

తాత్పర్యము.

మగఁడు చచ్చిన శోకదుఃఖములచేఁ గలఁత పడిన మనస్సు గల రుమాదేవి దేహము వదలు నాలోచన చేయకయుండునా !

తే. వాలి మరణంబునకె కమ•వగఁ గృశించు, తార సుగ్రీవుగతిఁ జూచి • తా నశించుఁ
దల్లియును దండ్రియును బిన్న•తండ్రిచావఁ,జూచి యంగదుఁ డేటికిఁ • బ్రోచు మేను.

తాత్పర్యము.

వాలి చచ్చినాఁడని యేడ్చు తార సుగ్రీవుఁడుకూడఁ జచ్చుట చూచి తాను నశించును. తలిదండ్రు లిద్దఱు మరణించుట చూచి యంగదుఁడు నశించును.

చం. వనచరవీరు లెల్ల నిజ•వల్లభసంస్థితి దుఃఖితవృత్తులై
ఘనతరముష్టిగాఢతల•ఘాతములన్ నిహతోత్తమాంగులై
చనఁ జిరసాంత్వనాదృతులు • చస్తు దరణ్యచరుల్ సమృద్ధతల్
వనచరు లార్తిఁ గూరి భృగు•పాత మొనర్చి నిజప్రియాళితోన్. ౩౨౭

అర్థములు. నిజవల్లభ సంస్థితిన్ = తమ ప్రభువు మరణించుటచే, ముష్టిఘాతములన్ = పిడికిళ్ళ గ్రుద్దులచే, తలఘాతములన్ = అఱచేతి దెబ్బలచే, నిహతోత్తమాంగులై = పగులఁ గొట్టఁబడిన శిరస్సులు గలవారై, చిర = దీర్ఘకాలము, సాంత్వన = మంచిమాటలచే, ఆదృతులు = ఆదరింపఁబడినవారు, అరణ్యచరుల్ = అరణ్యమం దుండువారు, భృగుపాతము = కొండమీఁదనుండి క్రిందఁ బడుట, నిజప్రియా+ఆళితోన్ = తమ ప్రియురాండ్రతో.

తా త్ప ర్య ము.

కిష్కింధ యందుండు ముఖ్యవానరు లందఱు తమ రాజు చచ్చినాఁడన్న వార్త వినినంతమాత్రముననే దుఃఖముచేఁ దహించినవారై గట్టిపిడికిళ్ళచేతను దృఢమైన యఱచేతి దెబ్బలచేతను దమ తలలు పగులఁగొట్టుకొని మరణింపఁగా పరిగ్యమందుఁ జిర కాలముగ మంచిమాటలచే నాదరింపఁబడుచుండినవారు ఇఁకఁ దమ్ము నాదరించు వారు లేమిని కొడుకులతోను భ్రియురాండ్రతోను గొండల మీఁదనుండి క్రిందఁ బడి మరణింతురు.

క. శైలంబుల వివిధవనీ, జాలంబులఁ గీశవరులు • సంఘము లగుచున్
  హేళిఁ జరింపరు తమి వాహ్యాళిం గ్రీడలను దుఃఖ•తాత్మకు లగుచున్. ౩౭

అర్థములు. శైలంబులన్ = పర్వతములందును, వివిధ వనీ జాలంబులన్ = నానావిధములయిన యడవుల గుంపులందును, కీశవరులు = వానరశ్రేష్ఠులు, కీశ = 'కః' యనఁగా వాయువు. అయన కుమారుఁడు 'కి' యనఁగా హనుమంతుఁడు. ఆయనను ముఖ్యుఁడు గాఁగలవారు కీశులు, గురుబాలప్రబోధినియం దిట్లువ్యుత్పత్తి వ్రాయఁబడెను గాని కీన్, కీన్ అనువారు గనుక కీసులయిరేమో యని తోఁచు చున్నది. వాహ్యాళి = వినోద సంచారము, తద్భవము వయ్యాళి.

తా త్ప ర్య ము.

అట్లు చావఁగా మిగిలిన క్రోఁతులు కొండలందు నడవులందు గుంపులై దుఃఖముచే మునుపటివలె విలాసముగా సంచరింపరు.

క. ఉరిపోఁతలఁ జెనుమంటలఁ, బరువవిషంబులను నిట్టు•పాసంబులచే
  మరణింతు రొండె నుసుఁలులు, తరవారుల నుఱికి కొంఱదెఁ • దలఁగుదురు కపుల్.

అర్థములు. నిట్టుపాసంబులు = శుష్కోపవాసములు, తరవారులు=కత్తులు, 'తరవారి క్మండలాగ్రః ఖడ్గః కౌక్షేయక స్సకూటః' యనాదవ.

తా త్ప ర్య ము.

కొంద ఱురిపోసికొని చత్తురు. కొందఱు మంటలలో దూఁకి చత్తురు. కొందఱు విషముద్రావి చత్తురు. కొందఱు కత్తులపైఁబడి ప్రాణములు విడుతురు.

సీ. కిష్కింధ కిప్పు డే•గితి నేని మొత్యోన, హా యను నేడుపు•టులివు వినఁగఁ
  బడు నంతే, యిక్ష్వాకు•వంశనాశంబును, గపికులనాశంబుఁ • గలుగు నిజము
  కావునఁ గిష్కింధ•కడకు నే నిట నుండి, చన నుంచుటదె మా•ద • సమ్మతంబు
  చూడు నే నెట్టులు • సుగ్రీవుముఖమును, జానకిపోఁబడెఁ • గాన లేక

తే. నేను బోకుంటి నేని వ•నేచరులును, దాశరథులును బ్రాణముల్ • దాల్చువార
  లాశచే నైనఁ గొన్నాళ్ళు•లట్టుగాన, నలకఁ బోకుండుటే మేల•టంచుఁదోఁచె.

అర్థములు. ఏడుపు + ఉలివు = ఏడుపుటులివు=ఏడుపుధ్వని.

## తాత్పర్యము.

ఇప్పుడు నేను కిష్కింధకుఁ బోయినచో సొమ్కటిఁ జూచితిని సీతను ధ్వనులే వినవచ్చును. అంతమాత్రమే ప్రయోజనము. ఏల? ఇక్ష్వాకు వంశనాశంబు, వానర కులనాశము తప్పక కలుగును. కావున నిచ్చటనుండి కిష్కింధకుఁ బోకుండుటే సమ్మతమైన కార్యము. జానకి జాడఁ దెలిసికొనలేక పోయి సుగ్రీవు ముఖ మేమని చూతును, అంత సిగ్గు విడిచియు బ్రతికి యుండనా? కావున నేను పోకుండినచో నేను మరలు దినకను వచ్చును, రేపు వచ్చును, ఎల్లుండి వచ్చును, అను నాశచే నింకను కొన్ని నాళ్ళైన జీవించి యుందురు. కాఁబట్టి నేను బోకుండుటే మేలు.

హనుమంతుఁడు సీతాదేవిని జూడకయే యుండెనేని యెంత కీడు మూడి యుండునో చూచుటచే నెంత కీడు తొలఁగెనో పాఠకు లూహింపవచ్చును. అయినను నొక సందేహము. ఇంత కీడు సీత కానరాలే దనఁగానే రాముఁడు మరణించు నను నూహమీఁద నాధారపడియున్నది. అయిన సీతావియోగముచే మరణించినచో నింత యనర్థము సంభవించును గాని యాయన జీవించి యుండిన నింత యనర్థము పొసఁగదు. భార్య కానరాలే దనఁగానే రామచంద్రమూర్తి ప్రాణము విడుచునా? సీతాదేవి రెండవసారి శపథము చేసి భూమిలోనికిఁ బోయిన తరువాత రామచంద్రమూర్తి మరణించెనా? అవల నెన్నియో వేల్ల సంవత్సరములు బ్రతికియుండెఁ గదా. కావున రామచంద్రమూర్తి సీతకై ప్రాణము విడుచు నను నూహ సరియైనది కాదు. కావున నీ యూహాపరంపర నిరాధారము. సమాధానము రెండవసారి సీతావియోగము స్వబుద్ధిపూర్వకముగఁ జేసిన కార్యము. అందు దుఃఖ మధికముండి యుండదు. భార్య మరణించిన దుఃఖమువాఁడు తాను సన్న్యాసియై భార్యను వదలెనేని యేమనఁడు. అబుద్ధిపూర్వకముగ నొక రూపాయ పోఁగొట్టుకొనినవాఁడు దేవుడు లాగినట్లు బుద్ధిపూర్వకముగ వంద రూపాయలు దానముచేసిన వాఁ డేమనఁడు. కావున రెండవసారి సీతావియోగమున రామచంద్రమూర్తికి వ్యసనము తక్కువ. ఇంత తీవ్రవ్యసనము లేదు. సీతాదేవి భూమిలోఁ బ్రవేశించుటకు ముందు పండ్రెండు సంవత్సరముల నాఁడే భార్యాభర్తృవియోగము సంభవించెను. ఇన్ని సంవత్సరముల వియోగము ననుభవించిన వాని మనస్సున శోక మెంతమాత్ర ముండఁగలదు. వాల్మీకి రామాయణము వ్రాయుచుండిన నాఁడె యావజ్జీవ మట్లుండవలసినదే కదా. వియోగ మట్టిదైన నేమి? స్వల్పమైన నేమి? వియోగము వియోగమే. ఇప్పటిస్థితి యట్టిది కాదు. కావున హనుమంతుని యూహ తప్పన రాదు.

మఱియొక విధముగ నాలోచింతము. హనుమంతుఁడు సీతను గానక మరలి పోయి వానరులకీ వార్త చెప్పఁగానే వానరు లందఱు సుగ్రీవు భయమున ప్రాయోపవేశము చేసియుందురు. హనుమంతుఁడు మాత్రము బ్రహ్మ వరబలమున జీవించి యుండి కిష్కింధకుఁ బోయి యావార్త చెప్పియుండవలసి వచ్చును అప్పు డెంతటి.

యుల్లకల్లోలము పుట్టియుండునో. అటుగాక వారు లూరకపోయినా రాజాజ్ఞ మీరితిన వారని పిరికిపందల సుగ్రీవుఁడు దండింపఁ బూనిన నెంత యనర్థము పుట్టియుండునో ! ఇక్కడ సీత యేమై యుండునో? ఇవన్నియు హనుమంతుఁ డాలోచించిన విషయములే. ఈ కారణముచేత నేను యనర్థకారి యగుటకంటెఁ జావుటయే మే లని తీర్మానించుకొనెను. ఇట్లు తీర్మానించుకొని తనువాతఁ జేయవలసిన కార్య మాలోచించుచున్నాఁడు.

—• హనుమంతుఁడు ప్రాణత్యాగముఁ జేయ నాలోచించుట. •—

శా. ఏ నిందుం గన నైతి జేని మిథిలా•ధీశాత్మజాతం గరా
దానుండన్ నియతవ్రతంబుగ ముఖా•దానుండ నై యుండి యొం
డేనిన్ భూరుహమూలవాసి నయి జీ•వేచ్ఛన్ విసర్జించుచున్
వానప్రస్థుఁడ నై చరించుటయె భ•వ్యం బైన మార్గం బగున్. ౩౮౨

అర్థములు. కరాదానుండనై = చేతిలోఁబడిన దానిని దినువాఁడను, ముఖాదానుండను = నోటిలోఁబడిన దానిని దినువాఁడను, భూరుహమూలవాసిని = చెట్టుక్రిందఁ బడియుండువాఁడను, జీవేచ్ఛన్ = బ్రతుకునందలి కోరికను.

తాత్పర్యము.

నేను మరలిపోను. ఇచటనే యెందో యుండెదను. ఉండి చేయవలసిన దేమి? ఇం దుండి సీతాదేవిని కనుఁగొనలేక పోయితినా యొక చెట్టుక్రింద బ్రతుకు మీఁది యాశ వదలి నోటిలో పెట్టుకొనియో కొని తెచ్చికొనియో కూర్చుందును. చేతిలోఁ బడినదో నోటిలోఁ బడినదో కాయో పండో తిందును. పడకుండిన నూరకుందును. ఈ విధముగ వానప్రస్థుఁడనై యుండుటే శ్రేయస్కరమైన మార్గము.

క. మెండగు ఫలమూలంబులు, హెచ్చగు జలనిధితటంబు • నే జేరి యటన్
చిచ్చుతికేరఁ జితి పేర్చి, చచ్చుట మేల్ సీతఁ గనక • చనుకంటె నిటన్. ౩౮౩

తాత్పర్యము.

ఫలములు, మూలములు విశేషముగ నుండు సముద్రతీరమునఁ జేరి యచ్చటఁ జితి పేర్చి దానిలో నూఁకి చచ్చుట మేలుగాని సీతను జూడక మరలిపోవుట మేలుగాదు.

చిచ్చు + ఉతికేర్ = ప్రత్యమ్యర్థమునఁ బ్రయోగము. చనుకంటెన్ = చనుట కంటె, భావార్థక ట వర్ణలోపము.

క. అంగములు వ్యాఘ్రకాకపతంగంబులు దినఁగ నుండఁ • గలుగక తృణిపై
జంగ మరణోపవిష్టతఁ, లింగిని సాధించువాఁడ • లీలఁ గ నిచటన్. ౩౮౪

అర్థములు. వ్యాఘ్రకాకపతంగంబులు=పులులు, కాకులు లోనగు పక్షులు, మరణోపవిష్టత = మరణము నిమిత్తమై కూర్చుండుట, లింగిని = లింగ మనఁగా సన్న్యాసము=నిరాహారము అది కలది లింగిని. అనఁగా నిరశన వ్రతము, లీలగన్ = అవలీలగ.

తా త్ప ర్య ము.

నేను చేయఁదగిన దేదియు నాకుఁ గానరాలేదు. కావున వ్రతము పూని చెట్టు మొదళ్ళఁబడి యుందును. అటుగాక బుద్ధిలేని వాఁడనై పోయితినా యంగదుఁడు మొదలగు వానరులు బ్రదుకఁజాలరు.

ఆ. ప్రాణములను విడువ • బహుదోషములు గల్గు
బ్రదికి యున్నఁ గాదె • పడయు శుభముఁ
గానఁ దాల్చువాఁడ • మేనఁ బ్రాణంబులు
బ్రదికి యున్న భద్ర • మొదవు నిజము.

తా త్ప ర్య ము.

ఆహారము లేక దేహము విడిచెద ననుకో, చచ్చి సాధించునది యే మున్నది ? ప్రాణములను వదలితినా పెక్కుదోషములు గలవు. బ్రదికియుండినఁగదా మే లనుభ వింప వచ్చును. చచ్చిన తరువాత మే లేమి గలదు. కావునఁ బ్రాణముల విడువరాదు. బ్రదికి యుండిననే శుభము గలదు.

'జీవితం మరణా చ్ఛ్రేయో జీవన్ ధర్మ మవాప్నుయాత్.' (భారత. విశ్వామిత్ర చండాల సంవాదము)

శరీరం ధర్మసర్వస్వం, రక్షణీయం ప్రయత్నతః
శరీరాత్ స్రవతే ధర్మః, పర్వతా త్సలిలం యథా. శంఖుఁడు.
• బ్రదికియుండిన శుభములు బడయువచ్చు. భార.
'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' కాళిదాసుఁడు.

ఈ కారణముచేఁ దానై దేహము విడువ రాదు. ధర్మార్జనము కొఱకై జీవింపఁగోరవలయును గాని కామార్థములకై కాదు.

చ. అని యిటు మాటిమాటికి దు•రంతపుఁజింతలఁ జిక్కి దుఃఖసీ
రనిధికి వేల గాన కెదఁ • గ్రమ్మెడు యోజనసేయు, ధారిణీ
తనయ యొకైన నొత, యింక • దానవనాథునిఁ బట్టి త్రుంతునా ?
దనుజుని దుష్కృతంబునకుఁ • దద్దయు నయ్యది పాచితం బగున్. ౩౯

అర్థములు. దురంతపు = అంతములేని, వేల = చెలియలికట్ట, పాచితంబు = ప్రాయశ్చిత్తము.

తా త్ప ర్య ము.

అని యీ ప్రకారము పలుమా ఱాలోచించి యంతములేని చింతలలో లోనై దుఃఖసముద్రమునకుఁ దీరము గనలేక బ్రతికి నే నేమి చేయవలయును అని మరల నాలోచించి సీత బ్రికుకనీ చావనీ - ఇందుండనీ - లేక పోనీ - ఆమె యెట్టైనఁగానీ ముందు రావణాసురునిఁ బట్టుకొని చావఁ దన్నుదునా ? వీలన వాఁడు చేసిన పాప కార్యమునకు నదియే ప్రాయశ్చిత్తము.

తాత్పర్యము.

ఆహారనియమము, ఇంద్రియవ్యాపార నియమము గలవాఁడనై యుండే యుంటి నను. నేను వ్యర్థుఁడనై పోనేలి? సుగుణ సంపన్ను లగు రామలక్ష్మణులు హానరులు చావనేలి?

—• హనుమంతుఁ డశోకవనంబును జూచుట. •—

కం. అదిగో మహాద్రుమాన్వితే, మది యొక్క యశోకవాటి•యం దిందనుక నెదకంగ లేదు సీతను, వెదకెదఁ గా కందు నేల • విఘువఁగ వలయున్. ౫౪

అర్థములు. మహాద్రుమాన్వితము = పెద్దచెట్లతోఁ గూడినది. అదిగో = దూరమునందుఁ గానవచ్చుచున్నదని భావము.

తాత్పర్యము.

ప్రాకారము మీఁద నుండు హనుమంతుఁడు నలువంకలు పాఱఁజూచి యదిగో నచటఁ బెద్దచెట్లుగల యశోకవన మొకటి గానవచ్చుచున్నది. దానియందు నిందనుక వెదకలేను. అక్కడఁగూడ వెదకెదను. ఏల విఘువవలయును?

క. మ్రొక్కెద వసురుద్రులకును, మ్రొక్కెద నాదిత్యులకును • మొగి మరుతులకున్ మ్రొక్కెద నశ్వులకు నేఁ, గ్రక్కున నెద శోకకండ•గరుడం బెల్లన్. ౫౫

అర్థములు. శోకకండ=ఘాతుకునియొక్క — కండగరుడంబు = బలముగలవాఁడ నను గ్రుపము. రాము కార్యమందుఁ దనకుఁ దోడుపడుటకై దేవతలఁ బ్రార్థించు చున్నాఁడు. ఏలన వారును రామకార్యమునందు రామక్షేమ మందు నాసక్తిగల వారే.

కం. రాముఁడు సుఖయగుఁ గావుత
రాముఁడు చిరజీవి యగుచు - రంజిలు గాతన్
రాముఁడు నిరామయుండగు
రామునకును దేహబలము - గ్రాలెడి నెప్పుడున్. అయో. ౨౩

కం. అనివేల్పులు గంధర్వులు
జనములుఁ బన్నగులు రాష్ట్ర - జనపదములఁ బ
ట్టనములఁ బర దేశంబుల
మనసీమను గోరుచుంద్రు - మహీపా! సతమున్. ౨౪

ఉ. రాముని మేలు కోరి నగ•రంబున రాష్ట్రమునందుఁ బక్కణ
గ్రామములందు నిత్యముఁ • ద్రికాలములందును నెల్లవేల్పులన్
సేమమునన్ భజింపు ధరు•ణీమణులున్ ముదుసళ్ళ స్త్రీలును
గ్రామజనాదినాగరులు • రాముని దప్ప స్మరింప రెవ్వరిన్. ౨౫

ఏకకార్యాసక్తు లగుటచే నొకరి కొకరు సహాయపడుట యొకరి నొకరు సహాయము కోరుట యుక్తమేకదా!

తాత్పర్యము.

వసువులకు, రుద్రులకు, ఆదిత్యులకు, మరుత్తులకు అశ్వులకు నమస్కరించి పోయి రావణుని బలగర్వమును వదలించెదను.

క. మక్కించి రక్కసుల నే, నుక్కున వారెల్లి నేడ్వ • హా యని సీతన్
మక్కువ గల పతిఁ గూర్చెదఁ, జక్కఁగఁ దపసికి ఫలం బొ•సంగెడురీతిన్. ౩౯౭

అర్థములు. మక్కించి = బాధపెట్టి, ఉక్కున = పరాక్రమముచే, ఎల్లి = రేపు.

తాత్పర్యము.

రక్కసుల నందఱను నా పరాక్రమముచే బాధించి వారందఱు హా యని యేడ్చుచుండ సీతాదేవిని నామె ప్రేమగల భర్తతోఁ దపసికి ఫలము నొసంగిన ట్లు కూర్చెదను.

ఈ యుపమానము కార్యసాఫల్యమును సూచించు చున్నది.

క. అని చింతాసందానిత, మనమున నొంటిగ నుపహూర్త•మాత్రము నాలో
చన గొనరిచి యుత్సాహం,బున లేచి మరుత్తనూభ•వుం డిటు పల్కెన్. ౩౯౮

అర్థములు. చింతాసందానితమనమునన్ = ఆలోచనతోఁ గూడిన మనస్సుతో.

తాత్పర్యము.

ఈ ప్రకారము చింతచేఁ గుందిన మనస్సుతోఁ గొంచెముకాల మాలోచించి యా వనమున సీత యుండును, తప్పదు, అని నిశ్చయించుకొని యుత్సాహవంతుఁడై లేచి.

ఉ. మ్రొక్కెద రామచంద్రునకు • మోడ్చెదఁ గేలు సుమిత్రపట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహపత•నూజకు శ్రీరఘురాముదేవికిన్
మ్రొక్కెద ధర్మవాసవము•రుద్గణ మారుత రుద్రపాళికిన్
మ్రొక్కెద సూర్యచంద్రులకు • మ్రొక్కెదఁ దామరసాప్తసూతికిన్. ౩౯౯

అర్థములు. విదేహప = విదేహ రాజ్యపతియొక్క, తనూజకు = సీతాదేవికి.

తాత్పర్యము.

రామచంద్రమూర్తికి నమస్కారము. లక్ష్మణస్వామికి నమస్కారము. విదేహ రాజపుత్రికయు శ్రీరామచంద్రమూర్తి ధర్మపత్ని యగు సీతాదేవికి నమస్కారము. ధర్మరాజునకు ఇంద్రునకు మరుత్తులకు వాయువునకు రుద్రులకు సూర్య చంద్రులకు సుగ్రీవునకు నమస్కరించెదను. హనుమంతుఁడు లంకను జయించుట, యోగి దేహమును జయించుట యని ముందు చెప్పఁబడెను. దేహము వశపడగానే యాత్మావలోకనము లభింపదు. లంకయందు హనుమంతుఁడు వెదుకు వేట లేక 'అన్వేషితవ్యః' అని యుపనిషత్తులు చెప్పినట్లు శోధించి యన్నిఁటిని బరిహరింపవలెను. ఇట్లు శోధించుట

యందు కొన్ని స్థలములందు శోధించు సమయంబున ఆత్మజ్యోతివంటి తేజస్సు గాన వచ్చును. మండోదరిని జూచి సీత యనుకొన్నట్లు ఆ తేజస్సే యాత్మయని భ్రమింప రాదు. సకారణముగ దానిని బరిహరింపవలయును. ఇట్లు మిక్కిలి హెచ్చరికతో నిష్కాముఁడై జితేంద్రియుఁడై వెదకవలయును. ఇట్లు వెదకుటయందు స్వప్రయత్న సాధ్య మను భావ ముండువఱకు ఆత్మ దర్శనము లభింపదు. కావునఁ గార్యసిద్ధికై సీతారామలక్ష్మణులకుఁ దొలుత నమస్కరించి భారము వారిపై వైచి దేహాధిష్ఠిత దేవతలకు మ్రొక్కి కార్య మారంభింపవలెను. దేవతలకు నమస్కరించుట న్యాయమే, సుగ్రీవున కేల నమస్కార మనిన సుగ్రీవు నాశ్రయము కలుగుటచేఁగదా హనుమంతునకు సీతాదర్శనము రామచంద్రమూర్తి దర్శనము లభించెను. కావున నెవరి యాశ్రయమువలనఁ బ్రత్యగాత్మ దర్శనము పరమాత్మ దర్శనము లభించెనో యట్టివారికిఁ గృతజ్ఞుఁడై నమస్కరింపవలెను. కావున ముముక్షువు లగు నే యోగుల కయినను బోషకులు వందనీయులే యగుదురు. సంపాతి రావణు నంతఃపురంబున సీతాదేవియున్నది యని చెప్పెను. హనుమంతుఁ డా మాట యందు శ్రద్ధగలవాఁడై సీతను వెదకినట్లు సాధకుఁడు గురువాక్యమునందు శ్రద్ధగల వాఁడై దేహమునం దాత్మాన్వేషణము చేయవలయును. కానరాకుండుట ప్రయత్న లోపమేకాని యాత్మలేమిని గాదు. కానఁ గానవచ్చువరకు వెదకవలయును. నిరు త్సాహ పడరాదు. సం+పాతి = చక్కఁగాఁ బాలించువాఁడు, గురు వని యర్థము.

చ. అని ప్రణతుల్ ఘటించి దిశ • లన్నియుఁ జూచి యశోకకాననం
బునఁ దనదృష్టి నిల్పి చనఁ బూని మతిన్ మది నెంచు నీగతిన్
వనచరలోకనాథుఁడు ధ్రు•వంబు నిశాచరకోటిరక్షితం
బును బరిసంస్కృతంబుఁ బును•భూరుచిరంబు నశోకవాటికన్.                ౩౯౯

అర్థములు. ప్రణతుల్ = నమస్కారములు.

తాత్పర్యము.

ఈ ప్రకార మందఱకు నమస్కరించి దిక్కు లన్నియుఁ బొఁడఁజూచి యశోక వనమునందుఁ దనదృష్టి నిల్పి హనుమ యిట్లనుకొనెను. ఈ వనమందు సీత యుం డుట నిశ్చయము ఏలన—అనేకులు రాక్షసులు దీనిని గాపాడుచున్నారు. మిగుల సంస్కరింపఁబడి చక్కఁ జేయఁబడి యున్నది. పరిశుద్ధముగా నుంచఁబడి యున్నది. నే నిదివఱకుఁ జూచిన వనముల కంటె నిది మిగుల మనోహరమై యున్నది. ఈ యశోక వనమును,

ఉ. కావలివారు వృక్షములఁ • గాచుచు మిక్కిలి యున్నవార, లం
దా విధుఁ డైన మారుతుఁడు • నల్లన వీచుచు నున్నవాఁడు, సీ
తావిభు నర్థ మై తనువు • దానవసేన కగోచరంబుగా
నావిధి సంగ్రహించి రఘు•వల్లభు వల్లభ నందు శోధెదన్.                ౪౦౦

తాత్పర్యము.

కావలివారు విశేషముగాఁ జెట్లను రక్షించుచున్నారు. ఆ వనమందు సర్వవ్యాపియైన వాయుదేవుఁడు మెల్లగా వీచుచున్నాఁడు. కావున నిందు సీత తప్పక యుండును, రావణునకుఁ గాని రామునకు నట్లు దేహ ఖండితకాంతా సంగ్రహ పతిచే సీతాదేవిని వెదకెదను.

చ. మునులును వేల్పులున్ దివిజ•ముఖ్యుఁడు వజ్రి స్వయంభుఁడు బ్రహ్మవా
య్వనలశశిప్రభాకరజ•లాధిపశర్వమరుత్తు లశ్వులున్
గనులకుఁ దోఁచువారు మఱి • కానని వారును సర్వభూతముల్
ఘనతరభూతినాయకుఁడు • గార్యము సిద్ధి గొనర్తు రెల్లెడన్. ౧౭౦

అర్థములు. అనల = అగ్ని, ప్రభాకర = సూర్యుఁడు, జలాధిప = వరుణుఁడు, శర్వ = రుద్రుఁడు, ఘనతరభూతినాయకుఁడు = వీరి కందఱికంటెను గొప్పవాఁడును, వీరి కందఱకును నాయకుఁడు నైన పరాత్పరుఁడు, భగవంతుఁడు, పరిశేష న్యాయముచే విష్ణువు.

తాత్పర్యము.

మునులును, సామాన్య దేవతలు, వారిలో ముఖ్యుఁడు వజ్రధరుఁడైన యింద్రుఁడు స్వయంభు వగు బ్రహ్మ, వాయువు, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు, మరుత్తులు, అశ్వులు, కన్నులకుఁ గానవచ్చువారు, కానరానివారు సమస్త భూతములు, వీరి కందఱకు నాయకుఁడగు పరాత్పరుఁడు భగవంతుఁడు కార్యము ఫలింప జేయుదురు గాక. తోఁచువారు కానరానివారు అన్నచోట, "యచ్చ కించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా । అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః", అను శ్రుతి యనుసంధించునది. శర్వ శబ్దము ముందు చెప్పఁబడియుండుటచే నిచట భూతనాయకశబ్దము రుద్రపర్యాయము గాదు.

సీ. ఎప్పుడు చూతునో • యే నున్నసంబును, పాండురదంత మ•వ్రణము నగుచు
మందహాసాంకూర•సుందరం బయి పద్మ, పలాశలోచనంబులఁ • జెలువు గాంచి
నిర్మల తారేశ • నిభదర్శనం బగు,నమ్మహాదేవి యా•స్యమ్ము నేను
వేగఁ గాంతునో • హీనుండు క్షుద్రుండుఁ, బరమపాపియుఁ గ్రౌర్య•పరుఁడు నలువ
తే. రాగుణం బయ్యును సువేష•ధారియయిన, యసురపతిచే బలాత్కృతి•నపహరింపఁ
బడిన సాధ్వి తపస్విని • బుధనుతాంగి, రామదేవుని దేవి య•శోకవల్లి. ౧౭౧

అర్థములు. ఉన్నసము = ఉన్నత నాసిక గలది. ఉన్నసము బహువ్రీహి సమాసము. ఉన్నతి నాసిక కలది యేదో యది ఉన్నసము. అచ్ నాసికాయాః సంజ్ఞాయాం నసం చాస్థూలాత్. ఉపసర్గాచ్చ. పాణిని. V, 4-118-119. ఇచ్చట ఉత్ ఉపసర్గ కావున నాసిక నస మాయెను. పాండుర దంతము=తెల్లని దంతములుగలది, అవ్రణము=ఏ కొఱఁతయు లేనిది. మందహాసాంకూర సుందరము=

చిఱునవ్వు మొలకలచే నంద మైనది. పద్మదళలోచనంబులన్=తామర రేకులవంటి కన్నులచే, నిర్మల = మలినములేని, తారకేశనిభ = చంద్రునితో సమానముగ, దర్శనము = కానవచ్చునది, ఆస్యమ్ము=ముఖము.

తా త్ప ర్య ము.

సీతామహాదేవియొక్క యున్నతమైన నాసికయు, తెల్లని దంతములును గలిగి యే లోపమును లేక చిఱునవ్వు మొలకలచే నందమై తామరరేకులవంటి కన్నులు గల కళంకము లేని చంద్రుని వంటి ముఖారవిందమును నే నెప్పుడు చూతునో కదా! గుణహీనుఁడు, నీచుఁడు, పరమపాపి, క్రూరుఁడు, తులువ,నిర్దయుఁడయ్యును సాధువగు సన్న్యాసివేషమును ధరించిన రావణుచే బలాత్కారముగ నపహరింపఁబడిన పతివ్రతను, అన్నుదాలిని, భూపుత్రిని, శ్రీరామచంద్రమూర్తి దేవిని, స్త్రీలయందు శ్రేష్ఠురాలిని నే నెట్లు చూతునో కదా.

—• ౧౪-వ సర్గము. హనుమంతుఁ డశోకవనంబునఁ బ్రవేశించుట. •—

క. అని యీగతి మనమునఁ దా,వని యించుకసేపు లోన • వనసుమ నాలో
చన మొనరించి యా ప్రమదా,వని ప్రాకారమున కంత•వలనుగ దాఁటెన్. ౧౭౭

తా త్ప ర్య ము.

ఈ విధముగ నాంజనేయుఁడు తన మనస్సులోఁ గొంతసేపు వగచి యాలోచించి యా యుద్యానముయొక్క ప్రాకారము మీఁదికి దాఁటెను.

సీ. ప్రాకారమున నిల్చి • పావని సంహృష్ట, సర్వాంగుఁ డగుచును • సంతసమునఁ
జూచె వసంతాది • సురుచిరవికసిత,శాఖ లైనట్టి భూ•జములతోడ
సాల తమాల త•క్కోల హింతాల కో,ద్దాల శాఖోకర•సాల చంప
క కపిముఖానేక•కమనీయతరలతా,భవ్యాగయుతవృక్ష•వాటిఁ గాంచి

తే. యల్లె విడిచిన బాణంబు • ననుకరించి, చివ్వునను దాఁటి యచటికిఁ•జేరఁబోయి
చారువిహగనిస్వనో•దార మగుచుఁ, గనకరాజతపాదపా•క్రాంత మగుచు. ౧౭౮

అర్థములు. సంహృష్ట సర్వాంగుఁడు = నిగ్గుపు బొడిచిన యన్ని యవయవములు గలవాఁడు, వసంతాది = వసంతారంభమున, కొందఱు పున్నమ మొదలు నెల గణింతురు. కావున వసంత కాలము ఫాల్గున శుద్ధ పూర్ణిమతోనే ప్రారంభము. దీనికిఁ బ్రపూర్వ దిన మని గోవింద రాజీయమునఁ గలదు. పున్నమకుఁ బూర్వదినము చతుర్దశి. ప్రపూర్వదినము త్రయోదశి కావున నీ దినము త్రయోదశి యని నిశ్చయము.

సురుచిర = అందముగా, వికసిత = వికసించిన, శాఖలై = కొమ్మలు గలవై, సాల = మద్ది, తమాల = చీఁకటిమ్రాఁకులు, హింతాల = గిజిక తాటి చెట్లు, ఉద్దాలక = విరిగి మ్రానులు, రసాళ = తియ్యమామిడి, చంపక = సంపెఁగ, కపిముఖ = కోఁతిమూఁతి గల కాయలు గాచు చెట్లు, అనేక = నానావిధములైన, కమనీయతర = మిగుల నందమైన, లతా = తీఁగలచే, భవ్య=శుభమైన, అగ =

చెట్లచే, యుత = కూడిన, వృక్షవాటికన్=తోటను, చారు=అందమైన, విహగ=పక్షులయొక్క, నిస్స్వనోదారము = గొప్పధ్వనులు గలది. కనక రాజత పాదప + ఆక్రాంతము=బంగారు వెండి చాయ గల చెట్లచే నిండినది.

తా త్ప ర్య ము.

ఆ యశోకవనముయొక్క ప్రాకారమందు నిలఁబడి యాంజనేయుఁడు దేహమంతయు సంతోషముచేఁ బులకరింపఁగా పాలఁజూడఁగా వసంతము మొదట పూలచే వికసించు కొమ్మలుగల చెట్లతోడను, మద్దులు, చీఁకటి మ్రానులు, తక్కోలములు, గిరికర్ణికాటిచెట్లు, విరిగిమ్రానులు, అశోకములు, అయ్యమామిడిచెట్లు, సంపెఁగలు, క్రోఁతిమామిడి కాయలు కాచుచెట్లు, అనేకము లయిన రంగుల వంద మయిన చెట్లతోఁగూడిన తోఁటనుఁజూచి యల్లెత్రాడు విడిచిన బాణమువలె సూటిగ వేగముగ నచ్చటికిఁ జన్న యా వాటి పోయి పక్షుల కలకల ధ్వనులతోను, బంగారు వెండి చెట్లతోను నిండినదై.

సీ. వింతవింతలు గొల్పు • విహగమృగంబుల, నవ్వు రయి యుదయభా•స్కరనిభంబు
నగరుఁ జిగుర్చు చే•మంతులు పూవులు, పూపలు పిందెలు • పోలుపు విరాలు
పసరుగాయలు దోర•పండులు పండులు, గల పెక్కు- తెగలవృ•క్షముల వెలసి
కోకిల హిందోళ • కేకిరవంబుల, నానాశకుంతసం•తానకలన

తే. నవ్య మైన యశోకవ•నంబునందు,
ధారిణీసుత వెదకుచో • మారుతాత్మ
జుండు సుఖసుప్తములను బ•క్షులను మేలు
కొలుప నవి సొల్లు గలకల • కూయఁ దొడఁగె. ౪౦౫

అర్థములు. విహగమృగంబులన్ = పక్షులచే, మృగములచే, ఉదయభాస్కరనిభంబు = ప్రాతఃకాల సూర్యునితో సమానము, హిందోళ = తుమ్మెదలు, 'బంభరశ్చ మిళింద శ్చ హిందోళ భసలా సమా' అని నిఘంటువు. సుఖసుప్తములు= సుఖముగా నిద్రించునవి.

తా త్ప ర్య ము.

క్రొత్త క్రొత్త యాశ్చర్యములు గలిగించు పక్షులచే, మృగములచే నందమై, ప్రాతఃకాల సూర్యునిఁబోలి చిగుళ్లు, చేమంతులు, పూవులు, లేఁతపిందెలు, పసరు విడిచినపిందెలు, పసరుగాయలు, దోరపండులు, పండులు, గల బహువిధవృక్షములు గలిగి కోకిలలు, తుమ్మెదలు, నెమళ్లు- వీని ధ్వనులచేతను అనేకవిధము లైన పక్షిజాతులచేతను మనోహరమైన యశోకవనముఁ జూచి యందు సీతను వెదకుచు నాంజనేయుఁడు నిద్రవోవు పక్షులను మేలుకొలుపఁగా నవి కలకల కూయ నారంభించెను.

పక్షులను నిద్రలేపె ననుటచే హనుమంతుఁడు చెట్టునుండి, చెట్టునకు దాటుచు చెట్లమీఁదనే సంచరించె నని యేర్పడుచున్నది. ఏలన-కొందఱు రాక్షసులు తోఁట

కావలి కాచుచున్నట్లు ముందు చెప్పఁబడెను. సీతాదేవి యుండెనా, యామె మేలు కని యుండునే కాని నిద్రించుచుండదు. ఆమె నిమిత్తమై మఱి కొందఱు కావలి కత్తెలు మేలుకని యుందురు. తాను నేల నడచిపోయిన నెవరో వచ్చిరని వారు గుర్తించి కలవరపడుదురు. ఆ నిమిత్తముగఁ జెట్లమీఁదనే సంచరించెను. ఆకారణ ముచేఁ బక్షులు నిద్ర లేచుట సంభవించెను. నేల నడచిపోయిన నవి మేలుకొనుటకుఁ గాని, యెగిరి పోవుటకుఁగాని కారణ ముండదు.

సీ. నింగికి నెగురు ప•తంగకోటుల యొఱ,కల తాఁకునను జల•జల మటంచు
రాలఁ బూవులు వాని•రాసుల నడుమను, బుష్పమయాద్రినాఁ • బొలిచెఁగపియు
దిక్కు-దిక్కు-ల నున్న•యక్కు-జంబుల కేగు,కపి వసంతునిఁ గాఁగఁ • గనియె భూత
తతులు భూమీరుహ•పతిత పుష్పాకీర్ణ,వసుధ, భూషిత యోష • పగిది వెలిఁగె
తే. గంధవహసుతగమన వే•గ ప్రకంపి, తావనీరుహాళి వా•తాత్మజాతు
మీఁద వర్షించెఁ బుష్పముల్ • మేలిమిగను,బుష్పపర్ణ ఫలావళుల్ • పొనుఁగుపడియె.

అర్థములు. నింగికిన్ = ఆకాశమునకు, పతంగ = పక్షులయొక్క, ఎఱకల = ఱెక్కలయొక్క, పుష్పమయాద్రి = పూలకొండ, భూమీరుహపతిత = చెట్లనుండి రాలిన, పుష్ప = పూలచే, ఆకీర్ణ=వ్యాపింపఁబడిన, వసుధ=భూమి, భూషితయోష= అలంకరించుకొన్నస్త్రీ, గంధవహసుత = వాయుపుత్రునియొక్క వేగ = వేగముచే, ప్రకంపిత = మిగులఁ గదలింపఁబడిన, అవనీరుహాళి=చెట్ల సమూహము, వాతాత్మ జాతు మీఁదన్=వాయుపుత్రుని మీఁద, పొనుఁగు పడియె=రాలి పోయెను.

తాత్పర్యము.

హనుమంతుఁ డొక చెట్టునుండి మఱియొక చెట్టునకు దాఁటునపుడు కొమ్మలు కదలఁగా నందు నిద్రించు పక్షులు లేచి కలకల కూయుచు నాకాశమునకు నెగురఁగా వాని ఱెక్కల తాఁకున పూవులు జలజల రాలఁగా వాని నడుమ నున్న హనుమం తుఁడు పూలకొండవలె నుండెను. మఱియు నన్ని ప్రక్కలనుండు చెట్లకై యొక్కొక్క చెట్టునకై పోవు హనుమంతుఁడు వసంతునివలె భూతకోటులకుఁ గానవచ్చెను. చెట్ల నుండి రాలినపూలచే నిండిన భూమి యలంకరించుకొన్న స్త్రీ వలె నుండెను. వాయు పుత్రుని వేగముచేఁ గదలిన చెట్లు హనుమంతునిమీఁదఁ బుష్పవర్షము గురిసెను. పూలు, పండ్లు, నాకులు రాలిపోయెను. పుష్పవృష్టి అలంకృత స్త్రీ వర్ణనము లోనై నవి శుభ శకునములు.

క. రాలిన యాకులతో నిలఁ, దూలిన పూవులను బండ్ల•గుటుసులతోఁ దై
చేలలు సొమ్ములు నోడిన, యాలఱియాపరియుఁ బోలె • నమరె నగంబుల్. ౪౦౭

అర్థములు. గుటుసులు = సమూహములు, చేలలు = వస్త్రములు ఆలరి = నుష్టుఁడు, ఈ యాలరి శబ్దమే కాఁబోలు నిప్పు డల్లరి యయ్యెను. నగం బుల్ = చెట్లు.

—• హనుమంతుఁ డశోకవనంబున విహరించుట. •—

క. వింజము శిఖరంబుల వృష్టిం దెలఁగెడి యాగడపలఁ • జెదరఁగ ననిలుం
డుం జిమ్మిన పగువునఁ గపి, కుంజరుఁడును జెదరఁ దీఁగ • గుంపులఁ జిమ్మెన్. ౪౧౦

అర్థములు. వింజము = వింధ్యపర్వతము, వృష్టిన్ = వానచే, అగడపలన్ = మేఘముల గుంపులచే.

తాత్పర్యము.

వింధ్యపర్వత శిఖరంబులందు వాన కురిసెడి దట్టపు మబ్బులను వాయువు చెదరఁ జిమ్మినట్లు హనుమంతుఁడు తీఁగ గుంపులను జిమ్మెను.

సీ. అద్యోత మగరాల • ననుపైన ఘాముల,వెండియుఁ బైఁడియు • వెలయు స్థలుల
మంచినీళ్ళల నింపు • మించిన బావుల, మణిమయసోపాన•మండలముల
ముక్తికవిద్రుమ•మంజులసికతాసు,కూలములఁ స్ఫాటిక•కుట్టిమములఁ
దీరజకనకమ•హీరుహాన్వితములఁ, బద్మినీకుముదినీ•భాసురములఁ
తే. జక్రచక్రాంగ నత్యూహ•సారసాళి
కూజితంబుల వాహినీ•రాజితముల
నమృతనిభతోయములఁ గుసు•మావృతవ్ర
తతుల నగు నూతులను గనెఁ • దరుచరుండు. ౪౧౧

అర్థములు. మగరాలన్=వజ్రములచే, సికతాసుకూలములన్ = ఇసుక గట్టులు, తీరజ = ఒడ్డునందుఁ బుట్టిన, కనక మహీరుహ = బంగారు వన్నెగల చెట్లచే, అన్వితములన్ = కూడినవానిని, పద్మినీ = తామర తీఁగలచే, కుముదినీ = కలువ తీఁగలచే, భాసురములన్ = ప్రకాశించు వానిని, చక్ర = చక్రవాకములయొక్కయు, చక్రాంగ = హంసలయొక్కయు, నత్యూహ='నత్యూహో జలరంకు స్స్యాత్,' నీటి యుల్లులయొక్కయు, సారస= బెగ్గురులయొక్కయు, ఆళి = పంక్తులయొక్క, కూజితంబులన్ = ధ్వనులచేతను, వాహినీ = ఏళ్ళచే, రాజితములన్ = ప్రకాశించునవియు, అమృతనిభతోయములన్ = అమృతముతో సమానమైన నీళ్ళను, కుసుమావృత= పూలచే నిండిన, వ్రతతులన్ =తీఁగలను, అగు=కల, నూతులను=బావులను.

తాత్పర్యము.

ఆ తోట వజ్రాలు బంగారు వెండి గల స్థలములను, మంచినీళ్ళ బావులను, వానిలోనికి దిగిపోవుటకుఁ గట్టఁబడిన మణిమయములైన మెట్లను, వానికి ముత్తెములచేఁ బగడములచే నేర్పరుపఁబడిన యిసుక గట్టులను, వానికిఁ బ్రక్కనే కూర్చుండుట కయి యేర్పరుపఁబడిన స్ఫటిక ప్రదేశములను, వానియొడ్డునందుఁ బుట్టిన బంగారు వన్నె చెట్లను ఆ బావులయందుఁ గల తామర తీఁగలను, కలువ తీఁగలను, అందుఁ గూయుచున్న హంసలను చక్రవాకములను, నీటియుల్లులను, బెగ్గురులను, వానిలోనుండి

పాఱు జేళ్లను, వానియందలి యమృత తుల్యమైన నీళ్లను, చుట్టు నల్లఁబడిన పూల తీఁగలను హనుమంతుఁడు చూచెను.

క. ఆ యాటతోఁటలోపల, వాయుతనూజుండు గాంచె • వరశిఖరవిచి
 త్రాయతకూటాగయుతశి,లాయతనం బైన కేళి • శావనిధరమున్. ౭౧౨

అర్థములు. ఆటతోఁట=కేళీవనము, ఉద్యానవనము; వరశిఖరవిచిత్రమును = ఇంపైన శిఖరములచే నలంకరింపఁబడినది, ఆయతకూట=దీర్ఘములైన యింపులు గలదియు, అగయుత = చెట్లుగలదియు, శిలాయతనము = రాతిగృహము గల, కేళీశావనిధరమున్ = ఆట మలను - క్రీడాపర్వతమును.

తా త్ప ర్య ము.

ఆ యుద్యాన వనము నందు నింపైన శిఖరములు గదులు, చెట్లుగల రాతి యిల్లు గల క్రీడాపర్వతమును హనుమంతుఁడు చూచెను.

సీ. ఆ నగాగ్రమునుండి • యవనికి దుముకుచు, సెలయేటి కొప్పుఁ గాం • చినది సభటి,
 లతిమీఁదఁ గినిసి యం • కతలంబు డిగి యేగు, కోపనవైఖరి • కొమరు మీఱి
 నందు స్రేలాడు శా • ఖాగ్రంబు లా క్రుద్ధ, వారించు చుట్టాల • పగిదిఁ దోఁచె
 రుధిర మున్ను వెనుకకు • మరలెడి వహి మాడ్కి, గినుక చల్లారఁ గాం • తుని గనంగ
తే. మెల్లఁ గ్రమ్మఱి పోవుడి • మెలఁతఁ బోలె
 దానికి నలంతి దవ్వున • దతశకుంత
 రాజిరాజితకాసార • రాజిఁ గాంచె
 మారుతసుతుండు ధృతహర్ష • మానుఁ డగుచు. ౭౧౩

అర్థములు. కినిసి = కోపించి, అంకతలంబు = తొడ, కోపన = కోపము గలస్త్రీ, క్రుద్ధన్ = కోపించిన దానిని, రుధిరము = ప్రవాహము, వహి = విధము, అలంతి = కొంచెము, తత = విస్తారమైన, శకుంతరాజి = పక్షిసమూహముల చేత, రాజిత = ప్రకాశించు, కాసారము = కొలను, హర్షమానుఁడు = సంతోషించు చున్నవాఁడు.

తా త్ప ర్య ము.

ఆ పర్వతము మీఁది నుండి క్రిందికి నొక సెలయేఱు పాఱుచుండెను. అది మానుటకు మగనిపైఁ గోపించి వాని తొడనుండి దిగిపోవు కోపించిన స్త్రీ వలెఁ దోఁచెను. ఆ నది స్రేలాడు కొమ్మలచే నడ్డగింపఁబడిన నీళ్ళు వెక్కి పోవుట చూడఁగా నా నాయిక బంధువులు సమాధాన పెట్టి వారింపఁగా శాంతిపడి మగని యొద్దకుఁ బోవు చుండెను. దాని సమీపమునకు విస్తారముగఁ బక్షులు గల కొల నుండెను. దానిని సంతోషముతో హనుమంతుఁడు చూచెను.

క. చిత్రపురతనప్రసోష్ణు ప,విత్రశిశిరజలము వివిధ • వికిరవ్యూగంబుల్
 కృత్రిమవనములు గల పటు,కృత్రిమశిల్పకలఁ దేవ్రష్టు • కృతశోభనములన్. ౭౧౪

అర్థములు. విహగమృగంబుల్ = పక్షులు మృగములు, కృత్రిమ దీర్ఘికల = కల్పితము లయిన దిగుడు బావులను, త్వష్టృకృత = విశ్వకర్మచే జేయఁబడిన, సౌధములన్ = మేడలను.

తాత్పర్యము.

రతనపుమెట్లు,నిర్మలమై చల్లనైన నీళ్లు, నానావిధములైన పక్షులు,మృగములు, కల్పితములైన వనములు గల కల్పితములైన దిగుడు బావులు విశ్వకర్మ నిర్మించిన మేడలు.

క. ఫలపుష్పభరితకుజషా,ళులు గోడుగులు పసిడి జగతు•లున్ శోభానం
బులు గ్రాల వంకు వల్లీ,దళ మేదురశింశుపోరు•తరువు నోకంచున్. ౪౧౫

అర్థములు. కుజషాళులు = చెట్ల సమూహములు, జగతులు = అరుఁగులు. వల్లీదళ = తీఁగలచేతను, ఆకులచేతను, మేదుర=దట్టమైన, శింశుపా+ఉరుతరువు = పెద్ద యిరుగుడు చెట్టు.

తాత్పర్యము.

ఫలములచే బుష్పములచే నిండిన చెట్లవరుసలు గోడుగులు,బంగారుటరుఁగులు, మెట్లు ప్రకాశింపఁగా వంకు హనుమంతుఁ డొక పెద్ద శింశుపావృక్షమును జూచెను.

క. బంగరుటరుంగు లోలిఁ జె,లంగఁగఁ దనచుట్టు కనువి•లసితము నాఁగన్
బొంగుచుఁ దనలో వానర, పుంగవుఁ డటఁగాంచె వహ్ని•బోలు తరువులన్.

తాత్పర్యము.

ఆ ప్రదేశమునందు బంగారువన్నెగల యరుఁగులు తమ చుట్టునుండఁగ నెఱ్ఱని పూవులు చిగుళ్లుగల అగ్నివంటి చెట్లను హనుమంతుఁడు సంతోషముతోఁ జూచెను.

ఉ. గుంటల మిట్టలన్ నకులఁ • గ్రౌంచరుకుం గనకంపుఁ జెట్లు ని
న్నంటు వెలుంగుతోడఁ దన•రారఁ గనుంగొని నీని డాలు మై
నంటుటఁ జైఁడిగుంటి రుచు • లంటిన నేఁడి వెలుంగు నట్లు నే
నుంట లభించెఁగా యనుచు • నూహ కొమఁగ్బోఁ గపీంద్రుఁ డాత్మలోన్. ౪౧౬

అర్థములు. గుంటల మిట్టలన్ నకులన్ = కీచికిఁ గ్రియ ౪౧౬ న పద్యము లోని కాంచెను అనువది. క్రౌంచరుకున్ = క్రౌత్త+తరుకు = క్రౌంచరుకు, క్రొత్త కాంతిగల, మిన్నంటు = ఆకాశము దాఁకు, డాలు = కాంతి, మైన్ = దేహము నందు, అంటుటన్ = తగులుటచే, చైఁడిగుంటి = బంగారు కొండ, రుచులు = కాంతులు, నేఁడి వెలుంగు = సూర్యుడు.

తాత్పర్యము.

క్రొత్తమొలకలు గల బంగారు చెట్లు లాకాశము తగులు కాంతులతో నుండుట

జూచి యీవి కాంతులు నాపైఁబడుటచే నేను బంగారు కొండ కాంతులు పడిన సూర్యునివలె నుండుట లభించెఁగదా యని హనుమ తలంచెను.

క. అచ్చెరువడెఁ దనచుట్టును, నచ్చపుటపరంజిచాయ • నమరు తరుజంబుల్
  హెచ్చఁగ బంగరుగజ్జెలు, నిచ్చ మ్రోయుచు శింశుపావ • నీరుహాననమున్. ౪౧౮

తాత్పర్యము.

తనచుట్టు బంగారు ఛాయ గల చెట్లు చుట్టుకొనఁగా బంగారు గజ్జెలు ధ్వనించు శింశుపావృక్షమును జూచి హనుమంతుఁ డాశ్చర్య పడెను.

సీ. సురుచిరకోమలాం • కురపల్లవంబుల, నవ్యమౌ శింశుపా • వనము నెక్కి-
  యుచ్చట నుండి నే • వీక్షింతుఁ గాక శ్రీ,రామదర్శనలోల • రమ్యశీల
  నిటు నటు నలమట • నటమట గొను బాల, జనకేశ్వరుని పుత్రి • చారుగాత్రి
  ధూర్త రావణు వని • శోకంపుఁజెందిన, చంపకవకుళవృ • క్షములచేత
తే. సొంపు నింపెడి పక్షుల • గుంపుచేతఁ
  గ్రమముతో నైన వరలతా • కములచేత
  నింపు నింపారఁ గూర్చెడి • హృదయమునను
  తన్మాత్రమాత్రవ యుండు రా • గలదు నిజము. ౪౧౯

అర్థములు. అంకుర = మొలకలెత్తు, పల్లవంబులన్ = చిగుళ్ళచేతను, అల మటన్ = చింతచే, అటమట = దుఃఖము, ధూర్తరావణు వని = దుష్టుఁ డగు రావణు నుద్యానము. ధూర్తశబ్దము వృద్ధాదులలోఁ జేరినది. కావున పుంవద్భావ మగు. సు.,వ్యా. తత్సమ. ౨౦ సూ.

తాత్పర్యము.

మిగుల మనోహరములు, మృదువులునై, మొలకలెత్తు చిగుళ్ళచేతను మనోహరమైన శింశుపావృక్షము నెక్కి యుచ్చటనుండి శ్రీరాముని జూడఁ గోరిక గలదియు మంచి స్వభావము గలదియు, చింతచే దుఃఖించు నదియు జనకరాజపుత్రియు మనోహర మగు దేహము గలదియు నగు సీతాదేవిని నేను జూతును గాక. ఏలన:— ధూర్తుఁడైన రావణుని యీ యశోకవనము చంపక వృక్షములచేతను సుసంపన్న పొగడ వృక్షములచేతను, మనోహరముగఁ గూయు పక్షులచేతను, అందమైన కొలఁకుల చేతను మిగుల సంతోషము గలిగించుచున్నది. కావున సీత యిచ్చటికి రాఁగలదు. ఇది నిజము.

క. ఆరామ రాముదేవెరి, శ్రీరాముని నాత్మ పత్ని • శ్రీరాఘవ చిం
  తారత మృగలోచన కాం,తారవిహారిణి యిటకుఁ • దప్పక వచ్చున్. ౪౨౦

వివాహమే స్త్రీల కుపనయనము. పతిసేవయే గురుకులవాసము, గృహ కృత్య నిర్వాహకమే యగ్నిహోత్రము. గనుక వారికి వివాహముతో యుపనయనాదులు. ఇది యిప్పటికాలమున విధి. కల్పాంతర విషయమున హారీతుఁడు ‘ద్వివిధా స్త్రియో బ్రహ్మవాదిన్య స్సద్యో వధ్వశ్చ। తత్ర బ్రహ్మవాదినీనా ముపనయన మగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహే భిక్షాచర్యేతి। సద్యోవధూనాం తూపస్థితే వివాహే కథంచి దుపనయనం కృత్వా వివాహః కార్యఇతి తత్కల్పాంతరాభిప్రాయం’, స్త్రీలు రెండు విధములు, (౧) బ్రహ్మవాదినులు. (౨) సద్యోవధువులు. అందు బ్రహ్మవాదినుల కుపనయనము, అగ్నీంధనము, వేదాధ్యయనము, స్వగృహమందు భిక్షాచర్య-వీరికి వివాహములేదు. ఇఁక సద్యోవధువులకు వివాహకాలమందు చేసో యొక విధముగ నుపనయనము చేసి యావల వివాహము చేయవలయును. ఇది కల్పాంతర వ్యవస్థ. మంగళసూత్రధారణము స్మార్తము గావున నుపవీతములకు బదులు మంగళసూత్రము లేర్పడినవి.

యమస్మృతి యం దిట్లులే యున్నది. “పురా కల్పే కుమారీణాం మౌంజీబంధన మిష్యతే। అధ్యాపనంచ వేదానాం, సావిత్రీ వచనం తథా। పితా పితృవ్యో భ్రాతా వా నైనా మధ్యాపయే త్పరః। స్వగృహే చైవ కన్యాయా భైక్షచర్యం విధీయతే, వర్జయే దజినం చీరం జటాధారణ మేవ చ॥

పూర్వకల్పమందుఁ గన్యకలకు మౌంజీబంధనము చెప్పఁబడెను. వేదాధ్యయనము గాయత్రీజపము గలదు, గాని తండ్రి పినతండ్రి, అన్న మాత్రమే యివి చెప్పవచ్చును గాని పరుఁడు చెప్పరాదు. కన్య తన యింటి యందే భిక్ష మెత్తవలయును. కృష్ణాజినము నారచీరలు ధరింపరాదు. జడలు నమాత్రము ధరింపవలెను. ఈ కారణమునఁ త్రేతాయుగ మందలి సీతాదేవికి సంధ్యావందనము గలదు.

క. ఆ యంబను రఘురాముని, ప్రేయసికిన్ రాజవర్యు ప్రియ కనురూపం
బై యమరె సమ్మతం బై, యీ యశోకవనము ♦ హృదయంగమ మై.

తా త్ప ర్య ము.

అటువంటి తల్లికి రఘురాముని ప్రియురాలికి రాజపుత్త్రిక యగు రామునందుఁ బ్రీతిగలదానికి నీ యనుమానమైన యశోకవనము తగి యున్నది. కావున నిందు సీత యుండఁ గలదు.

క. ఈవిధ మేదినియు రాముని, దేవియుఁ దా నిందు నుండు ♦ నిశ్చయ మం
చీ విధిఁ దలఁచు మఁ జావని, యావృక్షంబునను దాఁగి ♦ యటు నిటు గనుచున్.

తా త్ప ర్య ము.

సీతాదేవి ప్రాణములతోనే యుండెనా యిచ్చటికి వచ్చుట నిజము, అని యీ విధి నాలోచించుచు, ఆ చెట్టునందు డాఁగి యా ప్రక్క నా ప్రక్క చూచెను.

అర్థములు. ఫుల్లాశోకప్రతతులన్ = వికసించిన యశోకవృక్షసమూహముల చేతను, ఉత్ప్రేక్షాలంకారము.

తాత్పర్యము.

వికసించిన యశోకవృక్షముల యధికమైన మెఱుఁగుకాంతి ఉదయకాల సూర్యుని కాంతులను బోలి నిద్దమంటలలోఁ జిక్కుకొన్నదో యన్నట్లుండెను.

ఉ. రాలెడు పూలు పొమ్ము లనఁ • బ్రాల శిరంబుల నన్ని మొక్కఁటి
కాలమునందుఁ బక్షి తతి•కల్ నెఱవిచ్చికొనం దరీయు ప
త్రాళివిలీనపుష్పదళ • మై ద్రుమపాళి విహీనపత్రశా
ఖాళియుతంబు నట్లు గన•వచ్చె మరుత్సుతు కన్నుదోయికిన్. ౪౨౮

తాత్పర్యము.

పూవులు పక్షుల శిరంబులం దొక్కసారిగ రాలఁగా నా పక్షులు వానిని బోఁగొట్టుకొన రెక్కలు విప్పఁగా ఆ రెక్కల సందున దాఁగిన పూలు నాకులు గలవై చెట్లు ఆకులుపూలు లేనివానివలె హనుమంతునకుఁ గన్నులకుఁ గానవచ్చెను.

క. అమూలపుష్పనిచితం, బై, మంజుతరంబు నయి వ్య•థాపహ మగుచున్
శ్రీమత్కుసుమభరంబున, భూమిని సోకెను నశోక•భూరుహశాఖల్. ౪౨౯

అర్థములు. ఆమూల = మొదలునుండి, అవ్యయీభావసమాసము. పుష్పనిచితంబై = పూలతో నిండినదై, వ్యథాపహము = బాధ పోఁగొట్టునది, శ్రీమత్కుసుమభరంబునన్ = శోభకల పూవుల యాధిక్యముచే.

తాత్పర్యము.

వేళ్ళవఱకుఁ బూచినదై ఆ కారణముచే మిగుల నందమై ఆ కారణముచే చూచువారి మనస్సులోని సంతాపము పోఁగొట్టునదియై కాంతిగల పూల బరువుచే అశోకవృక్షముల కొమ్మలు నేల తాఁకుచుండెను.

చ. కుసుమితకర్ణికారములుఁ • గ్రొన్ననలం గల కింశుకంబులున్
బసగల సప్తపర్ణములు • బాగగుపొన్నలుఁ జంపకంబులున్
పసి గల శాతకుంభనిభ•చారునగంబులుఁ గొన్ని కొన్ని య
గ్గిసిగలఁ బోలు చెట్టులను • కేసరిసూనుఁడు చూచె నచ్చటన్. ౪౩౦

అర్థములు. కుసుమిత = పూచిన, ఇది తారకాదిగణములలోఁ జేరినది. 'సంజాతాని కుసుమా న్యేష్వితి కుసుమితాః' అని వ్యుత్పత్తి. ఇతచ్ప్రత్యయాంతము. కర్ణికారములు = కొండగోఁగులు, కింశుకములు = మోదుగులు, సప్తపర్ణములు = ఏడాకుల యరఁటిచెట్లు, శాతకుంభనిభ = బంగారుతో సమానమైన, చారునగంబులు=మనోహరములైన చెట్లు, అగ్గిసికలన్ =అగ్నిశిఖలను.

ఈయశోక వనము నేటికి నున్నదని చూచిన వారు వ్రాసిన వాక్యము లివి నటకే యనువదింపఁ బడినవి.

క. మిన్నొరయుచు రమ్యంబై, కన్నులకును మీఱి యింపు • ఘటియించుచు సం
పన్న స్తంభసహస్రము, చెన్నారెడు నొక్క మేడఁ • జేరువఁ గాంచెన్. ౪౩౩

అర్థములు. మిన్ను + ఒరయుచు = ఆకాశముతో రాచుకొనుచు, స్తంభ సహస్రము = వేయి స్తంభములు.

తాత్పర్యము.

ఆకాశ మంటుచు రమ్యమై కన్నుల పండువగై వేయి స్తంభములు గల యొక మేడను సమీపమందే చూచెను.

—• హనుమంతుఁడు సీతాదేవిని జూచుట •—

ఉ. మాసిన చీరతోడ, ధృతి • మాలిన చిత్తముతోడ, నింతయున్
గ్రాసము లేమిఁ జిక్కిన సు • కాయముతోఁ, బయి పై నిగుడ్చు ని
శ్శ్వాసచయంబుతో; నెఱుఁగఁ • బట్టఁగరాని స్వరూపకాంతితో,
గాసి నొసంగురాత్రిచర • కాంతలచేఁ బరివేష్టమాన యై. ౪౩౪

తాత్పర్యము.

మాసిన చీరతో, ధైర్యము చెడిన మనస్సుతో, కొంచె మైన నాహారము లేకుండుటచే శుష్కించిన దేహముతో, మీఁద మీఁద వెలువడించు నిట్టూర్పులతో నీమె సీతయని గుర్తింపరాని దేహకాంతితో, బాధపెట్టుచున్న రాక్షస స్త్రీలతోఁ జుట్టఁబడినదై.

ఆహారము కొంచెమైన లేదనుటచే గిష్కింధాకాండ మందు ఇంద్రుఁడు పాయస మిచ్చె నను కథ కల్పితము.

ఉ. క్రొన్నెలవోలె నున్న యొక • కోమలగాత్రిని, హోమధూమసం
ఛన్నహుతాశనార్చి గతి • జానతి యుండెడిదాని, నైజమౌ
యున్నతిరూప మించు మది • నెంతొ విచారముఁ జేసి కాని లో
నెన్నఁగరాని దానిని, న • హీనతరవ్యథితాత్మ, సుందరిన్. ౪౩౫

అర్థములు. క్రొన్నెల = క్రొత్తచంద్రుఁడు, హోమధూమ = హోమము పొగచే, సంఛన్న = కప్పఁబడిన, హుతాశనార్చిగతిన్ = అగ్నిశిఖవలె, జానతి = అందముచెడి, నైజము = స్వభావసిద్ధము, అహీనతర = మిగుల నధికమైన, వ్యథితాత్మన్ = బాధపడు మనస్సు గలదానిని.

తే. దోయజంబులఁబోలు క•న్దోయిదానిఁ, బుష్పబాణుని యలివేణిఁ • బోలుదానిఁ
నిండు వెలఁదాలువాఁగను • నిఖిలజగతి, కనుపమాభీష్ట యగుచును • జనెడు దాని.

అర్థములు. యౌవన లక్షణంబులు = స్తనములు. 'యౌవనే చ స్తనే చ స్యాత్ స్త్రీ'-బే యౌవన లక్షణం॥ నానా॥ర॥ పుష్పబాణుని యలివేణి=రతీదేవి. వెలఁదాలు= చంద్రకాంతి, అనుపమాన + ఇష్ట = అసమానమైన ప్రీతిగలది. లోకమున నామె యందప్రియము గలవారు లేరని భావము.

తాత్పర్యము.

పూర్ణచంద్రుని వంటి ముఖము, అందములైన కనుబొమలు, వర్తులములగు స్తనములు, నిడుపాటి నల్లని తల వెండ్రుకలు, చీఁకటిని హరించు దేహకాంతి, దొండ పండువంటి పెదవులు, సింహము నడుమువంటి సన్నని నడుము, తీర్చి నట్లుండు పాదములు, తామరలవంటి కన్నులు గలిగి రతీదేవివలె సుందరమై నిండు చంద్రుని వలె సర్వజనులకు నభీష్టమై యుండుదానిని.

అవివేకు లందును రామచంద్రునిఁ దప్పు పట్టువారు గలరుగాని సీతాదేవిని దప్పుపట్టువారు లేరు.

ఉ. తాపసిఁబోలినదాని, వసు•ధం బడియుండెడిదాని, నూతపుల్
నైపయిఁ బాఁపలేము యునఁ • బర్వఁగఁజేసెడిదాని, ధూమమా
లాపరితాగ్ని నాఁగ విపు•లవ్యథఁ బొంపతి యుండుదాని, మి
థ్యాపరిభూతకీర్తి నిహా•రం బగు నాశను బోలు తొయ్యలిన్. ౨౮౩

అర్థములు. తాపసిఁ బోలినదాని = తపస్సుచేయుచుండుదానివలె నుండు దానిని, పాఁపలేము = ఆఁకు పాము, సమాసంబుల నోప విభక్తికంబుల కీర్ఘ పూర్వకద్విత్వ మువర్ణంబులకు ఖండపూర్వబిందుపూర్వకంబుగను లఘుపూర్వక మువర్ణంబునకుఁ గేవలమును పవర్ణం బగు. పాము+లేము = పాఁపలేము. వేము + చెట్టు = వేఁపచెట్టు. ధూమమాలా = పొగగుంపుచే, పరితాగ్ని = కప్పఁబడిన యగ్ని, మిథ్యాపరిభూతకీర్తి = అసత్యపు టపవాదముచే చెఱుపఁబడిన కీర్తి, తొయ్యలిన్ = స్త్రీని. ఇది మొదలు కులకము.

తాత్పర్యము.

తపస్సు చేసికొను దానివలె, తిండిలేక చాపలులేక నేలఁబడి యుండుదానిని, ఆఁకుపాము బుసకొట్టునట్లు నిట్టూర్పులు విడుచుదానిని, పొగ క్రమ్ముటచే తెలియరాని యగ్నివలె విస్తారతాపముచే నొంపఁబడి యుండుదానిని, అసత్యమైన యపకీర్తిచే చెడిన యాశవంటి దానిని, నొక స్త్రీని.

తపస్సుచేసికొను స్త్రీ యనుటచే యమ సంపత్తి జితేంద్రియత్వము భోగవిరా

యీమె సీత యగునో, కాదో రావణాసురుఁడు బలాత్కారముగఁ దెచ్చి యుంచినదనో భావించుచున్నాఁడు. వానిలో నెవతెయో యేమో యని సందేహించి సందేహించి చూచి చూచి యీమె సీతయే యనుటకుఁ గారణముల నాలోచించి నుదకీమె సీతాదేవియేయని నిశ్చయించెను. ఆకారణము లీ క్రింది పద్యముల వివరింపఁబడును.

—• హనుమ తాను జూచిన స్త్రీ సీతాదేవి యని నిశ్చయించుకొనుట. •—

క. జానకి సొమ్ము లటంచును, మానవపతిఁ దెల్పి పలికె • మా కవి చెల్లన్
గానఁగ నయ్యెడిఁ గుజకొ, మ్మానికరములందు వ్రేలి • కలికికి నటుతన్. ౪౪౩

తాత్పర్యము

తొలుత రావణాసురుఁడు దెత్తికొని పోవుచుండఁ దాము చూచిన స్త్రీవలె నీమె యున్నది కావున సీతయై యుండునని తలఁచి, యొకతేమ పోలి మఱి యొకతె యుండవచ్చును, కావున నది నిశ్చయింపఁ జాలునంత ప్రమాణము కాఁజాలదని తర్కించి యితర ప్రమాణములచే నిశ్చయించుచున్నాఁడు. దీనివలనఁ గేవల ప్రత్యక్ష ప్రమాణము ప్రమాణము గాదని తేర్చుచున్నది. రామచంద్రమూర్తి యిది జానకి సొమ్ము లని తెలిపి మాకుఁ జాలికో యని యున్నయు నీమె సమీపమునఁ జెట్ల కొమ్మలందు వ్రేలాడు చున్నవి.

సీతాదేవి యాభరణములు కపులమధ్యఁ బాఱవైచినపు డొక పర్వుకొని మాత్రము తీసి మూటఁగట్టి వైచెను. ఇచ్చట రెండవ ప్రక్కని తీసి కొమ్మలకుఁ దగిలించినది. ఎవరైనఁ దన్ను వెదకుచు వచ్చిన మొదల వారు వీనిని బట్టి తన్ను గుర్తింతురుగాక యని యామె యభిప్రాయము. ఈమె సీతయే యనుట కిది రెండవ కారణము. దీనినే వివరించు చున్నాఁడు. ప్రత్యక్షమును ననుమానప్రమాణముచే బలపఱచు చున్నాఁడు:

ఉ. చక్కని చేఁతకమ్మలును • జానగుపేరుల్ బాగరుల్ సుకాంతిఁ దెం
పెక్కిన రత్నవిద్రుమము•హిష్ఠవిభాకరభూషణంబులున్
మక్కియు నల్లవాటియును • మానక పెక్కుదినాలు వాల్చుటన్
జక్కఁగ సుత్తరీశ్వరిచె • స్వామి వచించిన సొమ్ములె వ్వనిన్. ౪౪౭

అర్థములు. చక్కని చేఁత = నాణెముఁగ చేసిన, రత్నవిద్రుమ = రత్నములయుఁ బగడములయు, మహిష్ఠ = మిక్కిలి గొప్పదగు, విభాతి = కాంతికి, ఆకర = స్థానమైన, భూషణంబులన్ = సొమ్ములు, మక్కియు = ముక్కిక యయ్యెను.

తాత్పర్యము.

చెట్లకొమ్మలందు సొమ్ములు వ్రేలాడుచున్నవి నిజమే, అవి యీమెవియే

యని యెట్లు నిశ్చయింప వచ్చును? అని సందేహించి దాని నివర్తి చేసికొను చున్నాఁడు. నారాయముగాఁ బనిచేసిన కమ్మలు, బాగడలు, రత్నములు, పగడములు వీనిచేఁ బ్రకాశించు భూషణంబులు ఇవి ముఱికియయి నల్లవాఱి కూడ చాలదినములు ధరించుటచే నవి యామె దేహముమీఁద గుర్తు లేర్పఱిచినవి.

అనఁగా నచ్చట శ్రీరామచంద్రమూర్తి సీత సొమ్ములివి యని నేనిని జెప్పెనో యవి ధరించియుండిన దేహమునం దెట్టి గుర్తులు పడియుండునో యాగుర్తు లీమె దేహమునం దున్నవి. పనిలేనప్పుడు సొమ్ములు తీసిపెట్టుటకుఁ బెట్టెలు లేకుంటచే దేహమునందే విడువక ధరించి యుండుటచే దేహమునఁ గాయలు కాచె నని భావము. సీతాదేవి పాఱవైచినవి కాక యప్పుడు తొందరకుఁ దీయుటకు సాధ్యము గానివి దేహమందే యుంచుకొనెను. రామచంద్రమూర్తి తాను జూచిన నగలు గాక సీతాదేవి దేహముమీఁద నింకను నీ యీ సొమ్ము లుండెనని చెప్పెను. ఆ సొమ్ము లిందున్నవి. ఇది యాప్తవాక్యము.

క. అక్కడ నేఁ జూచిన నగ, లిక్కడఁ గనరావ; యున్న • విట నచ్చోటన్
 జిక్కని సొమ్ములె; కీనిక, నొక్కింతయు సందియంబు•నొనరదు చూడన్. ౪౪

తాత్పర్యము.

అక్కడ నే నేయే నగలు చూచితినో యా నగ లిచ్చట లేవు. ఇక్కడ నుండు నవి యచ్చట లేవు. ఇందు సందేహములేదు. అనఁగా నక్కడ నెడమ చెవి, ఎడమ ముక్కు, ఎడమచేయి, ఎడమ కాలికిఁ బెట్టుకొను సొమ్ములుండిన నిక్కడ నవి లేవు. ఇక్కడ కుడి ప్రక్కవే యున్నవి.

మఱి యెవ రైనను దన సొమ్ములు చెట్లకుఁ దగిలించె ననిన నిట్లుండుటకుఁ గారణములేదు. కావున నందు నేను జూచిన సొమ్ము లీమె ధరించినవే.

చ. పసిమికడానిడాలున కు•ళుం బయి యప్పుడు వోవు వేళ నా
 కసమున నుండి డాలుచు న•గంబునఁ గొంచెక చిక్కుపెన్ని తా
 నెనఁ గపిపం క్తి చూడఁగను • ప్రేలిన చీరయు మేలిసొమ్ములున్
 వసుమతి నీమెయే విడిచె • వంచనతే నొకయింత యేనియున్. ౪౫

ఇఁక మూఁడవ కారణ మూహించు చున్నాఁడు.

అర్థము. పసిమికడాని డాలు=పచ్చని బంగారు కాంతి, కొంచెక=కొంచెము.

తాత్పర్యము.

ఈమె యిప్పుడు పోవు సమయంబున నీమె వైచుటచే నాకసంబున నుండి పడుచు చెట్లకొమ్మలకుఁ దగులుకొని కొంచెము చినిగి కోఁతులు చూచుచుండఁగా పడిన పచ్చని బంగారు వన్నెగల యుత్తరీయము సొమ్ములు నీమెయే విడిచెను.

ణంబును మోసములేదు. సుగ్రీవుఁడు సీతాభూషణములను శ్రీరామునకుఁ జూపినప్పుడవి చెడక యుండెను. ఆకాశమునుండి క్రిందికి వైచినప్పుడు సొమ్ములు విఱిగి తునుకలై పోకుండునా యను సందేహమును వాల్మీకి యిచ్చటఁ బరిష్కరించుచున్నాఁడు. సీతాదేవి బండలమీఁదఁ బాఱవైవ లేదు. చెట్టుమీఁదఁ బడునట్లు మూటను వేసెను. అది చెట్టు కొమ్మలయఁ దగిలి యచ్చటనుండి నేలఁబడెను, గావున సొమ్ములు తునుకలు గాలేదు.

క. చిరకాలం బీ వసనము, ధరియింపం బడుట మాపు • తగిలియు రంగుల్
బరికింపఁగ నా చీరకు, సరిదై యెప్పారె కాంతి • సంపద వన్నెన్. ౪౫౦

తాత్పర్యము.

అది యెట్టులందువా? అక్కడ చీరకొంగే పచ్చని వన్నెగలదో యీ పచ్చని వన్నెగలది గానే యీయమె చీరయున్నది. అయినను ఇది చిరకాలము ధరింపఁబడుటచే నునుపు లేకుండుటచే నీచీర రంగు మాసినను కాంతియందును వన్నెయందు నా చీరను పరిపోలి యున్నది.

ఉ. ఈ కనకాంగి రాము హృద • యేశ్వరి దీనెని మారవిప్రవా
సాకుల యయ్యె రాముహృద • యంబున నెప్పుడుఁ బాయ కున్న, న
శోకము రామచంద్రు నెడఁ • దోఁచు సురూపము నంగసౌష్ఠవం
బీ కువలాక్షి యందుఁ బరి • దృశ్యము లయ్యెను యుక్తమే కదా! ౪౫౧

ఈమె సీతయే యనుటకు మఱికొన్ని కారణములు చెప్పుచున్నాఁడు.

అర్థములు. మార విప్రవాసాకుల = మార దేశమున మగని విడిచి కలఁతచెందినది, సురూపము = సౌందర్యము, అంగసౌష్ఠవము = అవయవ పరిపూర్తి, పరిదృశ్యము లయ్యెను = చక్కఁగాఁ గానవచ్చుచున్నవి, యుక్తము = న్యాయము, రాము హృదయంబునన్ = రామునిన్ దన హృదయంబున - అఃయు, తాను రాముని యొక్క హృదయమునందుండి యనియు నర్థము గ్రహింపవలెను. ఇట్లు చెప్పుటచేఁ బరస్పరానురాగము చెప్పఁబడెను. ఈ యర్థము బాలకాండమున ౧౬౬వ పద్యము నందు 'శ్రీరఘురామ చంద్రుఁడును....మనం బా రమణీలలామ పయి నారసి కూరిమి నిల్పి యామెయున్ గూరిమిఁ జేరియుం డెఁగఁ గూర్చి మనంబు సదా హృదీశుపై" అని చెప్పఁబడెను.

ఇట్లు చెప్పుటచే శ్రీరామచంద్రునకు హృదయేశ్వరి సీతాదేవి, శ్రీ సీతాదేవి హృదయేశ్వరుఁడు శ్రీరామచంద్రమూర్తి యని యేర్పడెను, ఈకారణమున నిరువురు నేకాభిప్రాయము గలవారే యని యేర్పడు చున్నది. ఆమె యూహ వసినది ఆయన తారసము, ఆయన తలంచినది యామె కామనము. సీతానుగ్రహము వచ్చిన రామానుగ్రహము వచ్చినట్లే. రెండవ వారి యందు సమానముగానే యుండవలెను.

### తాత్పర్యము.

ఈమె సీతయే యనుటకు నాలుగవ కారణ మే మనిన:— ఈమె రాముని హృదయేశ్వరి. రాణి కావున దూర దేశమందు మగని విడిచి యుండినను రామచంద్ర మూర్తి హృదయమునందు వదలక నిలిచియున్నది. రాముని కెక్క హృదయమునందు నీమె యుండఁబోయున్నది. ఇంక నైదవకారణ మేమన - సాముద్రికశాస్త్రప్రకారము రామునం దేయవయవసౌష్ఠవము గలదో యట్టి సౌష్ఠవముగలవానికి నట్టి యవయవ సౌష్ఠవము గలది భార్యగా నుండవలయునో, యట్టి యవయవసౌష్ఠవ మీమె యందుఁ గానవచ్చుచున్నది, కావున శాస్త్రప్రకార మాయన కీమెయే భార్యయయి యుండ వలె, నీమె కాయనయే భర్తయై యుండవలెను. ఇది న్యాయ్యమే కదా. ఇది శాస్త్రప్రమాణము.

ఈ పద్య మందు శ్రీరామచంద్రుని నడుగోరు నంగసౌష్ఠవము లీ కమలాక్షి యందుఁ బరిదృశ్యము లయ్యె నని సీతారాముల కైక్యము చెప్పఁబడెను. మగవాని చిహ్నము లాఁడుదానియందు, నాఁడుదాని చిహ్నములు మగవాని యందున్న వని చెప్పరాదు. కావున నిక్కడ సామ్యమే గ్రహింపవలెను.

క. శ్రీరాఘవుఁ డీమెకొఱకుఁ, గారుణ్యం బానృశంస్య•గరిమయుఁ గను ద
య్యారమణిశోకము మదనుఁడు, గాఱింపఁగ నేఁగునట్టి•కాంత యి దేమూ. ౪౫౨

అర్థములు. కారుణ్యము=దయ, ఆనృశంస్యము = క్రూరత్వము లేకుండుట, వేఁగు = పరితపించు.

### తాత్పర్యము.

పైఁగడ వివరించిన నైదుకారణములచే నీమె రాముని భార్య సీతాదేవియే యని నిశ్చయించుచున్నాఁడు. శ్రీరామచంద్రమూర్తి యేమె నిమిత్తము దయ, యక్రూరత్వము, వారింపరాని శోకము, కామము బాధింపఁగాఁ బరితాప పడు చున్నాఁడో యామె యీమెయే. రామచంద్రమూర్తి భార్య నిమిత్తమై శోకించుట కీ నాలుగు కారణములు. ఇవి క్రింది పద్యమున వివరింపఁబడు చున్నవి.

సీ. ఆపదవేళల • నంగన నొక్కఁడు, గ్రోవలే దనెడి కా•రుణ్యమునను
నన్ను నమ్మినదాని • కిన్ని పాట్లబ్బెన, నైఁచితి నను నానృ•శంస్యమునను
సర్వాంగలక్ష్మిని • సకల కోల్పడితిఁగా, సుందరి ననియెడి•శోకమునను
నొద్దలే దాయెఁగా • నొప్పులకుప్ప నా, ప్రియ యన్న వెరవేఁకి•వేఁకరమున

తే. సకల యీ నాలుగింటను • సడలు చుండు
రామచంద్రుండు హృదయ విరా•మయుండ
నిలిచె నీమెయుఁ బతియంద • నిలిచె మనముఁ
గాన బ్రదికెరి వీరలు • గడియ నైన. ౪౫౩

అర్థములు. అర్ధాంగలక్ష్మిని = తనదేహమునందు సగభాగమైన దానిని, కోల్పడితింగా = పోఁగొట్టుకొంటిని, రూ. కోలుపోవు - కొల్లపోవు - కోల్పోవు. వెరవేఁకి వేఁకరముసన్ = విరహాజ్వరముచే.

అర్ధాంగలక్ష్మి - 'లోకే వేదే చ శాస్త్రే చ ధర్మశాస్త్రేషు చైవ హి, శరీరార్ధం స్మృతా జాయా. పుణ్యాపుణ్యఫలే సమే.

లోకవ్యవహార మందు వేద మందు స్మృతు లందు ధర్మశాస్త్ర మందు భర్త దేహములో సగము భార్య. అట్లులే పుణ్యాపాపములందు సని యర్థము.

అర్ధో వా ఆత్మనో యత్పత్నీ॥
శాస్త్రప్రయోగా ద్వివిధాచ్చ వేదా
దాత్మాహ్యానన్యః పురుషస్య దారాః॥

ద్వేధాకృత్వాత్మనో దేహ, మర్ధేన పురుషోఽభవత్ । అర్ధేన నారీ తస్యాం స విరాజ మసృజత్ప్రభుః॥ మను సైనైవ రేమే తస్మా దేకాకీ నరమతే । సద్వితీయ మైచ్ఛత్ । సహైతావా నాస యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ । స ఇమే మేవా త్మానం ద్వేధా పాతయత్తతం పతిశ్చపత్నీచాభవతాం తస్మాదిద మర్ధబృగల మివ స్వ ఇతిహస్మాహ యాజ్ఞవల్క్య స్తస్మాదయ మాకాశః స్త్రియా పూర్యత ఏవతాగ్ం సమభవ త్తతో మనుష్యా అజాయంత । బృహ. వా. ౪. బ్రా, ౩ వ మంత్రము.

యో భర్తా సా స్మృతాంగనా । మను ౯. ౪౫.

యోభర్తా సైవ భార్యా స్మృతా - వాజసనేయ బ్రాహ్మణము.

కస్సవితా? కా సావిత్రీ? పురుష ఏవ సవితా, స్త్రీ సావిత్రీ యత్ర పురుష స్తత్ స్త్రీ । యత్రవా స్త్రీ సపురుష । తేద్వేయోనీ ఏకమేకం మిథునమ్॥ సావిత్ర్యుపనిషత్తు.

ఈ ప్రమాణములు పురుషునిలో సగము భార్య యని చెప్పుచున్నవి. కావున భార్యా భర్తృ సంబంధము జన్మాంతరము లందును తప్పదు. ఈవిషయ మయోధ్యా కాండము నందుఁ గిష్కింధాకాండము నందుఁ జర్చింపఁ బడెను.

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి సీతాదేవికై దుఃఖించుటకు హనుమంతుడు నాలుగు కారణములు చెప్పుచున్నాఁడు.

౧. పురుషుఁ డగువాఁడు ఆఁడుదియును ఆశ్రితులు విన్నంత మాత్రముననే దన ప్రాణమిచ్చియైన వారిని రక్షింపవలయును. ధర్మశాస్త్రమిట్లుండఁగా నాపద నొక్క లేమిటి నాదానిని నేను క్షత్రియుఁడనై యుండియుఁ గాపాడలేక పోయితిని గదా యను సర్వ భూతదయ.

౨. ఆ స్త్రీయైనను అన్యస్త్రీ గాదు. నేను దన్ను రక్షింపఁ గలవని నన్నే తన రక్షణాభారము నామీఁద వైచి నేను రక్షణము కొరకు సర్వ సౌఖ్యములు వదలి యన్ని కష్టములు పడుచు నా వెంట వచ్చినది. అట్టి దానికి నెట్టి కష్టము రానీయక కాపాడవలసి యుండఁగా నిన్ని కష్టము లామె పడుచుండినను ఆశ్రయ మును నేను చేరగాని వలె సహించితిని. నే నెంత క్రూరుఁడను ?

౩. నన్ను నమ్మి వచ్చినది బానిస కాదు. రక్త బంధువు కాదు. నా దేహ ములో సగమైనది. నా కుడిభాగము నేను రక్షించుకొను విధముగా నెడమ భాగము రక్షింపవలయును. అట్లు రక్షింపకుండిన నాకేమి హాని ? అంతటి భారము నాయం దుండియు నటువంటి సుందరిని జారవిడిచికొంటిని. నా దేహము నే కాపాడుకొన లేనివాఁడను. నే నేమి మగవాఁడను, నే నేమి క్షత్రియుఁడను ?

౪. మాకుఁ బరస్పరానురాగ ముండినను, లేకుండినను అది భార్య-భర్తవ్య యుని, నేను భర్త - పతి యుని యుండు వలన దానిని భరింపవలసిన పాలింపవలసిన భారము నాయం దున్నది. అంతమాత్రమే కాదు. సీతాదేవి యొప్పుల కుప్ప. సమస్త సద్గుణరాశి. అవగుణము లేనిది. ప్రియురాలు. నాయందు ప్రేమగలది. ఇట్టిది సమీపమం దుండినను 'ఒకరిభార్యా సమేతుఁడై యున్న వాని కెంత లాభమ లయ్యెను నెఱుఁగవలెను' అన్నట్టు లామె సాన్నిధ్యమాత్రమే నా కష్టములు కష్టములుగాఁ దోఁపనీయదు. విశేషము లేకున్నను ఆమెతో నింపుగా మాట లాడుచుండినను చాలు. అదియు లేకుండఁ జేసికొంటిని గదా. లక్ష్మణునకు వలె వెంట లేకుండిన నే వ్యస నము లేదు. ఉండిపోయిన దుఃఖ మెక్కువ. ఈ వియోగము నే నెట్లు సహింతు నని మొదటి మదన తాపమునను.

ఈ నాలుగింట రామచంద్రమూర్తి బాధపడుచున్నాఁడు. ఈ నాలుగవది లేకుండిన రామచంద్రమూర్తి నపుంసకుఁడో, మందుఁడో, మనుష్య స్వభావ శూన్యుఁడో యని చెప్పవలసి యుండును. ఈ కారణములచే రామచంద్రమూర్తి కేవల కాముఁ కుఁడై దుఃఖింపలే దని యేర్పడుచున్నది. రామచంద్రమూర్తి యామెయందుఁ దన మనస్సు నిలిపెను. ఈమె రామచంద్రమూర్తి యందు మనస్సు నిలిపెను. కావున వీరి మనస్సు లెన్నటు న్యాయముగా మండవలయునో యున్నటనే యున్నవి. దేహములు మాత్రము వేఱుగా నున్నవి కాని మనస్సు లేకముగా నున్నవి. కావుననే వీ రిరువురు బ్రతుకఁ గలిగిరి. అయిన మనస్సు ఈమె యందు లేకుండినను ఈమె మన స్సాయన యందు లేకుండినను ఇరువురు మరణించి యుందురు. జీవాత్మ పరమాత్మల కీ సంబంధము నెఱుంగునది.

౫. ఎంతటిదుష్కరమును ధీరా, కాంచుఁడు ఘటించుచె సేమెఁ ॰ గనరయు బ్రదికెన్ వంతావ్యథఁ జిక్కుచును, వింటి గ దే మిగుల రాము॰విభుఁడరిరింబుల్. ౪౫౪

అర్థములు. దుష్కరము = చేయుటకు మిగులఁ గష్టమైనది.

## తాత్పర్యము.

ఈమెతో సరస సల్లాపము లాచరించిన రోజు, సంభోగించి యుండినను మాసము, కనులకైనఁ జూడక యీమెను విడిచి యిన్ని దినములుగ బ్రదికి యున్నాఁడే. బ్రదికి యుండుటే కాదు, చింతచే బాధపడ కున్నాఁడే. రామచంద్రమూర్తి యెంతటి యసాధ్య కార్యమును జేసెను.

ఆయుష్షు తన స్వాధీనము గాదు. కావున బ్రదికియున్నాఁ డనుకొందుము. చింతచేతఁ గూడ కృశించకున్నాఁడే. ఏమువలెనా యుండునా. ఏమువ్వన లేదు. ఏమాత్రము ప్రేమగలవారు పోయినను దుఃఖము వచ్చును. అంతియు కాని యట్టి దానిని బోఁగొట్టుకొని యీమెవలె నిద్రచాలించెనా? ఆహారము చాలించెనా? పరుపు పెట్టెనా? ఈ వియోగమునకుఁ దగినంత కార్యమేమి చేసెను. రామచంద్రమూర్తి వనవాసి మునుల నాశ్చర్యకరమైనదే. ఏమి యీయన యింద్రియ జయము. ఋశ్యమూక మందు రామచంద్రమూర్తి యీమెకై యేడ్చుచుండుట చూచి యయ్యో యింతటి ధీరోదాత్తుఁడు మహానుభావుఁడు ఒక యువతికొరకై గా విలపించుచున్నాఁడే. ఎంత కామదాసుఁడు, ఎంత యింద్రియపరవశుఁ డని తలంచితిని గాని యీమెను జూచిన తరువాత రామచంద్రమూర్తి పాషాణహృదయుఁ డనియే చెప్పవలసి యున్నది.

రాముఁడు భూకాంతుఁడు గనుక బ్రదికెను. 'నిందు మనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము, జగన్నుత విప్రులయందు నిక్క మీ రెండును రాజులందు విపరీతము' రాజులకు వాక్కు తీపిగాని, మనస్సు వజ్రకఠినము. కావున బ్రదికెను. భూకాంతుఁడు అచేతనమైన భూమిని అశ్వగజరథాదుల నాక్రమింపఁ జేయువాఁడే కాని ప్రణయపాత్రమైన భార్యను రంజింపఁ జేయు నంతటి రసికుఁడు గాఁడు కావున బ్రదికెను.

బ్రదికెన్ = బ్రదికియున్నాఁడే. అది యాశ్చర్యము. సీతాదేవిని విడుచుట వలన నెంత దుఃఖము కలుగవలయునో యంత దుఃఖము రామునకున్న నెవల బ్రదికియుండునా? బ్రదుకక యేమి చేయు ననెదవు? ఆత్మహత్య చేసికొను ననెదవా? అక్కఱలేదు. ఈమెను విడుచుటవలన నెంతదుఃఖము కలుగవలయునో యంతదుఃఖము కలవాఁ డయ్యెనేని ప్రాణములు తమంతటఁ దామే యీశరీరమును విడిచి కాలువన్న యింటిలో మనుష్యులుండక పోవునట్లు పోయి యుండును. ఈయన ప్రయత్న మక్కఱనే లేదు. అట్లైన సీత ప్రాణ మేల పోలేదు. ఆమెకు దుఃఖము లేదనెదవా అందు నేమో? సీత పరతంత్ర, భర్తయాజ్ఞ లేక మరణించుటకు నధికారము లేదు. ఆమె దేహము, ప్రాణము రాముని సొత్తే. ఆమె నెట్లు పోఁగొట్టం గలదు. అవి పోయెద మన్నను నామె బిగఁబట్టవలెను. రాముఁడు స్వతంత్రుఁడు. దేహము వదలిపెట్టవలసి యుండెను. వదలిపెట్టక బిగఁబట్టి యున్నాఁడే. అదియే యసాధ్యకార్యము.

తెలుచుకొనునా యందువేమో ! తెలుచుకొనునా యని సందేహమేల ! ఘటి యించెన్=చేయనే చేసెనుగదా. ముంకేటి శంకగాని కద్ద మేల ! తన తెలివిలేమికిం దా ననుభవించునుగాక ! నిష్కారణముగ నిటువంటి నిష్పాపను నింత కష్టములపాలు చేసెంగదా. దానికై నే నేడ్చెదను !

తన తండ్రి కాముకుండై భార్యకు వశపడి తన్నిట్లు కష్టపెట్టె ననికదా రాముఁడు చెప్పెను. (అయోధ్య స. ) తానో భార్యయం దుంచవలసిన ప్రేమ యుంచకకదా నిష్కారణముగ నీమె నింత కష్టపఱచెను. తమ్ముఁడు, పెండ్లా మిరువురు తనకు సేవ చేయ నుండినను ఊరువిడిచి రావలయుననిన నంత కష్టపడినవాఁ డొంటరిగ మనుష్య ముఖదర్శన ప్రాప్తి లేక రాక్షసులచేతిలోఁ జిక్కి యెంత కష్టపడుచున్నదో యాలో చించెనా ? కావున రామచంద్రమూర్తి చేసినది చెడుకార్యమే. ఏల యిట్లు చేసెను! ప్రణయవిద్య యందు నాయనకు ఓనమాలుకూడ రావు. గనుక ప్రణయ మనునది తెలియక చేసెనేకాని తెలిసి చేసినవాఁడు కాఁడు.

దుష్కరమును = భార్యను విడిచియుండుట దుష్కరమేని లోకములో భార్యలులేనివా రెందఱు లేరు. వా రందఱును దుష్కరమును జేసినవారా ? కారు. 'అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా' సూర్యునకు నెండవలె సీత నా కనన్య; నన్ను విడిచి యుండదు; ఆమెను విడిచి నే నుండను అని చెప్పినవాఁడు కదా రాముఁడు. ఎండనువిడిచి సూర్యుఁ డుండుట సుకరమా! ఎండను విడిచి సూర్యునివలె సీతను విడిచి రాముఁ డుండుట దుష్కరము కాదా. ఎండలేని సూర్యుఁడు తేజోహీ నుఁడు, పూజ్యుఁడు కాఁడు. ఎండవలని మేలునకై కదా లోకులు సూర్యుని బూజిం చుట. ఎండలేని సూర్యుని నెవరు పూజింతురు. అట్టులె సీతాదేవి తనతోడ లేదేని దాను తేజోహీనుఁడు, అపూజ్యుఁడు అని కూడ నాయనకుఁ దోఁచినది కాదు కదా. అట్లయిన నెట్లు విడిచి యున్నాఁ డనిన, భూకాంతుఁడు గనుక భూమి (రాజ్యము) ఆయనకుఁ గాంతము = ప్రియమైనట్లు సీత కాలేదు. కావున మృగమువీఁది కాంక్షచే సీతను విడిచి పోయి నట్లు రాజ్యకాంక్షచే సీత నుపేక్షించెను.

క. ఎంతటి దుష్కరమును దుర్దాంతపరాక్రముఁడు సల్పె • రాముఁడు సీతా
కాంత మదిరాయతాంబక, చెంతను లేకున్నఁ ద్రుటియు • జీవముఁ దాల్చెన్.

అర్థములు. దుర్దాంత పరాక్రముఁడు = అణఁపరాని విక్రమము గలవాఁడు, మదిర + ఆయత + అంబక = సారాయము వలె మోహింపఁజేయు దీర్ఘములైన నేత్రములు గలది. త్రుటియు = అల్పకాలమైనను.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి నిజముగ దుష్కరకార్యమే చేసెనని దృఢపఱుప, దానినే మఱియొక విధముగఁ జెప్పుచున్నాఁడు. 'అదరా ద్వ్యుక్తి' యని కలదు గదా.

దుర్దాంత పరాక్రముఁడు = అణఁపరాని పరాక్రమము గలవాఁడు. ఇచ్చట శత్రువుల కని చెప్పుట యప్రస్తుతము. ఇచ్చట శత్రువు లింద్రియములే. ఇంద్రియము లను వణఁపరాని మనోబలము కలవాఁడు కావుననే కామమునకు వశపడక బ్రదుకఁ గలిగెను.

మదిరాయతాంబక:— మదిరా = సారాయమువలె, మత్తును గలిగించు, ఆయత+అంబక=దీర్ఘములైన కన్నులుఁ గలది. మదమనఁగా సంతోషము. సంతో షాతిశయముచే దేహము దెలియకుండఁ జేయునది మదిర, అట్టి గుణముగల దీర్ఘ నేత్ర ములుగలది. సారాయము ద్రావిన వానికి దేహము తెలియకపోవునట్లు లామెకన్నులు చూచిన నంతటి సంతోషము గలుగు నని భావము. సారాయమువలెఁ ద్రాగ వలసిన పనిలేదు. దగ్గఱ నుంచుకొని చూచుచుండినఁ జాలును. దానివలె నల్పకాల ముండునది కాదు శాశ్వతముగ నుండునది. చెంతను లేకున్న = అనుభవింపక పోయినను ఊరక సమీప మందుండినను జాలును. త్రుటియున్ = మత్తు వస్తువులు సేవించువారు దానిని వేళకుఁ దీసికొనక క్షణ మాలసించినను వెఱ్ఱి యెత్తినట్లయి మిగుల బాధ పడుదురు. విశేషాభ్యాసముగలవారు చావనే చత్తురు. అట్లుండ నిన్ని సంవత్స రము లనుభవించుచుండి యిప్పుడు తటాలున నీమెను వదలి క్షణమైన నెట్లు బ్రదుకు చున్నాఁడు. ఇది దుష్కరమే కదా. సారాయము మనుష్యుఁడైన వానికెట్టివానికైన దేహ విస్మృతి కలిగించి తబ్బిబ్బు పడఁజేయును. బండమీఁద బోసిన నే మగును ? అట్లులే యీమె కన్ను లాయనకు మత్తు కలిగింపలేను. కావున ఆయన హృదయము గుండో, రాయియో యై యుండవలెను.

జీవముఁ దాల్చెను=జీవుని ధరించెను. శివితేశ్వరి యగు నామె పోయినపిమ్మట నాకేమిపనియని జీవుఁడు పోవఁదలఁచినను బోనీయక బిగఁబట్టెను. ఇదిదుష్కరమేకదా. ఇంతటి యసాధ్యకార్యములు సాధించు రామచంద్రమూర్తి సామాన్యుఁ డని యెట్లు చెప్పవచ్చును. ఇది చేయఁగలిగినవాఁ డెంత యసాధ్యమైన కార్యమైనను జేయఁ గలవాఁడే.

దుష్కరమును హేమాహేమీలు ఘటాఘటీ లగు వానరు లందరు మాచేతఁ గాదు మాచేతఁగాదని చెప్పినదానిని సముద్రముదాటి లంక ప్రవేశించి రావణునకు దెలియకుండ లంకయంతయు శోధించి సీతను జూచి నేనే యసాధ్య కార్యమును జేసితి నని గర్వించితిని కాని రామచంద్రమూర్తి చేసిన కార్యము నెదుట నేను జేసినది గొప్పగాదు.

క. అని జానకిఁ గని పావని, మనమున సంతోషమగ్న•మానసుఁ డగుచున్
ఘనుఁ బ్రభుని రాము నెంతయుఁ, గొనియాడె నదెంతవాఁడొ•కో యతఁడనుచున్

తా త్ప ర్య ము.

అని తలఁచుచు జానకీదేవిని జూచి మాసినచీరతో స్నానములేని దేహముతో నిద్రాహారములు విడిచి భర్తనే ధ్యానముచేయు నిట్టి పరమపతివ్రతను జూచు నదృష్టము నాకుఁ గలిగెఁగదా. వానరు లందఱు బ్రదికిరిగదా. సుగ్రీవుఁడు కృతజ్ఞుఁ డయ్యెఁ గదా. రామలక్ష్మణుల కార్యము నెఱవేఱెఁ గదా యని సంతోషములో మునిఁగిన మనస్సు గలవాఁడై ఘనుఁడును ప్రభువును నగు రామచంద్రమూర్తిని 'ఆహా యీయన యెంత గొప్ప వాఁడో, గాకున్న నిట్టిస్త్రీకి భర్త యగునా! ఎంతటి జితేంద్రియుఁడు గాకున్న నీమెను విడిచి బ్రతుకునా ? ఎంతటి ప్రభువు = సమర్థుఁడు గాకున్నఁ బోనున్న ప్రాణముల నిలుపఁ గలుగునా ? ఇంత కార్యము చేయఁగలుగునా? ప్రభుః = ప్రభవతి సమర్థో భవతీతి ప్రభుః - భూ సత్తాయాం - సమర్థుఁ డగువాఁడు ప్రభువు. అని రామచంద్రమూర్తి సామర్థ్యమును బొగడెను.

—• ౧౬-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవి స్థితికి దుఃఖించుట. •—

ఉ. రాము గుణాభిరాము నల•రామ నుతించి ప్రశంసితవ్యఁ జిం
తామథితాత్ముఁ డై పవన•నందనుఁ డశ్రులు గ్రమ్మ కన్నులన్
రాముని దేవిఁ గూర్చి యపు•డా యనుచున్ విలపించి మూర్త మి
ట్లా మహిమాఢ్యుఁ డుండి తద•నంతర మి ట్లని యేడ్చె దుఃఖియై. ౭౫౭

అర్థములు. గుణాభిరామున్ = గుణములచే నభిరాముఁ డగు వానిని, అల= ప్రసిద్ధికెక్కిన, ప్రశంసితవ్యన్ = గుణములచేఁ బొగడఁ బడఁదగినదానిని, ఆయన రాముఁడు, ఈమె రామ; ఆయన గుణాభిరాముఁడు, ఈమె ప్రశంసితవ్య కావున నిరువురు సమాను లని భావము. సీతారాములు గుణము లందు సమానులు. వాత్సల్య సౌలభ్యముల యందు సీత రాముని కంటె శ్రేష్ఠురాలు కావున నిరువురు కలసిననే గుణసంపూర్తి. లేకున్నఁ గొఱఁతయే. పరతంత్రగావున రాముని కంటెఁ దక్కువ. చింతామథితాత్ముఁడు = చింతచేఁ జిలుకఁబడిన మనస్సుగలవాఁడు. అశ్రులు = కన్నీళ్ళు, మహిమాఢ్యుఁడు = మహిమ యను సంపత్తిగలవాఁడు. గొప్ప గుణములను నవి లోకమున నేవికలవో యవి యన్నియు హనుమంతునందుఁ గలవు. దుఃఖియై = దుఃఖము గలవాఁడై.

తా త్ప ర్య ము.

గుణాభిరాముఁ డగు రాముని గుణములచేఁ బ్రశంసింపఁదగిన ప్రసిద్ధి కెక్కిన సీతను హనుమంతుఁడు పొగడి చింతచే వ్యాకులపడిన మనస్సుగలవాఁడై యీయంజనేయుఁడు కన్నీళ్ళు కారఁగా రామచంద్రమూర్తి భార్య యగు సీతాదేవి నుద్దేశించి యౌరా యీమె యెటువంటి యుత్తమురాలు. ఇటువంటి యీమె కెటువంటికష్టము వచ్చెను, అని యేడ్చి యీ ప్రకార మీ గొప్ప గుణసంపత్తిగల హనుమంతుఁడు కొంచెము సే పుండి మరల దుఃఖము సైఁపలేక యిట్లేడ్చెను.

క. శీలవతి గురువినీతుం, డా లక్ష్మణునకును మాన్య•యతని గురునకున్
మేలిప్రియ సీత వగచినఁ, గాలము దురతిక్రమంబె•కా యెవ్వరికిన్. ౪౫౮

అర్థములు. శీలవతి = పతివ్రత, గురువినీతుండు = మిక్కిలి జితేంద్రియుఁడు (౨) మిక్కిలి వినయము గలవాఁడు (౩) గురువులచే శిక్షింపఁబడినవాఁడు. లక్ష్మణునకును = లక్ష్మణు నంతవానికిని, మాన్య = పూజింప నర్హురాలు. దురతిక్రమంబెకా=అతిక్రమింపరానిదే కదా. ఎవ్వరికిన్=ఎంతటివారికైనను.

తాత్పర్యము.

ఈమె మహాపతివ్రత. ఆ కారణముచేతనే యీమె కెట్టి యాపదయు రాఁగూడదు. అంతియగాక, మిక్కిలి జితేంద్రియుఁడు 'తరుణీ కుణప మన్నట్లు పరస్త్రీలను శవములవలెఁ జూచువాఁడు. అటువంటి లక్ష్మణునకు మాన్య- పెద్ద లగు జ్ఞానులచేఁ జక్కఁగా శిక్షింపఁబడిన మనస్సు గలవాఁడు. కావున పరిపక్వమైన మనస్సుగల వాఁడు. అటువంటి లక్ష్మణునకును మాన్య, 'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ' అన్నట్లు భగవంతునం దెంత భక్తియో యంతభక్తి యన్న యందుఁ గలవాఁడు. అటువంటి వానికిని మాన్య. అంతియ కాదు. అటువంటి లక్ష్మణుని గురువునకు మిక్కిలి ప్రియురాలు. అంతటివాని గురు వీమె యం దెంత గొప్పతనము లేనిదే యీమె యందుఁ బ్రియము గలవాఁ డగునా? అటువంటి సీత. ప్రకృతి కతీత. అందఱివలెఁ బాంచభౌతికమైన గర్భమునుండి కర్మానుభవమునకై పుట్టినది కాదు. అట్టి యీమెకే వ్యసనము ప్రాప్తించిన నిఁక లోకము నందుఁ గాలము నతిక్రమించువాఁ డెవఁడు! అది యెవ్వని కెంతవానికి సాధ్యము గాదు.

కాలము దురతిక్రమం బను నీతి రామాయణమునఁ బలుతావుల బోధించుచున్నది. కావున నా నీతిని నెక్కువగ మనస్సునం దుంచికొని సర్వము కాలాధీనము గదా యని దుఃఖ సంతోషములకుఁ బాలుపడ రాదు. జగద్రక్షకులైన రామ లక్ష్మణులు రక్షించు నప్రాకృతయైన సీతకే యీ లోకమునకు వచ్చిన కారణమున నిన్ని కష్టములు ప్రాప్తించెనే, ఇఁక మన మనఁగా నెంత యని సముద్రమున పైపై నలలు కదలిన లోఁతున నీళ్లు కదల నట్లు మనస్సు పరితాపపడినను బుద్ధిని వ్యాకుల పడ నీయరాదు. సహింపవలెను. యుద్ధ. ౨౬. ౨౫ పద్యముజూచునది.

క. రాముని వ్యవసాయంబును, ధీమత్సౌమిత్రిమతముఁ • దెలియుట సీతా
భామామణి కలఁకం గన, దేమియు వానలకు వేల్పు•లేటి విధమునన్. ౪౫౯

అర్థములు. రాముని వ్యవసాయంబును = రామచంద్రమూర్తి నిశ్చయమును, రామచంద్రమూర్తి తన యాశ్రితులను వారి ప్రయత్నము నపేక్షింపకయే తానే సర్వప్రయత్నములుచేసి వారి నేవిధముగనైన రక్షించువాఁడు'వ్రతమిదినాకున్ విడిచెద బ్రాణము లైనను' అని యాశ్రితరక్షణమును దన ప్రాణ మిచ్చియైనఁ జేయువాఁడు.